

చాముండికొండ మీద నంది (మైసూర్)

ఫోటో: వి. వి. రాయసంకాలు (బంతపల్లి)

# తప్పక చూడండి!



అన్నపూర్ణా వారి...

# ఇద్దరు మిత్రులు

నవయుగ






NVKR

నిర్మాత.. D. మధుసూదనరావు B.A.; దర్శకుడు.. ఆదుర్తి సుబ్బారావు..

# ఉత్తరాలు

## ముఖచిత్రం

26–1–62 సంచిక ముఖచిత్రం చూడగానే పటం కట్టించేయాలనుకున్నాను. అను కోవటమేగాదు పటం కూడా కట్టించాను.

యం. రమేష్ (కాకినాడ)

## కార్టూన్

బాపుగారు కార్టూన్‌ద్వారా నందమూరి తారక రామారావును పరిచయముచేసినందుకు చాలా సంతోషించుచున్నాము.

కుమారి నందారపు పార్వతి,
నందారపు రాజేశ్వరి, విజయలక్ష్మి, (సి. వి. బళ్ళారి.)

* * *

నా అభిమాన నటుడు అయిన ఎన్. టి. రామారావుగారి కార్టూను చాలా చక్కగా వేసిన బాపు గారికి, మీకూ నాకృతజ్ఞతను తెలియ జేయుటకు నేను ఎంతయో సంతసించుచున్నాను.

కె. మోహనరావు (హైదరాబాదు)

* * *

బాపు, నటుడు నందమూరి తారక రామారావు గుర్చించి "ఆనందమూరి తారగా వెలగొన్నతావు" అని వ్రాశారు. చాలాబాగుంది.

పి. ఉమాపతిరెడ్డి (కరీంనగర్)

## తెరవెనుక తారలు

తెరవెనుక తారలు—2 భద్రయ్యను గూర్చి చదివినాను. వ్యాసము చాలా బాగా ఉన్నది.

ఓరుగంటి సోమసుందరరావు (శ్రీకాకుళం)

* * *

పత్రికలో "తెరవెనుక తారలు" అనే శీర్షిక పెట్టి సినీపరిశ్రమలోని సాంకేతిక నిలువలను పరితల కందజేయటం ఎంతో కొనియాడ తగిన విషయం. ఈ వారం ఫోగిన్ రూపాన్ని కె. వి. యస్. శర్మకు భద్రయ్య ఎలా తీర్చి దిద్దారో రచయిత చక్కగా వివరించారు. ఇది చదివిన తరువాత సినీ శ్రేయోభిలాషులకు మేకప్‌లో వుండే విలువకూడా అర్థమై యికపై చిత్రాలలో మేకప్‌మేన్ ప్రతిభను కూడా గుర్తించగలరనుట నిస్సందేహం.

కె. పార్వతీశ్వరరావు (ఉర్లాం)

## సినిమా వ్యాసాలు

వాసంతిదేవిగారు వ్రాసిన "సావిత్రి అక్కయ్య" అనువ్యాసంవల్ల, నిజంగా సావిత్రిదేవి, వాసంతిదేవిగారికి అక్కయ్య అయినటులనే పాఠకులను మై మరపించింది.

—అయినంపూడి అర్జునరావు (కారుమూరు)

* * *

శ్రీమతి "సావిత్రిగణేశన్" గూర్చి వాసంతి బి. ఎ. గారు, సావిత్రిగారితో తనకు పరిచయమైన విధమును, తను ఏవిధముగా సినిమారంగంలోకి చేరిన విషయము గూర్చి వ్రాసినవ్యాసము చదువుతుంటే, నేనుగూడా సినిమా రంగంలోచేరి ఒక పెద్ద యాక్టరు కావలయునని, నా మనస్సు ఉబలాట పడినది.

ఇది నిజము! మీరు చెప్పినా నమ్మరు!

కె. వరసయ్య (పైదాపురం)

కుమారి జమునగారి 'నా ఫేన్‌మెయిల్' చదివి తెగనవ్వి తుదకు నిరాశతో నిట్టూర్చాను. ఎందుకంటే—ఆవిడగారి వంటవాడు నెయ్యి వెచ్చపెట్టటాని కుపయోగించిన ఉత్తరాల కట్టలో బహుశా నా ఉత్తరంకూడా ఉండిందేమోమరి? లేకపోతే ఇంతటి సువిశాల హృదయురాలైన తారామణి నాలాంటి అభిమానిపై కనికరంచూపి ఫోటో కాదుగదా—కనీసం రిప్లయి కూడా ఇవ్వలేదు సుమండీ!

టి. ఎం. అరుణకుమార్ (ఎమ్మిగనూర్)

* * *

సరళ, కె. అరుణ, జ్యోతి అనేపేర్లుగల స్త్రీత్రయం రాజమండ్రినుంచి దేవికగారి "స్వయంవరం" పై రాసినవిమర్శ చదివాను. వీరురాసిందాన్ని బట్టిచూస్తే, మేంకూడా సినీతారలం అవలేకపోయామే అని బాధపడుతూ, సినీతారలయినవారి మీద ఈర్ష్యతో రాసినట్లు కనబడుతోంది. దేవిక గారి "స్వయంవరం"లో వినోదం లేకపోయినా, పనికొచ్చేది బోల్డువుంది. "స్వయంవరం"ని చదివిన ప్రతివారికి మన సంస్కృతి సభ్యత ఎంత క్రిందికి దిగజారి పోయాయో తెలుస్తుంది.

ఆతర్వాత దేవికగారు తన్ను సీతాదేవి (మహాపతివ్రత, శ్రీరామచంద్రునిభార్య!)తో పోల్చుకుందని అర్థంలేకుండా విమర్శించారు. ఆమె నటించిన చిత్రంలోని పాత్రపేరు "సీత" అని ఆమె వ్రాశారు. అంచేత లంకనించి వ్రాసినవ్యక్తి చిత్రంలోని సీత వేషంవేసిన తనని ఎత్తుకు పోవడానికి వస్తాడేమో నని వ్రాసింది. అంతేగాని తనే సీతనైనట్లుగా గొప్పేం చెప్పుకోలేదు.

ఇకముందు ఈ లాంటి విమర్శలు చేసి విమర్శకున్న గౌరవాన్ని పోడగొట్టవద్దని సరళ, కె. అరుణ, జ్యోతిగార్లను కోరుతున్నాను.

వనితాలోకంలోని మిగతా స్త్రీల వ్యాసాల కంటే, దేవికగారి వ్యాసం ఏమీతీసిపోలేదు .... ఎందరో మహానుభావురాండ్రు.

దాతారి హనుమంతరావు (రాజమండ్రి)

## కీర్తన

గణేశస్తుతి (కీర్తన) నన్ను ప్రత్యేకించి ఆకర్షించినది. సులభమైన శైలిలో, చక్కని రాగములో రచించిన ఈ కీర్తన చాలాబాగున్నది. శ్రీ శాంతి సీతారామయ్యగార్కి నా ప్రత్యేకధన్యవాదములు మీద్వారా తెలుపుకొనుచున్నాను.

ఒక అభిమాని (విశాఖపట్నం)

## కథకానికథలు

ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురించే కథకానికథలు ఇతరులు పంపుచున్నారా లేక మీరు సొంతగా వ్రాసి ఇతరులపేర్లు పెట్టుచున్నారా! ఈ సందేహము తీర్చవలసినది.

నబ్బవీను సుబ్రహ్మణ్యం (నెల్లూరు)

తీర్చలేమనుకుంటున్నాము.

## చదువుల్రావు

సంక్రాంతి సంచికలో చదువుల్రావు పోలీస్ చేతుల్లో పడ్డప్పుడు సానుభూతి చూపిన అమ్మాయి ఎవరు? చదువుల్రావుకు కాబోయే హీరోయినా ఏంది?

వై. నా. కృ. (బెంగళూరు)

* * *

నీకు చదువులు రాకపోవటంతోపాటు పరీక్షలు ఎప్పుడోకూడా తెలియదులాగుందే! కాలేజీ విద్యార్థుల (యూనివర్సిటీ) పరీక్షలు ఏప్రెల్‌లో ఉంటాయికాని మార్చిలోకాదు. ఇప్పటినుంచైనా బాగా చదివి పాసవు!

నాగం వెంకటగోపాలరావు,
పెనుమూడి పద్మనాభరావు (బందరు)

* * *

మీ "చదువుల్రావు" గారికి మార్చినెల వస్తోంది, కాస్త తిరగడం, గప్పాలుకొట్టడంమాని బుద్ధిగా చదువుకోమని చెప్పండి. ఆ "చదువుల్రావు"లాంటి సుపుత్రుడు మా ఇంట్లోనూ ఒక డున్నాడు!

జి. సుభద్రాదేవి (గుంటూరు)

## సీరియల్ కథ

'కవిసార్వభౌముడు' నవలని పొరపాటున ఆంధ్ర వార పత్రికలో ప్రచురిస్తున్నారేమోననే అనుమానం కలుగుతోంది 'పై అంతస్థుకు' చెందిన శ్రీ శాస్త్రి గారి భాషాశైలి చూస్తూంటే! సంక్రాంతి సంచికలో సంస్కృతము, ప్రాకృతములతో అలంకృతుడైన "కవి సార్వభౌముడు"ని మేము అర్థం చేసుకో లేకపోయాము. ముఖ్యంగా ముగ్గురు 'సినిమా తారల తమాషా' వ్యాసాలు చదివాక 'కవిసార్వభౌముడు' చదివితే మైసూర్‌పాక్ తిన్న వెంటనే పచ్చిమిరపబజ్జీ తిన్నట్లనిపించింది! నిజం చెప్పాలంటే మైసూర్ పాక్‌కన్న పచ్చిమిరప బజ్జీ అంటేనే యిష్టం ఎక్కువ నాకు (పూర్తి చేశాక పది గ్లాసులు నీళ్ళు తాగినిప్పటికీ! ఆంధ్రుణ్ణి కాబట్టి.)

"బ్రహ్మచారి" (బందరు)

## కథలు

'శకటిదొంగలు' కథ చదివినాను. ఈ రోజుల్లో మన రాజధాని (హైదరాబాదు)కి క్రొత్తగా వచ్చే వాళ్ళకు ఈ కథ చాల అవసరము.

వి. ఆర్. ధన్‌రాజ్, పి. సరస్వతి (హైదరాబాదు)

* * *

యాదృచ్ఛికం కథ నన్ను చాలా ఆకర్షించినది. ముఖ్యముగా ఆ కథలాంటి కథను ఇంతకుముందు ఎన్నడు చూడలేదు. అంటే అంత మంచిగా ఉన్నదన్నమాట. కథకులకు, చిత్రకారులకు నా అభినందనలు.

బి. రామమోహన్‌రావు (హైదరాబాద్)



పంకా
సుఖములో
కొత్త పరిధి

# విజయ్

16 అంగుళముల

## మేజా పంకాలు

(ఏసి ఆసిలేటింగ్)








ఇండియాలో తయారయ్యే పంకాలలో వేగము మార్పుచేయు ప్రెస్‌బటన్ యేర్పాటు గల పంకా యిది ఒక్కటే.

- మిసమిసలాడే లేత రంగులతో మనోహరమైన 'విజయ్' పంకా అతిథి సత్కారపు గదులలో దేనికైనా అందమును, చల్లదనమును చేకూరుస్తుంది.
- పొందికైన విజయ్ రోటర్ నిశ్శబ్దముగా పని చేయును. ఎడతెగకుండా ప్రతి నిత్యము పనిచేయుట వలన కలిగే అరుగుదలకు తట్టుకొనగలదు.
- అమ్మబడిన ప్రతి విజయ్ పంకాయొక్క నిర్మాణ లోపములన్నింటికి రెండుయేండ్ల హామీయివ్వబడును.

సోల్ డిస్ట్రిబ్యూటర్లు:

**ఓబుల్ రెడ్డి ఏజెన్సీస్,**

ధున్ బిల్డింగ్స్, మౌంట్‌రోడ్, మద్రాసు—2

తయారుచేయువారు:

**నేషనల్ ఎలెక్ట్రికల్స్,**

ఇండస్ట్రియల్ ఎస్టేట్, మద్రాసు—32.




EP/OBA/2 TEL

# ఆంధ్రసచిత్రవారపత్రిక


వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు


## విషయానుక్రమణిక


శుక్రవారం : 9-2-62
ప్లవసం॥మాఘమాసం శు॥పంచమి
సంపుటము : 54 సంచిక : 23
స్థాపితము:
1908
*
ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్
*
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
విడిప్రతి : 25 న. పై
సంవత్సర చందా : 13-0-0 రు.
*
ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీథి, మద్రాసు-1






★

### లోకంపోకడ



"అమ్మా! నాన్నకేమన్నా పిచ్చెక్కిందా?"
"లేదు బాబు! ఆయన పార్లమెంటుకు ఎన్నికైతే ఇవ్వదలచిన ఉపన్యాసం రిహార్సెల్ రా అది."


ఆహా! ఏమినా అందం
ఎన్నికలలో అభ్యర్థులు
ఓహో! ఏమి నా సొగసు
అబ్బ! ఎంత అందంగా ఉన్నాము
చకచని చుకచనినేనే!
అందం మనసొత్తు!
కాంగ్రెసు
స్వతంత్ర
సి.పి.ఐ
జన సంఘం
హిందూ మహాసభ


చనిపోయిన వారి గుండెలు మళ్ళీ ఆడేట్లు చేయకల పరికరాన్ని బ్రిటిషవారు కనుగొన్నారు.
ఇహనేమి! పోర్చుగల్ బ్రిటన్ సహాయం కోరవచ్చు!!
గోవాలో మరణించిన పోర్చుగీసు సామ్రాజ్య వాదం
మీరు నెహ్రూ తోట మాట్లాడు తారా కదూ
మీరు స్వయంగా వచ్చి మాట్లాడ రాదా?


వారికి అర్థమయ్యే భాష
భారత దేశం దౌర్జన్యాన్ని దౌర్జన్యంతోనే ఎదిరిస్తుంది
పాక్ బెదిరింపులు



వీరి సంస్మరణ దినోత్సవంనాడు రాజఘాట్‌లో గాంధీజీ సమాధివద్ద సాయుధబలాల ప్రతినిధులతో అంజలి ఘటిస్తున్న ఉపరాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్.

# ఢిల్లీ పాలక సంఘానికి ప్రజాసేవకుల బెడద: చట్టాలు పాటించేవారికి పుట్టగతులు పూజ్యం

శ్రీకృష్ణ

ఢిల్లీనగరంలో ఇప్పుడు చడీచప్పుడు లేకుండా ఉంది. అందుకనే వార్తలకు కాటకం ఏర్పడింది. మంత్రులందరూ ఎన్నికల ప్రచార యాత్రలలో నిమగ్నులైనారు. కొందరు మంత్రులను గెలిపించేటందుకు ప్రధానమంత్రే నడుం కట్టుకుని తిరుగుతున్నారు.

ఈ నగరానికి ఇప్పుడొక ప్రత్యేక సమస్య దాపరించింది. తాత్కాలికమైన బుద్ధిమాంద్యంవల్లనో, మరేకారణాలవల్లనో బ్రిటిష్‌వారు ఢిల్లీకి కేంద్రపాలిత ప్రాంతమంటూ ఒకటి సృష్టించారు. నిజానికి వారు వాషింగ్టన్ పద్ధతిని అనుసరించి ఉన్నట్లయితే బాగుండేది. ఢిల్లీకిమల్లేనే వాషింగ్టన్ కూడా ఫెడరల్ ప్రభుత్వ రాజధాని. దాని వైశాల్యం 70 చదరపు మైళ్ళు. కాని అది కొలంబియా రాష్ట్రంలో ఒక జిల్లా మాత్రమే. ఈ జిల్లాకు ఒకవైపున మేరీలాండ్, మరొకవైపున వర్జీనియా రాష్ట్రాలు ఉన్నాయి. అదేవిధంగా 70 చదరపు మైళ్ళ భూభాగాన్ని భారత రాజధానీ ప్రాంతంగా నిర్ణయించి, పాత ఢిల్లీని, పరిసర గ్రామాలను పంజాబ్‌లోను, యమునానదికి ఆవలఉన్న ప్రాంతాన్ని ఉత్తరప్రదేశ్‌లోను కలిపివేస్తే ఏ చిక్కూ ఉండేది కాదు.

అట్లా కాకుండా ఢిల్లీకి ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు చేయటంతో దాని పరిపాలన మరొక సమస్య అయికూర్చుంది. బ్రిటిష్‌వారు రెండు తెలివి తక్కువ పనులు చేశారు. కలెక్టరేట్ కూడా ఏర్పాటు చేయడానికి వీలుకానంతటి తక్కువ ప్రాంతానికి ఇద్దరు అధికారులను నియమించారు. ఈ రాష్ట్రానికి అధిపతి చీఫ్ కమీషనర్. ఆయన క్రింద డిప్యూటీ చీఫ్ కమీషనర్ అని మరొక అధికారిఉన్నాడు. పార్కిన్‌సన్ సిద్ధాంతాన్ని అనుసరించి ఢిల్లీ రాష్ట్ర పరిపాలనా వ్యవస్థ ఆనవాలు పట్టేందుకు వీలుకానంతగా పెరిగిపోయింది. ఉద్యోగస్థులకు, ఉద్యోగాన్వేషకులకు మధ్యఉండే సంబంధం భార్యాభర్తల సంబంధంలాంటిదని ఒక సామెత ఉన్నది. వీరి సంతతి మిడతల సంతతికంటే అధికంగా వృద్ధిచెందుతుంది. ఢిల్లీరాష్ట్రం రద్దు కావటంతో ఇద్దరు మంత్రులు—డా. యుధ్‌వీర్‌సింగ్, శ్రీ అమాన్ నిరుద్యోగులయ్యారు. మరో ముగ్గురు మంత్రులకు లాభసాటైన పదవులు లభించాయి. ముఖ్యమంత్రి శ్రీ గురుముఖ్ నిహాల్‌సింగ్ రాజస్థాన్ గవర్నరయ్యారు. చౌదరీ బ్రహ్మప్రకాశ్, డా. సుశీలానయ్యర్ కాంగ్రెసు టికెట్లతో లోక్‌సభకు ఎన్నికయ్యారు. నిరుద్యోగులైన ఇద్దరు ప్రముఖులను చీఫ్ కమీషనర్‌కు సలహాదారులుగా వేశారు. హిమాచలప్రదేశ్, త్రిపురాలలో ప్రజాస్వామ్యం ఏవిధంగా పరివర్తనం చెందగలదో దీనివల్ల సూచ్యప్రాయంగా తెలుస్తూనే ఉన్నది. ఈ రాష్ట్రాలు రద్దు కావటం అంటూ జరిగితే, అక్కడ పదవులు కోల్పోయే ప్రజాస్వామ్యవాదులకు మళ్లీ కొత్త ఉద్యోగాలు లభిస్తాయి. సంస్థానాలు రద్దుచేసి, సంస్థానాధిపతులకు వార్షికభృతి ముట్టచెబుతున్నప్పుడు రద్దయిన రాష్ట్రాల మంత్రులను, కేంద్ర మంత్రులను మరొక విధంగా చూడటం ఏమంత సబబు చెప్పండి? న్యాయశాస్త్ర రీత్యాను, రాజ్యాంగరీత్యాను వ్యవహరించాలంటే మంత్రులను కూడా "కార్మికులు"గా గుర్తించాలి. అప్పుడు పదవినుంచి తొలగింపబడిన మంత్రి నష్టపరిహారంపొందటం, అక్రమంగా తీసివేసినట్లు న్యాయస్థానాలు నిర్ణయిస్తే, తిరిగి ఆపదవినిదక్కటం సాధ్యమవుతుంది. ఇదంతా అప్రస్తుతం; మన్నించండి. బ్రిటిష్‌వారు చేసిన రెండవ తెలివి తక్కువపని ఏమంటే ఢిల్లీ నగర పరిపాలనా వ్యవస్థను ఏదో ఒక శాఖకు అప్పగించక, కేంద్ర ప్రభుత్వంలో భాగంగా చేసి, ఏ శాఖను ఆశాఖ అధీనంలో ఉంచటం. ఉదాహరణకు విద్య, ఆరోగ్యం, స్థానిక స్వపరిపాలన, వ్యవసాయ విభాగాలను ఆయా శాఖల అధిపత్యంక్రింద ఉంచారు. చీఫ్ కమీషనర్ పేరుమీదగా పై విభాగాలకు సంబంధించిన వ్యవహారాలు సాగుతూఉండేవి. ఈ పద్ధతి పరిపాలన బ్రిటిష్‌వారు భారతదేశాన్ని విడిచి వెళ్ళకమునుపే విఫలమైంది. ఈనాడు ఢిల్లీ పరిపాలన అవ్యవస్థ పాలైంది. ఇది ఏదో సంపూర్ణ స్వయం నిర్ణయాధికారంకల రాష్ట్రంలా చీఫ్ కమీషనర్ లాంఛనమాత్రమైన అధికారిగా ఉన్నాడు. ఆయనక్రింద ఉద్యోగులదండు పని చేస్తున్నది. వీరుచేసే పని ఏమిటయ్యా అంటే బాధ్యతను ఇతరులమీద రుద్దటం. తమ ప్రాముఖ్యాన్ని ఏదో విధంగా నిరూపించుకొనజూచే రాజకీయ నాయకులు వీరికి తోడ్పడుతూ ఉంటారు. ప్రజాసేవ పేరుతో ఈ (వి) నాయకులు మంత్రులను, సహాయమంత్రులను, ఉపమంత్రులను ఆశ్రయించి, పార్టీ ప్రయోజనాలు సాధిస్తూ ఉంటారు.

ఇక్కడ కాస్త వివరణ అవసరం. పోరగా పోరగా

—62వ పేజీ చూడండి



# ముక్కుపొడుం — ఒక్క సైకిలూ

క్రోవి రామమోహన శాస్త్రి * బుర్రా వెంకట్రాయశర్మ

రామన్న పంతుల్ని ... పెద్దలు గానీ ఆ టౌను మొత్తంమీద ఎవ్వరూ ఉండరు.

ఏవరైనా పరాయిఊరువాళ్ళు వచ్చి బజార్లో కనిపించిన పిల్లవాణ్ణి పిలిచి "రామన్నపంతులుగారెక్కడుంటారు" అని ప్రశ్నిస్తే వెంటనే అప్పు చెప్పినట్లు ఆయనఅడ్రసు పూర్తిగా చెప్తారు. ఇంకా కావాలంటే ఆయన ఏవేళప్పుడు ఏ సెంటరు కొస్తారో, ఏ బజారున వస్తారో మొదలైన వివరాలుకూడా చెప్పేస్తారు.

ఇంతకీ ఈ రామన్నపంతులు కున్న ప్రత్యేకత ఏమిటని అడుగుతారేమో! గడ్డలెక్క గంటలతరబడి పీడితప్రజానీకపు బాధామయ గాథలను గురించి ఊకదంపుగా నరుకులేని ఉపన్యాసాలిచ్చే రాజకీయవేత్త కాదు. రత్నకిరీటాలు నెత్తిన పెట్టుకుని, స్వర్ణ పర్యంకికలో పట్టుపరుపులపై అధివసించి—ఆనాడు స్వర్గంలో నహుషచక్రవర్తి దేవరాజ్ఞి శచీదేవి ప్రేమసాధనకై మునుల చేత పల్లకీ మోయించుకున్నట్లు— సాటి మానవుల చేత పల్లకీ మోయించుకుంటూ—కాళ్ళు కడిగినందుకూ— నెత్తిన ఆ నీళ్ళు చల్లుకున్నందుకూ, పూజ చేయించినందుకూ— ఫలహారం పెట్టినందుకు— రకాలవారీగా ఇంతింత అని ఫిక్స్‌డ్ రేట్లు మూఢభక్తుల నుండి వసూలుచేసుకుని ఏవో అర్థంగాని బోధలు చేసే మతాధికారి కాదు... మంత్రి కాదు ....

ఉన్నత ఉద్యోగికాదు .... ధనికుడు అసలే కాదు .... ఒక సామాన్యుడు .... ఆర్థికంగా—శాస్త్రీయంగా— సైనికంగా వెనుకబడి, శాంతికోసం పాకులాడుతున్న పవిత్ర భారతదేశం ఉరఫ్ రామరాజ్యంలో పుట్టి పెరిగి వోటు హక్కు పొంది రెండుదశాబ్దాలు గడచిపోయిన ఒక సామాన్య పౌరుడు .... అతడే రామన్న పంతులు ....

అందరిలా సామాన్యపౌరుడే అయినా రామన్న పంతులికి కొన్ని ప్రత్యేకతలు ఉన్నాయి. అయితే ప్రత్యేకతలు ప్రతివారికీ ఉన్నా, అందరికన్నా మిన్నగా పెల్‌నోట్ కావడమే అతని ప్రత్యేకత.

కొన్ని ముఖ్య కారణాలు—

రామన్నపంతు లొక రచయిత. రచయితగా 'రామన్నపంతులు' అనే పేరుకు పేరులేదు. యావదాంధ్రప్రజానీకం, పత్రికాలోకం 'నస్య ప్రియ' నామధేయుణ్ణి రచయితగా గుర్తించింది.

ఆ టౌనులోకం మాత్రం 'నస్యప్రియ' ఉరఫ్ రామన్నపంతుల్ని ప్రసిద్ధ నవలారచయితగా గౌరవించింది.

సూటిగా చెప్పక తప్పదు. రామన్నపంతులే నస్యప్రియుడు.

రామన్నపంతులికి నస్యమంటే ఎంత ప్రియమో రెండు ముక్కల్లో చెప్పేస్తాము. అతనికి కిళ్ళీ, సిగరెట్ మొదలైన దురభ్యాసాలేమీ లేవుగనుక — ఎవరింటికైనా భోజనానికి వెళ్ళినప్పుడు భోజనానంతరం ఆ గృహస్తు దండిగా ఒకటి, రెండు పట్లకు సరిపడ నస్యం ఇవ్వడం బహుదా కద్దు. అలా జరగదా! అప్పటికప్పుడే పంతులా ఇల్లు వదలి బజారుకెళ్ళి కొనుక్కుని మరీ ఆ యింట్లో అడుగుపెట్టేవాడు.

ఏ పెళ్ళిలోనైనా ఎంత ఎక్కువ దక్షిణ ముట్టినా సరే సంతృప్తి ఉండేదికాదు. దక్షిణ తక్కువైనా ఒకటో, రెండో నస్యపుడబ్బీలు కంటి కగుపిస్తే ఆయన మొహం చంద్రుణ్ని చూసిన కలువలా వికసిస్తుంది.

అన్నట్లు .... పంతులికి నస్యంమీదున్న ప్రేమ ఎలాంటిదో వివరించడంలో పడి ఆయనకు నస్య ప్రియుడనే బిరుదప్రదానం ఎలా జరిగిందో — ఆ పేరుతో రచయితగా ఎలా స్థిరపడ్డాడో మొదలైన కారణాలు చెప్పలేదు.....

ఇందు కొక చిన్న పూర్వగాథ ఉంది....

రామన్నపంతులు వయస్సులో ఉండగా ఆయన హృదయంలో సృజనాత్మకశక్తికంటె ముందు నస్యాఘ్రాణవాంఛ అధికతరమై — ప్రబలమై ప్రకాశించింది. ఆ వాంఛకు తట్టుకోలేక ఆయన నస్యాన్ని బాగా వాడటం ప్రారంభించాడు.

ఈ అలవాటు అభివృద్ధిపొందటంతోపాటే సృజనశక్తికూడా బాగా విజృంభించింది. కాగితం కలంపట్టి కథారచనకు పూనుకున్నాడాయన.

ఏ పత్రికకూ పంపకపోయినా మెదడులో మెదిలిన ప్రతి భావమునూ కథగా రూపొందించాడు. ఇలా రాసిన కథలెన్నో అలమరల్లో పడేడుస్తూ[illegible] డేవి. వాటిని ఫెయిర్‌చేసి - ఏ పత్రిక కయినా పంపుదామన్న ధ్యాసే ఉండేదికా దాయనకు. ఒక రోజున ఆయన ప్రాణమిత్రు డొకాయన వచ్చి ఆ కథలన్నీ చూసి, "ఏమిట్రా రామన్నా! ఇంత చక్కని కథానికలను చెదలకు ఆహారంగా వేస్తున్నావు? పత్రికకు పంపరాదూ!" అన్నాడు.

"ఆఁ .... వెధవది తీరడంలేదురా! బాబ్బాబు, అన్నవాడి వెలాగో అన్నావు. ఆపని కాస్త నువ్వే చేసెయ్యి .... స్టాంపులు—కాగితాల ఖర్చు నేనే భరించుకుంటాను ...." అన్నాడు రామన్న పంతులు నస్యం పీలుస్తూ. మిత్రుడు క్షణం ఆలోచించి, "మరి ఇంక్ ఖర్చు?" అన్నాడు.

రామన్నపంతులు తెల్లబోయాడు.

"వెధవా! పెద్ద భరించేవాడివి [illegible]" అని కసురుకుని కొన్ని మంచి కథలు ఏరి పట్టుకు పోయాడు మిత్రుడు.

ఆతరువాత మాటవరుసకైనా రామన్న పంతులు 'నా కథలు పంపించావా?' [illegible]

మిత్రుడ్ని అడిగనూలేదు. 'నీ కథలు పంపించా'నని మిత్రుడూ చెప్పలేదు.

నెలరోజులు ఇట్టే గడిచిపోయినై. ఒక్కరోజు మధ్యాహ్నం ఒకేసారిగా నాలుగు మాగ జైనులు పోస్టులో వచ్చినై రామన్నపంతులికి.... పంతులు ఆనందానికి మేరలేదు.

గబగబా తన కథలు వెదుక్కున్నాడు.

తన కథల పేర్లయితే బ్లాక్ లెటర్సులో—రకరకాల డిజైనులు మధ్య కనుపించినవిగాని తన పేరు మాత్రం లేదు .... రచన 'నవ్యప్రియ' అని ప్రింటయింది.

ఈ నవ్యప్రియుడెవడు ! ఆ క్షణంలో రామన్నపంతులు స్థితి అవర్ణనీయం. తన మిత్రుడు తననింత హాస్యాస్పదం చేస్తాడా ! మిత్రద్రోహి ! అనుకునేటంతలోనే మిత్రుడు రానేవచ్చాడు. ఇంకా గుమ్మంలో ఉండగానే—

"ఏరా ! నన్ను నవ్వులపాలుచేస్తావట్రా !" అని వాపోయాడు రామన్న పంతులు.

"ఇందులో నవ్వులపాలు చేసే దేముందిరా ! నన్యాసీ ! నీ కథలు చైతన్యవంతంగా ఉన్నాయి. అవి తప్పక పాఠకులలో చైతన్యం కలిగిస్తయ్. అంతగా హృదయాలను కదిలించేలా వ్రాసి రచయిత పేరును వారు మరచిపోకుండా చెయ్యాలనే నవ్వు పుట్టించే పేరు పెట్టాము నీకు. చూడు ఇకనుంచి నీ పేరెలా మోగిపోతుందో పత్రికాప్రపంచంలో. పాఠకులవద్దనుంచి వచ్చే ఉత్తరాలకు లెక్క ఉండదురా ! రెండురోజులు పోనీ ! నీకే తెలుస్తుంది." అంటూ మిత్రుడు సముదాయించాడు.

అనుకున్నట్లుగానే రామన్నపంతులు పేరు 'నవ్యప్రియ' ద్వారా యావదాంధ్రావని మార్మోగింది కొలది మాసాల్లోనే .... అప్పటినుండీ యీనాటివరకు నవ్యప్రియుడుగానే రామన్నపంతులు ఇటు దైనికజీవితంలోనూ—అటు కథా రచనలోనూ స్థిరపడిపోయాడు.

ఇప్పటికి రామన్నపంతుల్లోని రెండు ప్రత్యేకతలను గురించి విన్నవించాము .... తరువాతదీ—నిర్వచిస్తాము ....

దినమంతా నగరాయణంచేస్తూ అపరిచితులతో బాదరాయణసంబంధాలు కలుపుకొని లోకాభిరామాయణం ముచ్చటించేందుకు రామన్నపంతులు కొక ద్విచక్రశకటం ఉంది.

ఆ శకటం రామన్నపంతులు బహిఃప్రాణం .... దక్షిణహస్తం .... ఇంతెందుకు .... శరీరంలోని ముఖ్యాంగా లన్నింటిపెట్టూను.

అయితే పంతులు దాన్ని పంచకళ్యాణి అని ముద్దుగా పిల్చుకొంటూ, మిత్రవర్గంతో దాని పోకడ—రాకడలను గురించి పూర్వ—ప్రస్తుత గాథలను సోదాహరణంగా విపులీకరిస్తూండటం పరిపాటి...

కాని మిత్రులు రామన్నపంతులును హేళన చేసేవారు.

"డొక్కుసైకిలుకు పంచకళ్యాణి అని పేరు పెట్టి దాన్ని గురించి లేనిపోని కథ లల్లి—టొల్లితా పేరా నవ్యం !" అని నవ్వుకునేవారు మిత్రులు.

రామన్నపంతులు చప్పున ముక్కుమీద వేలేసుకుని, "హరి ! సన్యాసులూ ! నా కళ్యాణిని అంత తేలికగా తీసిపారేయకండీ .... ఇది రెండు తరాలుగా అంటే మా తాతగారి నుండి నా వరకూ అనుశ్రుతంగా సంక్రమిస్తున్న చెక్కుచెదరని చరాస్తిరా ! మా తాతగారు వయస్సులో ఉండగా దీనిని—అప్పటికే సెకండ్‌హ్యాండ్ కనుక 9½ రూపాయలకు కొన్నారట .... ఆయన దానికి కొన్ని పైపై మెరుగులూ, మార్పులూ, చేర్పులూ చేసుకుని వాడుకున్నారు .... ఆయన కీర్తిశేషులైన అనంతరం యీ శకటం మా నాన్నగారిదైనమైంది. అయితే మా నాన్నగారు తాలూకా ఆఫీసు గుమాస్తా చేసేవారు.... ఆఫీసు మా ప్రక్క బజారులోనే ఉండటం మూలంగా దీనిని అధిష్ఠించే అవకాశం లేకపోయింది. అందుకని అది అటకమీద నా హయాం వరకూ కాపురం చేసింది. నేను పెద్దవాడినై మా తాతగారు చేసి—చేసి పేరుగాంచిన ఉద్యోగాన్నే చేపట్టడం ప్రారంభించేసరికి నాకొక సైకిలు అవసరమై కొత్తది కొందామనే నిశ్చయాన్ని నిశ్చలం చేసుకునేటంతలో మొన్నిమధ్యనే దివంగతురాలైన మా బామ్మగారు నా దగ్గరకు చేరి "ఒరే ! నాయనా ! క్రొత్త సైకి లెందుకురా ? మీ తాతగారి సైకిలు అటకమీద ఉండనేఉన్నది గాదురా ! బతికుండగా మీ

—55వ పేజీ చూడండి



# చదువుల్రావు









అయితే నాకు
తొందరగా
వాచీ కావాలమ్మా

సత్యమూర్తి



ముఖ్యమంత్రి శ్రీ డి. సంజీవయ్య ఇటీవల తమ నియోజకవర్గంలోని మునగాలపాడు గ్రామం వెళ్ళారు.

# నదీజలాల వివాదంలో మద్రాసు పితలాటకం: ఆంధ్రనాయకుల మెత్తదనం తెచ్చిపెట్టిన ముప్పు.

**కౌండిన్య**

ఆంధ్ర నదీజలాలను అందరూ తలా కాసిని పంచుకొంటున్నారు. తామేమి తక్కువ తిన్నామా అన్న ధీమాతో మద్రాసుప్రభుత్వం కూడా ముందుకువచ్చి, కృష్ణా, గోదావరి నీళ్ళ తమ రాష్ట్రానికి కావాలని గుల్హాటీసంఘానికి విజ్ఞాపన సమర్పించింది. నీటి ఎద్దడి నివారణకు సహాయపడండని అడిగితే తప్పులేదు కాని సాధికారికంగా కృష్ణా గోదావరి నదీజలాలలో వాటా కోరే హక్కు తమకున్నదని వాదించడమే ఆశ్చర్యంగా ఉంది. మైసూరు కృష్ణా జలంలోను, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒరిస్సాలు గోదావరి జలంలోను వాటా పంచమని పేచీపెడితే అర్థం చేసుకోగలం. ఆ నదులు ఆ రాష్ట్రాలగుండా ప్రవహిస్తున్నాయిగనుక. మద్రాసు రాష్ట్రమో ఆ నదులకేగాదు, వాటి ఉపనదులకు సైతం కొన్ని వందలమైళ్ళ దూరంలో ఉంది. అటువంటప్పుడు వాటా కోరే హక్కు ఎక్కడినుంచి వచ్చిందో దురూహ్యం.

చారిత్రకంగా ఈ హక్కు తమకు సంక్రమించిందనీ, నదీజలాలకు సంబంధించిన అనేక సంఘాలు ఈ హక్కు గుర్తించాయని ఒక దబాయింపు. అది ఎటువంటి చరిత్రో, చారిత్రకమంటున్న ఆ హక్కును గుర్తించిన సంఘాలు ఎటువంటివో అర్థంకాదు. ఆంధ్రప్రాంతాలు ప్రత్యేక రాష్ట్రంగా విడిపోకముందు ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో కలిసి ఉండడంచేత, కృష్ణా గోదావరి నదులపై 'పూర్వచరిత్ర దృష్ట్యా తమకూ కొంత హక్కున్నదని మద్రాసు ప్రభుత్వం భావిస్తోంది. పరిపాలనాసౌలభ్యానికై ఏర్పాటైన సరిహద్దులు, పొరుగురాష్ట్రాల అవసరాలు తీర్చడంకోసం నదీజలాల సద్వినియోగానికి అడ్డు రాకూడదని ధర్మపన్నం చెబుతోంది. ఇప్పుడు ఏర్పడివున్న రాష్ట్రాలలో చాలామటుకు, ఎప్పుడో ఒకప్పుడు ఇతర రాష్ట్రాలలో కలిసి ఉన్నట్టివే గదా. ఉదాహరణకు బీహార్, ఒరిస్సాలు, మహారాష్ట్ర, గుజరాత్‌లు, మద్రాసు ప్రభుత్వం పేర్కొంటున్న చారిత్రక సిద్ధాంతాన్నిబట్టి, ఈ రాష్ట్రాలు పొరుగురాష్ట్రాల నదీజలాలపై హక్కు కోరవచ్చుగదా ? అటువంటి హక్కున్నదని అంగీకరిస్తే అది ఒక్క నదీజలాలకు మాత్రమే ఎందుకు పరిమితం కావాలి. బీహార్‌లోని బొగ్గు, ఇనుము గనులలో ఒరిస్సా, మహారాష్ట్ర పరిశ్రమలసంపదలో గుజరాత్ భాగం కోరవచ్చు. అదేవిధంగా, వెనుకబడిఉన్న రాష్ట్రాలు పొరుగున సంపన్నమై ఉన్న రాష్ట్రాల సంపద కోరడానికి 'పరిపాలనా సౌలభ్యం' కోసం ఏర్పాటైన సరిహద్దులు అడ్డు రాకూడదుగదా ? ఇందుకు మద్రాసు ప్రభుత్వం ఒప్పుకొంటుందా. కావేరి, పెరియార్ నదుల విషయంలో పొరుగు రాష్ట్రాలతో పదేపదే పేచీ పడుతున్న మద్రాసు రాష్ట్రానికి ఆపాటి ఔదార్యం ఉందంటే ఎవరైనా నమ్మగలరా. ఉన్న ఖనిజసంపద జలసంపద వినియోగించుకొని సమగ్రంగా అభివృద్ధిచెందాలన్న లక్ష్యంతోనే రాష్ట్రాలు ఏర్పాటయ్యాయిగాని, తనకుమాలిన ధర్మంగా తన సంపదను ఇతరులకు పంచిపెట్టడానికి కాదన్న సంగతి గుర్తించాలి.

చారిత్రకమైన హక్కు నిరూపించుకోడానికి మద్రాసుప్రభుత్వం కృష్ణా, పెన్నారు ప్రాజెక్టు సంగతి విజ్ఞాపనలో పేర్కొన్నది. ఈ కృష్ణా, పెన్నారు ఆంధ్రరాష్ట్రం ఏర్పడకముందు, ఆంధ్రకు ఆట్టే ఉపయోగపడకుండా, చెంగల్పట్టు, దక్షిణార్కాటు జిల్లాలను సాగులోకి తెచ్చేందుకు మద్రాసుప్రభుత్వం తయారుచేయించిన ప్రాజెక్టు. కృష్ణా, పెన్నా నదుల నీరు తమకు కాకుండా పోయి అన్యాయం జరుగుతుందని గ్రహించి ఈ ప్రాజెక్టు పథకాన్ని ఆంధ్రులు భగ్నంచేశారు. నీరు పుష్కలంగా లభ్యమైతే 100 లక్షల ఎకరాలను సాగు చేయగల నాగార్జునసాగర్ పథకాన్ని సాధించుకున్నారు. అటువంటప్పుడు మద్రాసు ప్రభుత్వం ఇంకా కృష్ణా, పెన్నారు ప్రాజెక్టు ప్రసక్తి తెచ్చి దాన్ని పట్టుకుని ప్రేలాడడంలో అర్థంలేదు.

కృష్ణా, గోదావరి జలాలపై తమ హక్కును అనేక సంఘాలు ఆమోదించాయని మద్రాసు ప్రభుత్వం అంటున్నది. ఆ సంఘాలేవో తెలియదు. ఖోస్లాసంఘం కృష్ణా, పెన్నార్ ప్రాజెక్టుకు ఒప్పుకోలేదు. నాగార్జునసాగర్ కుడికాల్వద్వారా

54—వ పేజీ చూడండి

## తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!

# హరివంశము

హారీత శివశర్మ

## సాందీపనిపర్వం - 47

తెల్లవారినది. కాశిక యంతయు సూర్యుని కాంతి నంతను ఇంకించుకొనినట్లు మిలమిల మెరసిపోవుచున్నది. విచిత్రమైన కాంతులను విరజిమ్ముచున్నది. ' కాశికావిశ్వనాథుడు ఆ జడివాన రూపమున ఇంద్రుడు ఒనర్చిన అభిషేకమునకు సంతసించినాడేమో, అతని మేనిదగు తెల్లని వర్ణము పల్లవించి, ఉల్లిలముగ ఆనందకాననము నందంతటను నల్లుకొనినట్లు, అన్నపూర్ణామహాదేవి జడివానలో ముక్తిమంటపమున నతిథులను అభ్యాగతులను ఆదరింప మికల్గిన కోపము సన్నగిల్లి ప్రసన్నని చిన్నవవ్వులు నులివెచ్చని అచ్చకిరణముల లలో విచ్చిన పారిజాతపుష్పములుగా రాలినట్లు, లేత ఎండలు కాశికలో అందములై, ఆనందములై వ్యాపించినవి. జడివానకు నీరు పడియలుగా కట్టినచోట్ల, నా కిరణములు పడి వంతమేర దూరమునుండి చూచిన కన్నులకు ఇంద్రధనస్సులు భూమికి దిగివచ్చినట్లు కన్పించుచున్నది. మబ్బులులేని ఆకాశమున వ్యాపించిన సూర్యుని కిరణములు చెట్లమీదుగా, ఇండ్లమీదుగ, క్రిందకు దిగి వానలకు బిరుసువారిన చెట్టుల యాకులయందు తెలుపుతోడి ఆకుపచ్చనితనమును, సుధామండితములైన భవనముల యందు తెల్లనితనముతోడి అవదాతతను అంగీకరించుచున్నవి. జనము బయటికి వచ్చి కన్నుల నిండ, శరీరమునిండ ఆ కిరణములలోని జీవశక్తిని తమలో నింపుకొనుచుండిరి. గంగమీద పడిన కిరణము తెలినాగుబాముల పిల్లవలె పారాడి, తరంగములలో కదలి, ఒడ్డులలో మెరుగులై పడగలు విరిసినట్లు విరిగిపడుచున్నవి. కాశీరాజభవనములలో ఆ ఎండఎండగా లేదు. వెన్నెలవలె నున్నది. సుదక్షిణ ఆఎండను చూచి, తనతండ్రీ ఆరోగ్యము విచిత్రముగా బాగుపడుట చూచి, ఆకాశముకన్న స్వచ్ఛమైన ఆనందమును, కాంతిని భజించినది. మహారాజు నానందమునకు పగ్గములు లేవా అన్నట్టులున్నది. ఆయనయు, సుదక్షిణయు, ప్రాతఃకాలముననే స్నానాదికములను నిర్వర్తించుకొని, దుర్దినమువలన కల్గిన దుఃఖమును, ఆమయమును, సూర్యకిరణములు చీకటినివలె, కడిగివేసుకొనినారు. ఆయన ఈ ఉదయమున తన కూతురను వదిలి యుండుటలేదు. ఆ దివసమున తాను చేయవలయు పనుల నన్నిటిని ఆమెకు తెలియజేయుచు, తన ఆనందమును ఆమెతో పంచుకొనుచున్నాడు.

'తల్లీ! నేను రాత్రియే చెప్పినాను. శ్రీకృష్ణవాసుదేవుడు నేడు మన ఇంటికి భిక్షకు వచ్చును. నీవు ఆ ప్రయత్నము లన్నియు చేయించుచున్నావుగదా!, నేను అగ్నిగృహమున నుందును. అతడు వచ్చినదే తడవుగ నన్ను పిలువవలయును."

సుదక్షిణ సరియే నన్నది. కాని మహారాజు మన స్సాదినమున అగ్నికార్యమునందు నిలువలేదు. ఆయన అగ్నిగృహములో నిలుపోపలేనివానివలె నయ్యెను. మరల కుమార్తెను వెదుకుకొనుచు మందిరములన్నియు కలయతిరిగెను. ఆయనకు ఇదియే విచిత్ర మనిపించినది. నిన్నటివరకు తాను ముదుసలి. నిన్న తనస్థితి యేమో అస్తినాస్తిగా నైనది. నేడు ఈ శక్తి తనకు ఎచ్చటనుండి వచ్చినది. శ్రీకృష్ణవాసుదేవుడు నిజముగా భగవంతుడా! రాత్రి తాను చూచిన దివ్యదర్శనము ఆయన మహత్తయా? మహారాజు తనలో తాను నవ్వుకొనినాడు. సుదక్షిణ యాయనకు ఎచ్చటను కనుపించలేదు. దాసీలను అడిగినచో తెలియును. ఆయన అడుగలేదు. తానై యామెను చూడవలయును. మందిరములలో నింక మిగిలినది మహానసము. మహారాజు అక్కడికి పోయెను. సుదక్షిణ అచ్చట యున్నది. ఆమె మడికట్టుకొని ప్రత్యేకముగా వంటచేయుచున్నది. బహువిధములైన వంటకము లప్పుడే సిద్ధమైనవి. వంట చేయువారు ప్రక్కన నిలబడి ఏమియు తోచనివారై చూచుచు నుండిపోయిరి. మహారాజు వచ్చినదిగూడ ఆమె చూడలేదు. వారు చూడలేదు.

"అమ్మా!"

సుదక్షిణ తలయెత్తి చూచినది. మహారాజు కన్పించినాడు. ఆయన ముందు "ఇది ఏమి?" అనబోయినాడు. కాని అంతలో తన్ను తాను సంబాళించుకొనినాడు. మరల "అమ్మా" అనినాడు. ఆయన కన్నులలో అప్పుడు ఆనందబాష్పములు నిండినవి. సుదక్షిణ యన్నది:

"తండ్రీ! ఆయన కేమి యిష్టమో నాకు తెలియదు. అందుచేత అన్నిరకములయిన వంటకములను చేయుచున్నాను."

"సుదక్షిణ! అతనికి నవనీతము లన్న ఇష్టమని విన్నాను."

సుదక్షిణ నవ్వినది. "తండ్రీ! అందుకే గదా, ఆయనను యాదవదేశములం దంతటను నవనీతచోరుడని యందురట" అన్నది.

మహారాజును "అవును. అవును. వినినాను. వినినాను" అనినాడు.

సుదక్షిణ మరల తనపనిలో నిమగ్నురాలై పోయినది. మహారాజు మరల తన మందిరములకు వచ్చి కూరుచుండినాడు. ఇంకను రెండు జాములెప్పుడు యగునా యని కూరుచుండినాడు. సూర్యుడు ఆకాశమున కదలుచుండెనేగాని, మహారాజు అనుకొనుచున్నంత తొందరగా కదులుట లేదు. సూర్యు డెంతగా పైకి ఎక్కినను ఆయనకు ఇంకను అప్పుడే ఉదయమైనట్టు లనిపించుచున్నది. మొగసాలలో రెండుజాములైనట్లు గంటలు మ్రోగినను ఆయనకు అవి మ్రోగని యట్లులే యున్నది. ఆయన సర్వేంద్రియములు యదభిముఖముగా నున్నవో, తదభిముఖమైన నవ్వడికోసము, వచస్సుకోసము, దర్శనము కోసము, ఆయన మనస్సు, బుద్ధి, చిత్తము, అంతఃకరణము అన్నియు వేచియున్నవి.

అంతలో వాకిటనుండి ఒక హెచ్చరిక వినవచ్చినది. వెండిబెత్తములవారు దౌవారికుల హెచ్చరికలతో కదలినట్లయినది. ఎవనినిగూర్చియో, వందిమాగధస్తోత్రములు వినవైనవి. మహానసము నందున్న సుదక్షిణ, హంసగమనము మాని, లేడివలె వచ్చి మందిరప్రాంగణమున నిలువబడి, చక్షురింద్రియ తర్పణమునుపోని దర్శనమును చూచి, అప్రతిభురాలై నిల్చిపోయినది. అది అందమా? అందము అన్నది ఒకమాట. మాటలకు అందెడిదైనచో నది అందము. కాని ఆ దర్శనమును వర్ణించుటకు మాటలు లేవే? పురుషులలో ఇంతటి యందమున్నదా! ఇద్దరి యందును నది సమముగా నున్నది. వర్ణములోనే భేదించినది. ఒక్కడు నల్లని నలుపు. మరి

—54వ పేజీ చూడండి

# ఈవారం సినీవిహారం

మధుమూర్తి



"గుండమ్మ కథ"లో విజయలక్ష్మి, జమున, సూర్యకాంతం.

చాలాకాలమైంది "చారూ"ని మదరాసు ఫిలిం స్టూడియోల సెట్‌పై చూసి. సారథీసంస్థ చెన్నపురినుంచి హైదరాబాద్‌కి వలస వెళ్ళటంతోనూ సారథీతర చిత్రాలకు "చారూ" దర్శకతం వహించకపోవటంతోనూ ఆయనను సెట్‌మీద చూడాలనే సరదా తీరకపోతూండేది. ఆమధ్య ఆయన ఒప్పుకున్న ఒక్క సారథీతర చిత్ర దర్శకత్వపు బాధ్యత కూడా హైదరాబాద్ స్టూడియోలోనే ("జల్సారాయుడు") నిర్వహించవలసివచ్చింది. అంచేత చెన్నపురి ఫిలిం స్టూడియోలకు చారూ ముత్య్రతులు కరువైనవి.

"చారూ" అంటే ఎవరో మీకు అంతగా స్ఫురించకపోవచ్చు. తాపీ చాణక్యనే తెలుగు చలన చిత్ర పరిశ్రమ "చారూ!" అని అభిమానంతో పిలుస్తుంది. "కలసిఉంటే కలదు సుఖం" చిత్ర నిర్మాణం పూర్తయిన పిమ్మట చాణక్య శుభోదయావారి చిత్రం "వారసత్వం" దర్శకత్వపు బాధ్యతను అంగీకరించాడు; చెన్నపురికి వచ్చాడు.

ఆరోజు చిరకాల మిత్రుణ్ణి కలుసుకోడానికి నిర్ణయించుకుని, "చారూ" జాడల గురించి తెలుసుకుని, శుభోదయావారి చిత్ర నిర్మాణ కార్యక్రమాన్ని పరిశీలించి గోల్డెన్ స్టూడియోకి వెళ్ళాను. "చారూ"ని, చిత్ర నిర్మాతలను కలుసుకున్నాను. ఆనాడు, మరి రెండు రోజులలో, వారు మూడు పాటలను రికార్డ్ చేశారు. అవి మూడు రకాల పాటలు. అందులో ఒక పాటను మూడు పాత్రలు రీ నిమిషాలసేపు తెరపై పాడతాయనేవార్త తెలియగానే ఆపాట గురించి వివరాలు తెలుసుకున్నాను.

ఒక పల్లెటూరుపిల్ల జమీందారుకి లేకలేక ఒక వారసుడు పుట్టాడు. ఆనలుసు పుట్టిన అత్యానందంలో ఆయన (ముసలివాడు కూడా) మరణించాడు. కాని, ఆయన ఆస్తి ఇతరులకు గిలిగింతలు పెట్టింది. ఆ నలుసుని నలిపివేయాలని దుష్టులు, దగ్గిర బంధువులు కుట్రపన్నారు. కన్నతల్లి సీత నుంచి విడదీశారు.

ఆ పాపను ఒక యువకుడు రఘు రక్షించాడు. దుర్మార్గుల దృష్టి వారిద్దరిమీదా పడింది. వారి ప్రమాదంనుంచి పాపను రక్షించింది ఒక యువతి శాంత. ఈమె చేతిలోకి పాపాయిరాగానే దుష్టులంతా నిస్సహాయులైపోయారు.

శాంత, రఘూలు ప్రేమించుకున్నారు కాని, వారి కింకా పెళ్ళికాలేదు. శాంతవద్ద ఈ పాప ఉన్నట్లు రఘూకి ఇంకా అప్పటికి తెలియలేదు.

ఈ వారసుడనే నలుసుముగ్గురి హృదయాల్లో మూడు రకాల రసాలను ఉత్పన్నం చేశాడు. మాతృమూర్తికి కన్నీరు, శాంతకు ఆనంద గర్వాలు, రఘూకి ఎడబాటులో ... మమకారం. ఈ ముగ్గురూ ఈవిధంగా ఆ పాప గురించి ఆవేదనను పాటలో వ్యక్తం చేసుకుంటున్నారు.

నవ మాసాలూ నిన్ను మోసింది
కన్నీరిడుటకేనా? కన్నమ్మను నేకానా?
జాడలు తెలిసీ రాలేనైతి
క్షణమే యుగమై పోయె
ఇంతెన్నాళ్ళకు బంగరు తండ్రీ
నా కనులకు కనుపించేవో

ఈవిధంగా మాతృమూర్తి సీత విషణ్ణ హృదయం వినబడుతోంది. ఇంక రఘూ : కొద్దికాలం అతడు పసిపాప పసిడి పలుకులకి మురిసిపోయి మమతను పెంచుకున్నాడు. అతనినుంచి ఆ బంగారుపాపను విధి దూరం చేసింది. కాని, పసికందుని ఏ డేగలో తన్నుకుపోయాయనే దిగులు, భయం అతని మనసులో పీఠం వేసుకున్నాయి.

ఎవరేమన్నా దిగులెంతున్నా
అన్నీ మరపించేవు—తోసి
నవ్వుల మురిపించేవు
నవ్వుతూ కేరుతూ ఆడి పాడి
నన్నలరించిన బాబూ
ఏమైనావో? ఎందున్నావో?
ఏ ఇడుములబడి నలిగేవో!

ఇంక శాంత మనసు మాత్రం ఒకవిధంగా సహజంగా స్త్రీకి పాపలంటే ఉండే వాత్సల్యంతోబాటు, వారసుడైన ఈ ప్రాణిని రక్షించాననే ఆనందంతో ఎన్నో ఆశలను, ఆశయాలను ఆ పాపకు రంగరించి పోస్తోంది.

మనగుట్టు నిలుపుకోవాలి
నీ మారాము గుణమే మానాలి
జాలిపడి నిను కొనితెచ్చినాను
నీకు మేలెంచి చోటిచ్చినాను
నీవు నా పరువు నిలబెట్టవోయి
ఇంక నీబరువు నామీద వుందోయి

ఈ పాటను నార్ల చిరంజీవి రచించాడు. ఘంటసాల మంచి బాణీ కూర్చడమే కాకుండా ఈ పాటలో రఘూపాత్రకు స్వరం అందించాడు. సుశీల ఇతర చరణాలను మధురంగా ఆలాపించింది. గోల్డెన్ స్టూడియో సౌండ్ ఇంజనీర్ మోహనసుందరం పాటను రికార్డ్ చేశాడు.

"వారసత్వం" చిత్రానికి నిర్మాతలు రంగారావు అండ్ శాస్త్రి. దర్శకుడు తాపీ చాణక్య. సంభాషణలు కొల్లాటరెడ్డి. కొన్ని పాటలు ఆరుద్ర కూడా వ్రాశాడు. కామెరా : వర్మ. ఈ చిత్రానికి ఏడు పాటలు రికార్డయినది. ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు (రఘు), అంజలీదేవి (శాంత), గిరిజ (సీత) నటిస్తున్నారు. వీరుకాక గుమ్మడి, రేలంగి, రాజనాల, హేమలత ప్రధాన పాత్రలు నిర్వహిస్తున్నారు.

## ఆమె చేతివంట

ఆ అందాల చిట్టితల్లి గారాబంగా పెరిగింది అమ్మ దగ్గర. అంచేత ఆమెకు వంటచెరకు అంటే వంటగానూ, చెరకుగా మాత్రమే తెలుసు. కలవారి బిడ్డ కనుక సరోజకు వంట తెలియటం పెళ్ళి కావలసిన అమ్మాయికి ఉండాల్సిన యోగ్యతగా ఆమె

—51 వ పేజీ చూడండి

# మనము - మన దేహస్థితి

డా॥ గాలి బాలసుందరరావు

## ఆహారగ్రహణము

జీజనం (చిన్న ప్రేగు పై భాగం) తో స్పందించ బడే స్పందనములను గురించి తెలుసుకున్నాము. ఇన్ని రకములయిన స్పందనముల ప్రభావంతో, అనేక భౌతిక రసాయనిక వికృతులు పొందిన భోజన పదార్థములు శరీరానికి పనికివచ్చే పదార్థములు గానూ, శరీరానికి అవసరంలేకపోగా, శరీరంలో మిగిలి పోతే హానికలిగించే మలపదార్థములుగానూ తయా రవుతవి. భోజనం వేరు. ఆహారం వేరు. నిత్య జీవితంలో ఈ రెండు మాటలూ ఒకే అర్థంలో వాడబడుతున్నా, శరీరశాస్త్రంలో వాటిని మనం ప్రత్యేకార్థంతో వాడడం అలవాటుచేసుకోవాలి. మనం తినేదంతా భోజనం. భోజనంలో తిన్నదంతా శరీరానికి పనికి వచ్చేదికాదు. భోజనంలోవున్న అన్ని వస్తువులనూ పనికి వచ్చే వస్తువులుగా మార్చేశక్తి మామూలు మను షుల జీర్ణకోశానికి లేదు. యోగసాధనచేసేవారికి ఇది సాధ్యమని చెబుతారు. కాని సాధారణ మానవు లకు, భోజనపదార్థములు జీర్ణకోశంలో జీర్ణ మయినతరవాత తయారైనవీ, ఒక రకమైన రసా యనికస్వరూపం కలవీ అయిన వస్తువులనే శరీరం లోకి గ్రహించేశక్తి వుంటుంది. మిగతా వస్తువులు 'శరీరానికి' పనికిరావు. ఇంతమాత్రంచేత మల పదార్థమంతా వ్యర్థమైనదికాదు. మానవ మల మును భక్షించి పందులు జీవిస్తున్నవి. ఆ పంది మాంసమును కొందరు ఆహారంగా వినియోగిం చడం అందరికీ తెలిసినవిషయమే. సాధారణ మాన వుల జీర్ణకోశం, కొన్ని వస్తువులనే జీర్ణించగలదు. ఆ వస్తువులనే మానవదేహం గ్రహించగలదు. మానవదేహం గ్రహించగల పదార్థ సముదాయము 'ఆహారము' అనబడుతుంది. ఆయుర్వేదములో ఆహా రమును 'సారము' అనీ మల పదార్థమును 'కిట్టము' అనీ వర్ణించారు. ఈ విధంగా భోజన పదార్థముల విలువ, అందులో మానవజీర్ణకోశం జీర్ణంచేసి గ్రహించగలవస్తువులనుబట్టి వుంటుంది. ఇంగ్లీషులో భోజనమును 'ఫుడ్' (Food) అనీ, ఆహా రము' (సారము) ను న్యూట్రిషన్ (Nutrition) అనీ అంటారు.

ఆహారంలో ప్రోటీనులు, శర్కరలు, తైలవస్తు వులు ఉన్నవని, ప్రోటీనులు ఎమైనోఏసిడ్లుగానూ, శర్కరలు, గ్లూకోజుగానూ, తైలవస్తువులు ఫేటీ ఏసిడ్లు (Fatty acids) గానూ మారిపోతవని తెలుసుకున్నాము. ఈ వస్తువులను ఆహరించి రక్తంలోకి గ్రహించేశక్తి ముఖ్యంగా చిన్న ప్రేగు చివరభాగమైన 'ఇలియం'కు వున్నది.

ఇలియం ఈ విధిని ఎల్లా నిర్వర్తిస్తుంది? చిన్నప్రేగు గోడలో వెలుపలి ప్రక్క సీరస్‌పొర, మధ్య కండరములపొర, లోపల మ్యూకస్‌పొర అని మూడు పొరలున్నవనీ, చిన్న ప్రేగూ, ఇతర జీర్ణభాగముల లాగే ఒక గొట్టంవంటి ఆకారంగలదనీ, యిదివరకే తెలుసుకున్నాము. ఇలియం గోడలోవున్న కండర ములు పొడుగువరసలో వుండేవీ, అడ్డంగా ఉంగరం ఆకృతిగలవీ అనికూడా తెలుసుకున్నాము. ఈ కండరముల సంకోచ వ్యాకోచములవల్ల ఇలియం చిన్నదీ, పెద్దదీ కాగలదు. కాని, ఇలియం లోపలిపొర అయిన మ్యూకస్ పొరకు, యీ సంకోచ వ్యాకోచశక్తి అధికంగా లేదు. అందుచేత, ఇలియం సంకోచించి నప్పుడు, దానిలో మ్యూకస్‌పొరముడతలుపడి వ్రేళ్లలా తయారవుతుంది. ఇందువల్ల జీర్ణమయిన ఆహారం లోకి ఈ వ్రేళ్లు చొచ్చుకుంటవి. ఈవిధంగా ఆహార మును ఆహరించి గ్రహించే ప్రదేశ వైశాల్యం అధిక మవుతుంది.

ఈ సొఫేగస్‌నుంచి మలద్వారంవరకూ వ్యాపించి వున్న జీర్ణనాళములో, అందులోవున్న కండరముల సంకోచ వ్యాకోచములవల్ల తరంగచలనం ఏర్పడు తుందనీ, అది సవ్యమయినపుడు పైనుంచి మల ద్వారంవైపుగా సాగిపోతుందనీ, ఇదివరకే తెలుసు కున్నాము. ఇలియంలో జీర్ణపదార్థం ప్రవేశించగానే, ఇలియంగోడమీద వత్తిడి యేర్పడుతుంది. అందులో వున్న నరాగ్రములు ఉద్రిక్తమునై, అక్కడి కండ రములలో సంకోచ వ్యాకోచములు ఏర్పడతవి. ఆవిధంగా ఇలియంలో తరంగచలనం యేర్పడుతుంది. ఇంతేకాదు. జీర్ణ పదార్థములలో కొన్నింటికి, మూకస్ పొరను ఇరిటేట్‌చేసే శక్తి వున్నది. అల్లా మ్యూకస్ పొర 'ఇరిటేట్' (చికాకుపడడం) అయినప్పుడు కూడా తరంగచలనం ఆరంభమవుతుంది. ఈ తరంగ చలనంవల్ల జీర్ణపదార్థములు చిలకబడి, సమానంగా ద్రవరూపం పొందుతవి. ఇల్లా జరగకపోతే ఒకచోట గడ్డగానూ, మరొకచోట ద్రవంగానూ జీర్ణ పదార్థం వుండి, సరిగా గ్రహింపబడకపోవచ్చును. అందులో 'యిరిటేట్' చేసే వస్తువులుంటే మ్యూకస్‌పొర యిరిటేట్ అయి,తరంగచలనం అవసవ్యంగా యేర్పడి, కడుపులో పోర్లు (Colic) ఏర్పడవచ్చును. కాని యీ అవసవ్యతరంగచలనం స్థానికమైనప్పుడే పోటుపుడుతుంది. ఈ జీర్ణపదార్థమును చక్కగా చిలికడానికి చిన్నపేగులో ఉంగరంవంటి కండర ములు సంకోచించి ఇలియంలో నల్లేరులోలాగా కణు పులు ఏర్పడతవి. ఈ కణుపులవల్ల ఇలియం చిన్న చిన్న సంచులులాగా తయారవుతుంది. ఒక్కొక్క సంచిని చుట్టివున్న కండరములు నిలువుగానూ, అడ్డంగానూ సంకోచించి ఆహారం ఎక్కడికక్కడ చిలకబడుతోంది.

ఈవిధంగా పూర్తిగా ద్రవరూపంపొందిన జీర్ణ పదార్థం ఏవిధంగా ఇలియంద్వారా రక్తంలోకి పోతుందో ఏ ఏ ఆహారపదార్థములు ఎల్లా పోర్టల్ వెయిన్ ద్వారా లివరులోకి పోతవో అర్థం చేసుకోవా లంటే ఇలియంలోవున్న మ్యూకస్‌పొర సూక్ష్మ నిర్మితిని గురించి కొద్దిగా తెలుసుకోవాలి.

ఇలియం, లోపలి భాగమును కప్పివుండే మూకస్ పొరమీద పొరలుకుమీద మూగువున్నట్టుగా మూగు ఏర్పడి వుంటుంది. అసంఖ్యాకములయిన వేళ్ళవంటి నిర్మితుల సముదాయమే ఈ నూగు. ఇలియంలో కండరముల సంకోచంవల్ల మ్యూకస్‌పొర ముడతలు పడి వ్రేళ్ళలాగా ఏర్పడుతుందని తెలుసుకున్నాము. అదీ ఈ నూగూ ఒకటే ననుకోగూడదు. ఈ నూగు వేరు. ఈ నూగు మ్యూకస్‌పొరమీదనుండి ప్రేగులోకి చొచ్చుకునివుండే ఒక సూక్ష్మనిర్మితి. ఈ నిర్మితిని 'విల్లస్' అంటారు. ఇటువంటి విల్ల స్సులు కోటానుకోట్లుగా చిన్న ప్రేగు మ్యూకస్ పొరలో వుంటవి. ఈ విల్లస్సులద్వారానే, ఆహారం గ్రహించబడుతుంది. ఎల్లా గ్రహించబడుతుందో అర్థం కావడానికి, దాని సూక్ష్మనిర్మితిని తెలుసుకోవాలి.

శరీరంలో లింఫు గ్రంధుల ను గురించీ, లింఫు నాళములను గురించీ గత వ్యాసము లలో వివరించాను. ఆర్టెరీ శాఖోపశాఖలుగా చీలి కేపిలరీ అయి, కేపిలరీ అంతంనుంచి వెయిను ఆరంభ మవుతుందనీ, దానిచుట్టూ 'టిష్యూ' (జీవ కణ ముల సముదాయం) వుంటుందనీ, అక్కడ ఖాళీ ప్రదేశమునుండి లింఫునాళములు ఆరంభమవుత వనీ,లింఫునాళములన్నీచేరి థొరాసిక్‌నాళంఅనే ప్రధాన లింఫునాళంగా మారుతుందనీ, ఆ సందర్భంలో చెప్పాను. ఈ లింఫునాళములు శరీరంలో అన్ని భాగ ములలోనూ వున్నట్లే ప్రేగులలోనూ వున్నవి.

ఇలియం మ్యూకస్‌పొరలో మూడు ముఖ్య భాగము లున్నవని చెప్పవచ్చును. (1) కండరముల పొరను అంటినభాగంలో ఈ లింఫునాళములతో యేర్పడిన వలనుచుట్టి ఒక రకమయిన 'టిష్యూ' (జీవకణ ముల సముదాయం) వున్నది. ఈ లింఫునాళముల వలనుండి ఒకశాఖ చీలి విల్లస్ మధ్యలో అంతమౌ తున్నది. లింఫునాళముల వలకు ప్రక్కన, మ్యూకస్ పొరలో సూక్ష్మచలనం కలిగించగల కండరముల పొర వున్నది. ఈ పొరపైనుంచి టెస్టుట్యూబ్ ఆకారంగల 'విల్లస్' చిన్నప్రేగులోకి చొచ్చుకుని వుంటుంది. విల్లస్‌లోవున్న లింఫునాళమునకు 'లేక్టీల్' (Lacteal) అనే ప్రత్యేకనామం ఏర్పడింది. చిన్నప్రేగులో జీర్ణపదార్థం పాలలాగా తెల్లగా వుంటుంది. 'లేక్టస్' అంటే పాలు. ఈ పాల వంటి రూపం జీర్ణ పదార్థంలోవున్న ఫేటీ ఏసిడ్స్ వల్ల వస్తుంది. ఆ ఫేటీ ఏసిడ్లను గ్రహించి, పాల లాగా తెల్లగా వున్నందున ఈ లింఫునాళ విశేషమును, లేక్టీల్ అంటారు.

'లేక్టీల్'నుచుట్టి రక్తనాళముల వల వున్నది. ఆ పొరనుచుట్టి మ్యూకస్ అనే జిగురుపదార్థ మును స్పందించే జీవకణముల వరస వున్నది. రక్త నాళములలో ఆర్టెరీలూ, వెయినులూ వున్నవి. అక్కడ ప్రారంభమయిన వెయినుశాఖలన్నీచేరి పోర్టల్ వెయిను అవుతుంది.

రెండు లేక్టీళ్లకు మధ్య టెస్టుట్యూబు ఆకృతి గల ఒక గ్రంధి వున్నది. దానిక్రింది మొన, మ్యూకస్ పొరలోవున్న సూక్ష్మ కండరములపొరలాగా వ్యాపించి

—60వ పేజీ చూడండి


మోడైన
సమష్టి
కాశీనాయుని
రామకృష్ణ

"ఏందిరో సైదులూ! ఈయాల సీకటి పడకుండానే ఇంటికెళ్లిపోతున్నావ్"—రస్తాలోనే జానయ్య రుకాయించాడు.

ఊ.... కి.... నే—! సైదులు ముభావంగా పలికేడు.

మరదలు పిల్లగాని వచ్చినా దేంటి ?

లే.... దు.

గట్ల నయితే అనసూరి నిన్ను యాదు చేస్తాంటుందిలే....!

గట్లాగని....?

జరా సీకటి పడేటలంకి—!

మనిషి పెద్దోడి వయినా నీ బుద్ధి యింకా మారలేదు—సైదులు చిరుకోపం ప్రదర్శించాడు.

పాపం! నువ్వు సానా బుద్ధిమంతుడివిలే....!

అంటూ జానయ్య చేలగట్లు కడ్డంపడ్డాడు. కిర్రుచెప్పుల సద్దు అంతకంతకీ దూరమవుతోంది. సైదులు భావనాప్రపంచంలో ముందడుగు వేశాడు. తన చేలలో పడి మేస్తున్న గొడ్లని చూసి జానయ్య ఎలుగెత్తి పాలికేక వేస్తున్నాడు. చేలకి నీళ్లోడుతున్న మట్టయ్య మోటబావి నుంచి కరకర మనే చప్పుడు గాలిలో తేలుతూ వస్తోంది. కళ్లె లేరుకోవటం పూర్తయిన గమళోళ్ల గంగమ్మ మెల్లగా బాట త్రొక్కింది. ఆకాశాన పక్షులు బారులు బారులుగా తమ తమ నెలవులవంక ఎగిరిపోతున్నాయి. చక్కగా, చల్లగా వస్తున్న పిల్లవాయువులు అతనికెందుకో విషవాయువుల్లా గున్నాయి. ఉచ్ఛ్వాస నిశ్వాసలు బరువుగా సాగుతున్నాయి. సూటిగా ముఖంమీద ప్రసరిస్తున్న అరుణాస్తమయ కిరణాలు అతని ముఖంలోని కళాకాంతులుని వెనక్కి గుంజుకొని పోతున్నాయి. సంధ్యాచీకటి క్రమక్రమంగా సామాన్య చీకటిలా అలముకొంటోంది. కెనాలు కట్ట దాటి కంపసాగరం బాట పట్టేడు. మేతకి పోయిన గొడ్లన్నీ మందలు మందలుగా కమ్ముకుంటో, పోట్లాడుకుంటో ఇళ్లకి చేరుకుంటున్నాయి. తను నడిచే బాటలాటిదే తన జీవితం కూడా అని తొలిసారిగా వేదాంతాన్ని వల్లెవేశాడు. ఆ బాట ఇనుకవర్ర. ఇరువైపులా ముళ్ల కంపలు. పరిసరాలని గుర్తించుకొని, పరిస్థితులని అవగాహన చేసుకొని ఏకలక్ష్యంతో సాగిపోయే మానవుడికి ఏ ప్రమాదమూ లేదు. నిర్లక్ష్యంతో ఏ ప్రక్కకి వాలినా, సోలినా, తూలినా వాడి ముళ్ళ రక్తంతో దప్పిక తీర్చుకొంటాయి. అడ ఒక సింతసెట్టు ఉంది. ఆ సింతసెట్టు చల్లని నీడలో రెండు సమాధులు నిద్రపోతూ ఉంటాయి. ఆ సింతసెట్టు కాడనుండి సైదులు కాళ్ళు ముందుకు కదలలేదు. నడుస్తున్న గడుస్తున్న జగన్నాటకంలో లీనమై మానవులు తాత్కాలికంగా తమ పాత్రల ప్రమేయాన్ని మరచిపోతారు. చివరికి జీవితంలో మిగిలే దేమిటి? అదృష్టవంతుల స్మృతి చిహ్నంగా ఆ సమాధులయినా మిగులుతాయి. పాతగాథలు పునశ్చరణ చేస్తాయి. మిగిలినవారి నామరూపాలు పుట్టిన మట్టిలోనే మిళితమైపోతాయి. కిష్టయ్య త్రాగుబోతు. గూండా. విలువయిన కాలాన్ని వత్తాలాడటానికే వినియోగించేవాడు. పరిహాసిస్తున్న లోకులకు తను అందుకొంటున్న, పొందుతున్న ఆనందానికి అనర్హులుగా, అప్రయోజకులుగా పరిగణించేవాడు. దుర్గయ్య సత్శీలపు మనిషి. మాయమర్మాలు తెలియనివాడు. ఇద్దరూ విభిన్న తరహాల వ్యక్తులు. అయినా ఇద్దరినీ మృత్యువు ఒకేసారి పెనవేసుకొంది. మరునాడే రెండు సమాధులు వెలిశాయి. మంచి చెడుల మచ్చుతునక లవి. చీకటి, వెలుగుల చిహ్నాలు. కష్టసుఖాల తోడునీడలు. ఆ సమాధులున్న తావే శ్మశానం. అక్కడ ఇంకా ఎన్నెన్నో పీనుగుల పెంట లున్నాయి. సగం కాలిన కట్టెలు శిథిలావస్థలోని మానవుల్లా గున్నాయి. పగిలిన కుండ పెంకులు రగులుతున్న దిగులుని రేకెత్తిస్తున్నాయి. రేపీపాటికి ఇక్కడ తన సమాధి నిలుస్తుంది. గ్రామస్థులు రోజూ చూస్తో క్షణంలో సైదులనే వ్యక్తిని మరిచిపోతారు. కొత్తగా చూసిన పాంథులు సానుభూతి ప్రదర్శిస్తారు. ఎందుకో సైదులు భయంతో గజగజ వణికిపోయాడు. ఆకాశం నుంచి చీకటి తెరలు చీల్చుకు వచ్చాయి. యాంత్రికంగా బాట పట్టేడు. ఊరు సమీపిస్తోంది. సైదులు ఎదలోని దిగులు పీగలా పైకి వ్యాపిస్తోంది. రేపు తనకి యీ పాతిక సంవత్సరాల నుంచి పుట్టి, పెరుగుతున్న వూరు కనిపించదు. రేపు తను ఎక్కడ ఉంటాడు?—తనకే తెలియని ప్రశ్న అది. మసక చీకటిలో ఏదో ఆకారం అతనికి ముందుగా మెదులుతోంది. భయమెరుగని సైదులు హృదయం చలించిపోయింది. అక్కడే నిలబడిపోయాడు. రోజూ తనింటికాడ పండే పల్లికుక్క తోకాడిస్తూ వచ్చింది. రోజూ కుక్క తన కెదురు వస్తుంది. తను తినగా మిగిలిన పట్టెడన్నంతో పెరుగుతూ, తన స్వామిభక్తిని పెంపొందించుకుంటోంది. వస్తోందా కుక్క. రోజూ దానిని గోముగా నిమిరేవాడు. మనసు ఉల్లాసంగా ఉన్నప్పుడు దానిని ఈలపాటతో మైమరపించేవాడు. ఈనాడెందుకో ఆ కుక్కమీద చీత్కారం కలిగింది. తోకాడిస్తూ వచ్చే ఆ విశ్వాసజీవి ఆనందంతో ఇచ్చే సుస్వాగతం కాదది. రానున్న తన వీడ్కోలుకి సూచనగా భ్రమించాడు. అమందానందంలో కుక్క మీదికి ఎగబడింది. దానిని తన్నేడు. అతను తిన్నగా బీబమ్మ ఒటేలుకాడికెళ్లి బల్లమీద చతికిల పడ్డాడు.

ఈయాల సీకటి పడగానే వచ్చేసినావ్. బాగా ఫుర్సత్ దొరికినట్లుండాది—! బీబమ్మ పాన్‌లోకి అడకత్తెరతో ఛాలియా కత్తిరిస్తూ అంది.

లే దొదినా....! సైదులు నిట్టూర్చాడు.

బీబమ్మ తన పనిలో నిమగ్న మయింది.

చాయ్ ఉందా వొదినా....! సైదులు పరధ్యానంగా అడిగేడు.

ఏందీ....? ఆశ్చర్యంతో బీబమ్మ చేతిలోని అడకత్తెర హర్తాళ్ చేసింది.

చాయంటున్నా.......

సజ్జ సంకటి తాగలేదా? బీబమ్మ ఆశ్చర్యం నుంచి తేరుకుంటో అడిగింది.

లే దొదినా! ఈయేలెందుకో పరేషాన్‌గా ఉంది. పానం గుంజాతున్నాది. మన సేదనో ఉంది నే వింక జలకము.

యా అల్లా! గట్లా మాట్లాడకు — బీబమ్మ నోరు నొక్కుకొంది.

సైదులు మాట్లాడలేదు. మాటలు రావటం లేదు.

బీబమ్మ చాయి తేవటానికి లోని కెళ్లింది.

సైదులు అలాగే కూర్చొని ఉన్నాడు. చీకటి బాగా ముసురుకుంటోంది. అడపా దడపా కర్షకులు ఇళ్లకి పోతున్న అడుగులచప్పుళ్ళు వినపడుతున్నాయి. ఎదురుగా ఉన్న తాటాకింటిలోని ఎక్కా (దీపం) గా జు మూ నె (కిరసనాయిలు) తక్కువై కాంతిలో దిగజారిపోతో మరల వెలుగుతోంది. సైదులు చాయి తాగి జేబులోని దో అణా పైసలు బీబమ్మ కిచ్చి, చుట్ట ముట్టించి లేచాడు. కళ్ళు తిరుగుతున్నాయి. కాళ్లు తేలిపోతున్నాయి. ఒళ్లు గజగజ వణికిపోతోంది. ఈరోజు తనకి చరమదినం. తన పాతికేళ్ల జీవితంలోని అనుభవాలకి, ఆనందాలకి అంతిమదినం. అసలు మల్లి ఎవరు....? ఎక్కడో పుట్టింది. మరెక్కడో పెరిగింది. ఒక తల్లి కడుపున పుట్టి — తల్లిదండ్రుల రూపురేఖలని కొల్లగొట్టి, తన జీవన పథంమీద అడుగుపెట్టి—ఎదురుగా వచ్చి చేయూతనిచ్చిన అర్ధాంగి. తలవనితలంపుగా తమిద్దరినీ కలిపిన విధాతే యీనాడు జీవితంలోని ఆఖరి రోజునకూడా అంతిమవీక్షణం చేసుకోకుండా ఎడబాటు కలిగిస్తున్నాడు. తనువులే అశాశ్వతములయిన యీ ప్రపంచంలో ఏది నిత్యం....?— ఏది సత్యం....? — ఎవరు బంధువులు??? సైదులు నడుస్తున్నాడు. నాటకంలోని విషాద సన్నివేశంలోని కథానాయకునిలా అడుగులు వేస్తున్నాడు. పరిచయస్థులయిన వయోఃభేదాలలోని పండుముదుసలులు, ప ని వా ర లు, పసిపిల్లలు ఎదురుపడి, పలకరించి, మళ్లా పరేసాన్‌లో ముంచి పారిపోతున్నారు. ప్రపంచంలోను, ప్రజలలోను పాతిపోయే ఈ వ్యక్తులు మృత్యుదేవత ఉక్కు పిడికిలినుంచి జారిపోగలరా? సైదులు, అనసూరి ఇంటివరకు వచ్చేడు. ఆ సందుమలుపు తిరిగితే తన ఇల్లు. అంటే రేపటినుంచి మల్లి ఇల్లు. తలుపులు మూసిఉన్న ఇంటిలోని అనసూరి ఒక్కసారిగా అతని హృదయంలో ప్ర త్య క్ష మ యి ం ది. త మ దొ ర ల్లా ఉ ం టా డ ట. బుద్ధిలో బృహస్పతివంటివాడుట. తనే చదువుకొని ఉంటే దొరలు తిరిగే మోటారు, సలాములు కొట్టే చప్రాసీలు, రాజసౌధంవంటి పెద్ద బంగళా, దాని ముందు నందనోద్యానవనం లాంటి పూలతోట—అన్నీ తన సొత్తేనట. అనసూరి ఎంత సక్కగా మాట్లాడుతాది—? తన పెళ్లి కాని క్రితం అనసూరి వలపు వెన్నెల్లో, కొంగ్రొత్త సోయగంలో మెరిసిపోయేదు. అనసూరికి తనంటే పంచప్రాణాలు. ఒకరోజు పొద్దుటేల తను సజ్జ చేలికాడికి వెళ్లేడు. అ ం త క్రి త మే చూపులతోనే హృదయాన్ని విప్పి తనకి సమర్పించిన అనసూరి

46—వ పేజీ చూడండి



# వనితా వాణి

## పిల్లలూ – ఆటవస్తువులూ

పిల్లలూ—ఆటవస్తువులూ అన్న వ్యాసం కోమలాదేవిగారు చాలాబాగా వ్రాశారు.

నంగులూరిసూర్యదమయంతి (రాజమండ్రి)

*   *   *

కోమలాదేవిగారు వ్రాసిన "పిల్లలూ—ఆటవస్తువులూ" అనేవ్యాసం ఉపయోగకరంగానూ, చక్కగానూ ఉన్నది. నిజంగా పిల్లలకు కొత్త ఆటవస్తువులంటే ఎంతసంతోషమో చెప్పలేము.

వి. సరోజ (నెల్లూరు.)

*   *   *

## మీరేం చేస్తున్నారు?

నాభర్త పోయిన తరువాత మాకు ఇతరఆస్తి పాస్తులు ఏమిలేకపోవుటచేతను, నాపిల్లల్ని పెంచి పెద్దచేయుటకై నాభర్తగారి ఆఫీసులో నాకు క్లర్కువని ఇచ్చారు. మా ఆఫీసులో ఇతర స్త్రీలు ఎవ్వరూలేకపోయినా, నాభర్త మంచితనం వల్లా నేను ఎస్. ఎస్. ఎల్. సి. ప్యాస్ అయిన దానిని అగుటచేతనూ నాకు ఉద్యోగం ఇచ్చారు. నేను ఈ విధంగా (అనగా ఒకరిమీద ఆధారపడకుండా) పనిచేసి బ్రతకడం ఇష్టంలేని కొందరు పెద్దమనుష్యులు నామీద చర్యతీసుకోవాలని తలచి చివరకు వారి గోతిలో వారే పడినట్లు అయినారు.

యం. రత్నమాల (చక్కర్‌నగర్.)

*   *   *

పెద్ద పెద్ద పట్టణాల్లో ఇటువంటి సమస్య అంతగా ఉండటం లేదుగాని "ఇటు పల్లెగాక అటు పట్టణంగాక" అనే పోమాదిరి పట్టణాల్లోనే ఇటువంటి సమస్యలు విమర్శలు ఎక్కువగా ఉంటున్నాయి. మాకు తెలిసిన వాళ్ళమ్మాయి, ఒకామె, పరీక్ష పాసయ్యావుకదా ఎక్కడన్నా ఉద్యోగం చేస్తావా? అని అడిగితే "ఛీ! ఆడపిల్లలు ఉద్యోగం చెయ్యడమేమిటి? అయినా ఇంకా మాకు అంతగతి పట్ట లేదు. మేమేమిఅంతగడవని స్థితిలో లేము" అంటూ విరుచుకుపడింది. కాని తిరిగి ఆ అమ్మాయే, ఉద్యోగం కోసం ఎంతో ప్రయత్నంచెయ్యడం, ఎన్నో అప్లికేషన్‌లు పెట్టడం ఎక్కడా అవకాశం దొరకక పోవడంకూడా మాకుతెలుసు. వాళ్ళకీ మనసులో ఉద్యోగం చెయ్యాలనే ఉంటుంది. కాని తమ పొరుగు వారికి అవకాశం దొరికి వారు చెయ్యడానికి తమకు అవకాశం దొరక్కపోతేమాత్రం, ఛీ! అని యీసడింపులు, విమర్శలు మొదలెడుతారు. ఖర్మం చాలక రేపుతమకు ఒకవేళ ఎక్కడైనా పోస్టింగ్ వస్తే, అప్పుడు ఈ విన్నవాళ్ళు ఎత్తిపొడుస్తారేమో అనే ఆలోచనకూడా రాదువారికి.

బులుసు లలితాశర్మ (బరంపురం)

*   *   *

## మధ్యతరగతి మహిళలు

మధ్యతరగతి మహిళల అవస్థలు అంత, ఇంత అని చెప్పడానికి వీలు లేకుండా ఉంది. అరటాకు మీదముల్లుపడ్డా, ముల్లుపైన అరటాకు పడ్డా నష్టము మాత్రము అరటాకుకేకదా!" అలాగే స్త్రీజీవితము కూడాను.

కుమారి పార్వతి (బళ్ళారి)

*   *   *

రచయిత్రిగారన్నట్టు పట్టణాలలో ఐతే ఉద్యోగాలు చేస్తే సూటిపోటి మాటలుండవు. పల్లెల్లో అయితే మరీ కష్టము. తోటి అమ్మలక్కలు గోరంతదాన్ని కొండంత చేస్తారు. మాయింట్లో నేను, మావారు. మాఆడపడుచు, మామామగారు వుద్యోగాలు చేస్తున్నాము. ఒకరనుకొంటారని భయపడితే చాలా మందివున్న కుటుంబాలలో ఎట్లాజరుగుతుంది? మగవాడుఒక్కడే ఎంతకని కష్టపడగలడు? స్త్రీకూడా (చదువుకున్నదయితే) ఏదో ఒక ఉద్యోగం చేస్తే వేన్నీళ్ళకు, చన్నీళ్ల మాదిరి వారికే కష్టాలు లేకుండా సాఫీగా జరుగవచ్చు. ఉద్యోగాల్లో చేరినంత మాత్రాన వాళ్ళేమీ గౌరవ హీనులు కారు. కాని స్త్రీలు కూడా (వుద్యోగాల్లో వున్న వాళ్ళు) కాస్త జాగ్రత్తగా వుంటే ఎక్కడా ఏమి అనుకోరు. వాళ్ళ గౌరవం పెరుగుతుందేకాని అగౌరవం ఏమీకాదు.

బి. పద్మానాగేష్ (కల్యాణదుర్గం)

*   *   *

సుమారు 7, 8 సంవత్సరాలక్రితం ఆడపిల్లలు కాలేజీ చదువులకు వెడితే వేలెత్తి చూపించి వారిని, వారి తల్లి దండ్రులను, పిల్లలకు పెళ్ళిచేయలేని అసమర్థులుగా భావించి చాలకించ పరచేవారు. ఈ విషయంలో సంఘం కాస్త ముందడుగువేసిందనుకోవచ్చు. కాని ఇప్పుడు ఉద్యోగాలు చేసే అమ్మాయిలు పెళ్ళికాని వారయితే, ఆఅమ్మాయి తల్లిదండ్రులను ఆమె సంపాదనను మరిగారని, పెళ్ళిచేయరని అడిపోస్తారు. పెళ్ళి అయినవారు ఉద్యోగముచేస్తే ఆమెభర్తను చేతకాని దద్దమ్మని, కుంటని నలుగురిలో చిన్నబుచ్చుతారు. కొద్దిరోజులు పోతే సంఘంలో ఇదీ ఒక సాధారణ విషయమైపోతుందని ఆశించవచ్చు.

శ్రీమతి. వసంతాప్రకాష్ (కర్నూలు)

*   *   *

వనితగారి వ్యాసం కొంత సత్యదూరంగా ఉన్నది. మన అమ్మలనాటికి చాలామంది స్కూల్ ఫైనల్‌దాకా వచ్చారని ఆమెవ్రాశారు. మన అమ్మలనాటికి ఏ కొద్ది మందో స్కూల్‌ఫైనల్ దాకా వచ్చారుకాని చాలా మందిమాత్రం కాదు.

నిర్మల (విరఘట్టాం)

## కుటుంబ నియంత్రణం

ఈ వ్యాసం చదువుతూ వుంటే మావాళ్ల కుటుంబ మొకటి జ్ఞాపక మొచ్చింది. ఆ దంపతులకు వివాహమయి 20 ఏళ్ల దాకా పిల్లలు లేరట. సంతానం కొరకు ఎన్నో వ్రతాలు, నోములు పూజలు చేశారట. భగవంతుడు వారిమీద దయ చూపాడు. నేడు వారికి 14 మంది పిల్లలు. పెద్ద అబ్బాయి లిద్దరికి వివాహం చేశారు. ఒకబ్బాయికి 6 మంది, ఇంకో అబ్బాయికి 8 మంది బిడ్డలు. ఒకింట్లో తల్లిదండ్రులు, బిడ్డలు, కోడళ్లూ, వారి బిడ్డలు మాత్రమే 32 మంది ఉన్నారు. ఇవన్నీ ఎందుకంటున్నానంటే పొరుగింట్లో ఎవరైనా చుట్టాలు వచ్చివుంటే, ఈ 32 మంది యింట్లో ఉన్న యిల్లాలు (అనగా కుచేలుని భార్య. ఆయనకు మేము కుచేలుడని పేరు పెట్టాము లెండి) "అవ్వ ! ఆ పొరుగింట్లో ఎప్పుడు చూచినా ఏ మేనమామనో, అత్త కొడుకో దయచేస్తూంటాడు. మా యిల్లు చూడండి ఎంత బాగా ఉంది. ఏదో నేనూ, మావారు, మా బిడ్డలు, కోడళ్లూ మనమరాళ్ళు మనుమళ్లు ఉన్నాం. అంతే ! మా యిల్లులా ఎక్కడా లేదేం ?" అంటుంది. మా తమ్ముడు నోరూరుకోక "అవు నత్తయ్యా ! మీ యిల్లులా ఎక్కడా ఉండదు. ఎక్కడి కెళ్లినా చుట్టాలతో సహా 50, 60 మంది ఉన్నారు" అని అన్నాడు.

కుమారి బి. భూమాదేవి (చిత్తూరు)

★

## వనితలకు మనవి

వనితావాణికి పంపే ఉత్తరాలు క్లుప్తంగా ఉండాలి. వీలైనంతవరకూ పత్రికలో సగం 'కాలం' మించకుండా ఉంటే బాగుంటుంది. వ్రాసినవారి పేరు వగైరా తెలుగులోనే వ్రాయాలి. ఇంగ్లీషులో ఉండకూడదు.

# మన కుటుంబ వ్యవస్థ

సి. కృష్ణకుమారి

"ఏమండీ! పిన్నిగారూ! రాధ ఇంట్లో వున్నట్టు లేదు. పుట్టింటికి వెళ్ళిందా యేం?" అని అడిగాను అలవాటులో పొరపాటుగా మా పక్కింటావిడను.

"ఆ! మరేనమ్మా! ఆ సంగతి వేరే అడగాలా! ఈకాలం పెళ్ళిళ్ళవటం, కోడళ్ళు ముచ్చటగా అత్తగారిళ్ళలో వుండటం ఎక్కడ జరుగుతోంది? పెళ్ళిళ్ళకుముందే ఆడపిల్లలు మగరాయుళ్ళలాగా షరతులు పెడుతున్నారుగా పెళ్ళవగానే వేరింటి కాపురం పెట్టాలని. ఏమిటో! అడ్డాలనాడు బిడ్డలుగాని గడ్డాలొచ్చాక బిడ్డలా అన్నట్టు ఈ మగకుంక లోకళ్ళు పెళ్ళవంగానే పూర్తిగా మారిపోయి, పెళ్ళాం మాటలకు వంతపలుకుతారు." అంటూ దీర్ఘాలు తీసింది.

"అరే! రాధావాళ్ళు వేరే వుంటున్నారా? నాకు మాటమాత్రమైనా చెప్పలేదే! ఏపేటలో ఇల్లు తీసుకున్నారు?" అని అడిగాను ఆశ్చర్యపోతూ.

"అబ్బే! ఇంకా కాపురం పెట్టలేదులే. ఇప్పుడు ఆమెగారు పుట్టింట్లోనే వుంది. మావాడు బదిలీ చేయించుకునేదాకా వేధించింది. (ఇది మా పిన్నిగారి వూహా) ఇప్పుడు వాడికి ఏలూరు బదిలీ అయింది. వాడెళ్ళాడు. ఈమె పుట్టింటికి వెళ్ళింది. రేపో మాపో కాపురం పెడ్తారు. పెళ్ళయి మూడు నెలలు కాలేదు. అప్పుడే ఈమెగారికి అత్తగారిల్లంటే ముఖంమొత్తింది కాబోలు. మాకాలంలో ఇట్లా వుండేవాళ్ళమా? అత్తగారెంత కోడరికంపెట్టినా కోడళ్ళం కిక్కురుమనేవాళ్ళమా? అసలు, బుద్ధి మగవాళ్ళ కుండాలిలే. ఇది కోరిందే అనుకో, మావాడు బదిలీచేయించుకోవట మేమిటి? వోర్శి నాబమ్మ, కీలుబొమ్మ, దద్దమ్మ. ఈకాలం మగవాళ్ళతీరే ఇంత." అంటూ భారతం చదివింది.

"అబ్బే! లేదండీ! ఈ కాలం మగవాళ్ళు కొంచెం సమర్థులవుతున్నారు. అందుచేతనే భార్య యే విధంగానూ బాధపడకుండా చూస్తున్నారు." అన్నాను నోరు జారి.

"ఏమిటే? అయితే అత్తగార్లం కోడళ్ళను బాధపెట్టేవాళ్ళమూను, కొడుకులు సమర్థులై వాళ్ళను రక్షించేవాళ్ళూనా? అయితే మా కోడలిని నేను కోడరికంపెడ్తున్నానా? చెప్పమ్మాయి, చెప్పు!

"అయ్యో! భగవంతుడా యెందుకు నోరు జారానా" అని మనస్సులోనే అనుకొని చెంపలేసుకున్నాను (మనస్సులోనే). నా గుండెల్లో పీచుపీచుమనటం ప్రారంభించింది. అయినా నేను వీలైనంత త్వరలో ఆ అవస్థనుండి బయటపడి మా పిన్నిగారిని సమాధానపరచకపోతే ఆ దండకం నామీద వినురుతుందని గ్రహించి "అబ్బే! మీ కోడల్ని మీరు కోడరికంపెడ్తున్నారని కళ్ళున్న నాలాంటి వాళ్ళెవ్వరూ అనరండీ! లోకంలో విషయం చెప్పానుగాని, మిమ్మల్నిగురించి కాదు. అయినా మీలాంటి అత్తగారిని పట్టుకుని నేను ఆమాట అనగలనా? నా స్వభావం మీకు తెలియుదా?" అంటూ సర్దాను.

అప్పటికి మా పక్కింటి పిన్నిగారు ఆవతారాన్ని చాలించి శాంతించింది. కాని, ఆతర్వాత, "పైకి నెమ్మదస్తురాలులాగా కనిపించినా 'రాధ' గడుసుపిల్ల అనే అభాండంతోకూడిన నా సర్టిఫికేటును లోకానికి అందించింది.

మాపక్కింటి పిన్నిగారి రకానికి చెందిన ఆడవాళ్ళు తమమాటకు ఎదురు తిరగనంతవరకే, తమమాటకు వంతపలికేవారికే మంచితనాన్ని అంటగడ్తారు. అట్లాగాక తమమాటకు వీసం ఎత్తు విభేదంగా మాట్లాడినా గడుసుదనాన్ని అంటగడ్తారు. లోకంతీరే ఇంత. అందుచేతనే నేను ఆమెమాటల్ని లెక్కచెయ్యలేదు.

ప్రతివారు ఈనాడు వుమ్మడి సంసారాలు విచ్ఛిన్నమైపోయి, వేరింటి కాపురాలు ప్రబలిపోతున్నయ్యనీ, దీనికంతటికీ కారణం ఈనాటి యువతుల సరిపుచ్చుకోలేని మనస్తత్వమే ముఖ్య కారణమనీ, స్వతంత్రభావాల ప్రబలికే మూలమనీ, మనకుటుంబవ్యవస్థ, మన ప్రాచీన సంప్రదాయాలు మన హిందూధర్మాలు మూలముట్టంగా వినాశనం పొందుతున్నయ్యనీ వాదిస్తారు. అందుకు నేను యేమాత్రం ఒప్పుకోను.

నేటి మన కుటుంబవ్యవస్థలో వుమ్మడితనం లోపించవచ్చు. మనపద్ధతుల్లో కొంతమార్పు రావచ్చు. అంతమాత్రాన మన హిందూధర్మానికి నాశనం జరుగుతుందనీ, మన కుటుంబవ్యవస్థకే దెబ్బతగులుతున్నదనీ వాపోవటం తగనిపని.

అసలు, ఈనాడు వుమ్మడిసంసారాలు ఛిద్రమయిపోయి, విభాజ్యకుటుంబాలు ప్రబలిపోవటానికి కారణం యేమిటో ఎవ్వరైనా ఒక్కసారి సరైన దృక్పథంతో ఆలోచించారా?

మన పూర్వీకుల్లో మాటికి తొంభైమంది వ్యవసాయంలో జీవించారు. ఒక కుటుంబంలో అన్నదమ్ములు పదిమంది వుంటే, ఆ పదిమందీ ఆపొలంమీదే పనిచేసి, ఆవచ్చిన పంటని ఒకే కుటుంబంలో వుమ్మడిగావుండి, ఒకేపొయ్యిమీద వండుకుని తినేవారు. వేరే సంపాదన అంటూ (డబ్బురూపంలో) వుండేదికాదు. అందుచేత ఆ అన్నదమ్ములు అందరూ ఒకరిమీద ఒకరు ఆధారపడి, అందరూ ఆపొలంమీదే ఆధారపడేవారు. అట్లాగే కుటుంబంలో ఆడవాళ్ళుకూడా జుట్టూ—జుట్టూ పట్టుకుని పోట్లాడుకుంటూకూడా ఆ సంసారంలోనుంచి బయటపడలేకపోయేవారు. ఈనాడు ప్రతి అత్త 'మాకాలం, మాకాలం' అంటూ పొగుడుకుంటున్నారుగాని, ఆకాలంలో అత్త—కోడళ్ళ పోట్లాటలు, కొట్లాటలు విపరీతంగా వుండేవి. అత్తగారి అధిపత్యం ఎక్కువ. అత్తగారు కోడలిని కోడరికంపెట్టినా, అన్నం పెట్టకుండా ఇంటి



# మన కుటుంబ వ్యవస్థ

చాకిరీ అంతా చేయించి, ఆ వేళ కో సమయానికో తాగా, ఆఖరికి కసిలిరక, కొడుకుచేత కోడలిని తంపించినా అడిగేవారు వుండేవారుకాదు. ఆనాటి కొడుకులు వేరే సంపాదన లేకనో ఏమోగాని, తల్లి చెప్పింది వేదవాక్యంగా భావించి, భార్యని నానా హింసలపాలూ చేసేవారు. ఆ ఇంట్లో కోడలికి అధికారంగాని, అధిపత్యంగాని వుండేవికావు. పాపం! ఆనాటిస్త్రీ (కోడలు) అంత బానిసత్వాన్ని అనుభవించి వుమ్మడిసంసారంలో వుండేది.

అయితే ఈ రోజులు ఆరోజులు కావు. ఈనాడు మగవారిలో వ్యవసాయదారులకన్నా, విద్యాధికులే ఎక్కువగా వుంటున్నారు. ఇప్పుడు మగవారు కుటుంబంలో ఇతరులమీద (తండ్రి, అన్నదమ్ములు) ఆధారపడటం తగ్గిపోయి, ఎవరికివారు ఉద్యోగాల మీద, స్వతంత్రముగా, పరాయివూళ్ళల్లో వుండటం వల్ల, వుమ్మడి కుటుంబజీవనానికి తావులేకుండా వుంది.

చదువూ—సంధ్యలూ వున్నా, లేకపోయినా, ఈనాటి ప్రతియువతీ కొంతవరకు స్వతంత్రభావాలు, ఆలోచనాశక్తి కలిగి వుండటంవల్ల బానిసత్వపు జీవితానికి ఎదురు తిరుగుతోంది. ఈనాటియువతికి అత్తమామలమీద, తక్కిన అత్తగారి తరఫు బంధువర్గంమీద గౌరవభావం, ఆదరణ లేకపోలేదు. ఆ మాటకొస్తే ప్రతియువతీ వివాహానికి పూర్వం తను వివాహితగా వున్నప్పుడు అత్తగారి కుటుంబంలో ఒకవ్యక్తిగా ప్రవర్తించాలని, ఆఇంట్లో అందరి ఆదరాభిమానాలను పొందాలనే కోరుకుంటుంది. అంతేగాని యే యువతీ వివాహానికి పాలుగేళ్ళకు పూర్వమే వేరింటికాపురం కావాలని కోరుకోనూ కోరుకోదు; పెళ్ళిచూపులనాడే ఆవిధంగా షరతులు పెట్టనూ పెట్టదు. అయితే, వాస్తవికంగా, వివాహానంతరం ఆమె వూహలు కల్లలే అవుతాయి.

ఈనాడు అత్తగార్లు పూర్వకాలంలోలాగా కోడళ్ళను మాడ్చిచంపటమూలేదు. కోడరికం పెట్టటమూలేదు. కాని, పూర్వపు అత్తగార్ల అధికారం తాలూకు ఛాయలుమాత్రం పూర్తిగా మాసిపోవు. అంతో—ఇంతో తమ అధికారాన్ని కోడళ్ళమీద చూపెట్టటానికీ, ప్రతివిషయంలోనూ సాధింపులూ—బెదిరింపులూ చూపెట్టటంలోనూ వెనుకంజ వెయ్యటంలేదు. 'ఉదా:'—మాపక్కింటి పిన్నిగారి మనస్తత్వాన్నే వివరిస్తాను. అదేం ఖర్మమో! ఆమెకు కోడలు చేసే ప్రతిపనిలోనూ, కోడలి ప్రవర్తనలోనూ యెన్నోలోపాలు కనిపిస్తవి. రోజు రోజుకూ ఎన్నో ఫాషన్లు మారిపోతుంటాయి. ఎప్పటి ఫాషన్లను అప్పుడు కొంతవరకు అనుసరించటం ఈనాటి యువతీయువకులకు ఇద్దరికీ ఫాషనే అయింది. 'ఫాషన్లు' అనేవి మనిషికి కీడు చెయ్యనంతవరకు, మరీ వికారంగా కనిపించనంతవరకు, పలుగురూ అనుసరించేరకమైనవి అయితే తప్పకుండా యెవ్వరైనా 'ఆ ఫాషన్లను' అనుసరించవచ్చుననే నా అభిప్రాయం. అయితే మా పక్కింటి పిన్నిగారి రకానికి చెందిన కొంతమందికి ఈమాదిరి ఫాషన్లను అనుసరించటం కూడా విడ్డూరంగానే వుంటుందనుకోండి!

మా పక్కింటి పిన్నిగారు "అదేమిటే! ఇంత అంత పదులుగా 'వేసుకుంటావ్!' ఆ సిల్కుచీరలు సంసారులు కట్టేవేనా? అయ్యో రామా! ఒక్కపని చేతకాదు. ఇవేం చదువులే నాతల్లీ మాయదారి చదువులు! అసలు మీవాళ్ళు గతిలేనివాళ్ళు కాకపోతే కూతురు అత్తగారింటికి వెళ్ళేప్పుడు చీరే సారె (ఖరీదెక్కువ) పెట్టకుండా వుంటారా?" ఈవిధంగా వీలైనప్పుడల్లా కోడల్ని సాధించటమేగాక, ఇరుగుపొరుగుతో వీలున్నప్పుడల్లా కోడలు వేషభాషల్ని గురించి, ఆమె పుట్టింటివారి లేమిని గురించీ సాధిస్తూ చాటుమాటుగా చెప్తూ వుంటుంది. ఇట్లాంటి అత్తగారితో కలిసివుండటానికి యే కోడలూ ఒప్పుకోదు. ఈవిధమైన మనస్తత్వాల ఫలితంగానే ఈనాడు కోడళ్ళు స్వతంత్రంగా కాపురం వుండాలని కోరుకుంటున్నారు. ఇంట్లో ఆడవాళ్ళ పోట్లాటలు భరించలేక మగవారుకూడా ఎవరికివారు స్వేచ్ఛగా, విడిగా బ్రతకాలని చూస్తున్నారు. మన కుటుంబపద్ధతులూ, కుటుంబంలో వ్యక్తుల మనస్తత్వాలు చూస్తున్న తర్వాత వుమ్మడి కుటుంబాలకన్నా విభక్తకుటుంబాలే నేటికాలానికి తగినవని తోస్తున్నది.

నిజానికి కలిసివుండేకన్నా దూరంగా వుంటేనే మమతలూ, ప్రేమలూ అధికమవుతవి. దూరంగా వున్న కోడలిమీద అత్తగారికి ప్రేమ ఎక్కువే. అత్తగారింటికి చుట్టంచూపుగా వచ్చిపోయే కోడలికి అత్తగారంటే ఆదరణగానే వుంటుంది. విడిగా వున్నంతమాత్రాన అత్తకోడళ్ళ అనుబంధాలను త్రెంపుకోవా లనుకోవటం పొరపాటే అవుతుంది. అవసరం వున్నప్పుడు కోడళ్ళూ అత్తగారింట్లో వుండొచ్చు. అత్తగార్లూ కొడుకులూ—కోడళ్ళూ దగ్గరకూ వచ్చి వుండొచ్చు. అత్తగారూ, ఆడబడుచులూ కొడుకుదగ్గరికి వచ్చివున్నా స్నేహ సౌహార్ద భావాలతో ప్రవర్తిస్తే బాధవుండదు. అట్లాకాకుండా, 'రామేశ్వరంవెళ్ళినా శనేశ్వరం' తప్పనట్లు, కొడుకూ—కోడలూ పరాయి ఊళ్ళో వున్నా వెళ్ళి అక్కడే వుంటూ, పనిచెయ్యకపోగా, కోడలు చీరెకొనుక్కున్నా, సినిమాకు వెళ్ళినా ఓర్పలేక పేచీలుపెట్టుకుంటే ఇక ఆ ఇంట్లో సుఖశాంతులు యేవిధంగా లభిస్తవి?

ఇతరదేశాల్లో స్త్రీలకు ఈ బాధలు వుండవు. ఎవరికివారే స్వతంత్రులు. అంతగా అవసరమై కోడలూ—అత్తగారూ మాట్లాడవలసివచ్చినా, కూతురూ—తల్లిమాటాడ వలసి వచ్చినా ఫలానా టైంకు ఫలానా హోటల్లో కలుసుకోవాలిఅని నిర్ణయించుకుని, ఆప్రకారం కలుసుకుని, ఎవరిదారిన వారు వెళ్ళిపోతారు. అయితే, వాళ్ళ పద్ధతులు వాళ్ళవి, మనపద్ధతులు మనవి. వాళ్ళ లాంటి యాంత్రికమైన కుటుంబజీవితాన్ని మనం కోరుకోలేము. మనపద్ధతుల ప్రకారం మనకు అనుబంధాలు, ఆత్మీయత ఎక్కువ. మనపద్ధతులు కొంతవరకు మంచివేకాని, ఏదైనా శృతిమించి రాగానపడితేనే ప్రమాదము.

ఒకానొకప్పుడు భర్త అసమర్థుడు అవటం వల్ల తప్పకనో, అత్తగారిపోటికి జడిసో, ఆనాటి తిరాజ్ఞ్రికాలమో స్త్రీలు నానాబాధలనూ ఓర్చికూడా వుమ్మడిసంసారాల్లో జీవితాలను ముగించారు. కాని, ఈనాడు "స్త్రీ" ఆఖరికి భర్త ఒక్కపిల్లమాట అన్నా సహించలేని మనస్తత్వాన్ని అలవరుచుకుంది. అందుచేత ఏనాడైతే అత్తగారు, ఆడబడుచులు, భర్తకూడా కొత్తగా ఆఇంటి వచ్చిన కోడలుకూడ తమ ఇంట్లో ఒకవ్యక్తేనని, ఆఇంటి కోడలిని గౌరవించాల్సిన బాధ్యత ,ఆమెఅభిరుచులను, హక్కులను కొంతవరకు అర్థంచేసుకుని ప్రవర్తించాల్సిన బాధ్యత తమకు వున్నదని గ్రహించి సభ్యతతో ప్రవర్తిస్తారో ఆనాడే ప్రతి స్త్రీ (కోడలు) వుమ్మడికుటుంబంలోనే వుండాలని తనంతట తానే కోరుకుంటుంది. అట్లా గాకుండా ఇంట్లో యే ఒక్కరూ ఆమెను లక్ష్యపెట్టక పోగా, ఇంట్లో పనంతా ఎవ్వరూ చెయ్యకుండా ఒక్కకోడలి మీదే వదిలేస్తే యే స్త్రీబాధ పడకుండా వుంటుంది? ముఖ్యంగా భర్త ఆమెవ్యక్తిత్వాన్ని గౌరవించకుండా, ఇంట్లో ఆమెబాధని, ఆమె అవస్థను గుర్తించకుండా, తల్లీ, చెల్లీ వగైరా ఇంట్లో వ్యక్తులకు మద్దతుఇచ్చి, అసమర్థుడుగా ప్రవర్తిస్తే ఆఖరికి భర్తకూడా 'పరమ శత్రువుగా' ఆమె కళ్ళకు కనిపిస్తాడు. అటువంటి సమయంలో ఆమె కిక్కురుమనకుండా ఆ ఇంట్లో మసలినా, ఆమెమానసికంగా ఎంతో క్షోభపడి, తనజీవితానికి సరైన సుఖం లేదని వాపోతుంది.

"పూర్వపు రోజుల్లో వ్యాప్తిలోవున్న వుమ్మడి కుటుంబాలు అన్నీ సుఖశాంతులు లేనివి" అని నేను అనను. కొన్ని వుమ్మడికుటుంబాల్లో అత్తా—కోడళ్ళు, ఆడబడుచులు అందరూ ఐకమత్యంతో మంచితనంతో సర్దుకు పోవటం వల్లనే ఆకొన్ని కుటుంబాలు సుఖశాంతులతో వర్ధిల్లినవి. అందుచేతనే 'వుమ్మడికుటుంబాలు' మళ్ళీ వ్యాప్తిలోకి రావాలంటే, సరిగ్గా సాగాలంటే, ఇంట్లోవున్న వ్యక్తులందరూ సరైన బాధ్యతతో ప్రవర్తించాలి. ఆఇంట్లోవుంటున్న వ్యక్తులు (మగవారిని మినహాయించి) ముఖ్యంగా అత్తా, ఆడబడుచులు, కోడళ్ళు ప్రతివిషయంలోను ఐకమత్యంతోను, స్నేహభావంతోను ప్రవర్తిస్తూ, సర్దుకుపోయేతనాన్ని కొంతవరకు అలవరుచుకోవాలి. అప్పుడే వుమ్మడి కుటుంబాలు విరిసీ విరియని మల్లెపువ్వుల్లా, సన్నజాజుల్లాగా పరిమళాలను వెదజల్లుతూ సుఖశాంతులతో వర్ధిల్లుతవి. అట్లాగాక, ఆ కుటుంబంలో యేఒక్కవ్యక్తికి ఆ అన్యాయం జరుగుతున్నట్లు కనిపించినా మగవారు తమఅసమర్థతను నిరూపించుకోవటానికి ప్రయత్నించక, తగిన సామర్థ్యంతో విడిగా సంసారాన్ని పెట్టుకోవడమే శ్రేయస్కరము.

ఉమ్మడి సంసారాలు ఛిద్రమైపోవటానికి కారణాలేమిటో వివరించాను. ఆకారణాలవల్లనే విభక్తకుటుంబాలు శ్రేయస్కరమని నమ్ముతున్నాను. అట్లాగాక, ఉమ్మడికుటుంబాలు శ్రేయస్కరంగా సాగటానికి నేను పైన వివరించిన విధంగా కుటుంబంలో వ్యక్తులు సర్దుకుపోతే, 'వుమ్మడి కుటుంబం' అంత శ్రేయస్కరమైనదీ అంత చక్కనిదీ అయిన కుటుంబం వేరే వుండబోదని నమ్ముతున్నాను. ★

# డాక్టర్ రాజు

బొమ్మల కథ

దేవిక 11


















# మీరు ఎంత తొందరలో వున్నాసరే

# నీవియాను ఉపయోగించగలరు

నీవియా క్రీం అనేక విధాల ఉపయోగపడుతుంది. ఇది ప్రకృతికి అత్యంత సన్నిహితమైంది. చర్మాన్ని ఇది మృదువుగాచేసి, పోషించి, రక్షిస్తుంది. ఇతర క్రీములు చేయలేని పనిని నీవియా చేస్తుంది—అలసి పోయిన గ్రంధులకు పునోత్తేజం కలిగిస్తుంది. మీ చర్మాన్ని, కాంతంగా, ఆరోగ్యంగా, యవ్వనంగా వుంచుతుంది. ఆమెకూ, అతనికీ, బేబీకి కూడా దాని సుకుమార రక్షణను మించినది లేదు.




కాంతివంతమైన చర్మానికి నీవియా సాటిలేనిది

# కవి సార్వభౌముడు

## నోరి నరసింహ శాస్త్రి

### జరిగిన కథ

సర్వజ్ఞ చక్రవర్తి బిరుదాంచితుడగు కొండవీటి ప్రభువు పెదకోమటి వేమారెడ్డి శ్రీనాథభట్టును కవిసార్వభౌమ బిరుదు పట్టముతో అలంకరించి, సర్వవిద్యానిలయమైన శ్రీ విద్యానగరమునకు విద్యావిజయ ప్రస్థానము చేయవలసిందని అర్థిస్తాడు. కార్యసిద్ధికై దైవజ్ఞులుసూచించిన పౌష్టిక క్రియలు ఆచరించి శ్రీనాథుడు విద్యానగరం చేరి ముమ్మకవి ఆతిథ్యం స్వీకరిస్తాడు. డిండిమభట్టును జయించేందుకే శ్రీనాథుడు వచ్చాడన్నవార్త వ్యాపిస్తుంది. డిండిమునకు ఆవిషయం శిష్యుల ద్వారా తెలిసి, శ్రీనాథుని బెదరగొట్టడానికి, లింగనసోమయాజి క్రతువు చూచేమిషతో యజ్ఞశాలకు వెడతాడు. శ్రీనాథునివెంట వచ్చినమల్లవీరుడూ పర్వతమల్లుయొక్క శిష్యుడూ విద్యానగరమల్లి వీరుడైన విద్యామల్లు శిష్యుని చేతిలో ఓడిపోతాడు. శ్రీనాథుని కవిత్వం దోషభూయిష్ఠమైందని విద్యానగరంలో ప్రవాదు బయలేరుతుంది. శ్రీనాథుడు మానసోల్లాస కావ్యాన్ని అభిప్రాయార్థం అరుణగిరినాథులకు పంపుతాడు. తాను గూఢచారుడను అనుమానమును పోగొట్టుకొనుటకు శ్రీనాథుడు కటకపాలుని సందర్శించి మెప్పుపొందుతాడు. శ్రీనాథుని ఔషధప్రభావంవల్ల పర్వతమల్లు శిష్యుడు విద్యామల్లు శిష్యుని మల్లయుద్ధంలో ఓడిస్తాడు. శ్రీనాథుడు డిండిములకు మానసోల్లాసకావ్యావహేళనంపై అధిక్షేపణపత్రంపంపుతూ కావ్యదోషాలు పండిత పరిషత్తులో నిరూపించమని డిండిముని సవాలుచేస్తాడు. కటకపాలుడైన తెలుగురాయడు శ్రీదేవరాయ ప్రభువుల సమక్షంలో పండిత పరిషత్తు ఏర్పాటు చేస్తాడు. శ్రీనాథ, డిండిముల వాదోపవాదాలు ప్రారంభమౌతాయి.

శ్రీచంద్రభూషక్రియాశక్తి ఆధ్వర్యమున జరిగిన యాయధికరణ విచారణలో, అప్పై నటుడిండిమునకుగాని, ఇటు శ్రీనాథునకుగాని, పామరజన వినోదము కావించు నప్రస్తుత ప్రసంగములు చేయుటకు అవకాశము చిక్కలేదు. ఉత్తమోన్నత న్యాయస్థానమున జరుగు విచారణవలెనే పరమ శాంతముగా సాగిపోయినది.

రాజనాథుడు పితృపాదుల తొందరపాటుకెంతయు చింతిల్లినను వారి గౌరవ మెట్టిదయిన నిలువబెట్టవలెనను నుత్కంఠతో, మానసోల్లాసకావ్యము బహుపర్యాయములు పఠించెను. అందలి భక్తిభావమాతని హృదయమును స్పృశించెను. 'అయ్యో, ఇందులో దోషములు వెదుకవలసివచ్చెనే' యను చింతతోడనే గావించెను. వ్యాకరణదోషములు కనబడలేదు. ప్రమాణగ్రంథములున్న వ్యాకరణముతో లేని దోషములు చూపి సమర్థించుట యసాధ్యము కనుక, వ్యాకరణ దోషములమాట యెత్తగూడదని తండ్రీ కుమారుడు నిశ్చయించిరి. నిర్ణీత ప్రమా

44—వ పేజీ చూడండి





## కొట్యూనులు.20

అరవం తెలుగు హిందీ సినిమా నాయిక
అధికంగా విశాలమౌతున్న వేదిక
పేరు రాకముందూ ఈమె ఉత్త ప్రమీల
ప్రతిభ ఉంటే పేరు తెచ్చుకోడం అవలీల

# పడుకొండలు

రంగధామ్

జరిగిన కథ

రామవరం ఆంధ్ర - ఒరిస్సా రాష్ట్రాల సరిహద్దు ప్రాంతంలో ఒక గ్రామం. శ్యామబాబు అక్కడ దిగి, ఆ ఊరిలోనే వైద్యవృత్తి చేసుకుంటున్న రాధానాథమిశ్రా గారిని కలుసుకుని ఆయన సహాయంతో ఉద్యోగం సంపాదించుకుంటాడు. రామవరంలోని మిల్లు యజమాని సత్యనారాయణరావు గారు తన పిల్లలకు శ్యామబాబు ట్యూషన్ చెప్పే ఏర్పాటు చేయిస్తాడు. నారాయణి మిశ్రాగారి పనిమనిషి. మిశ్రాగారు త్రాగుబోతు అయినా చాలా మంచివాడు. ఒకరోజున పోలీసులు ఆయనను పట్టుకుంటే శ్యామబాబు జరిమానా చెల్లించి విడిపిస్తాడు. మిశ్రా కౌదుర్వ్యసనం పోగొట్టేందుకు శాయశక్తుల ప్రయత్నిస్తాడు. మిశ్రాను విడిపించుటకు హామీ ఇచ్చిన సూర్యప్రకాశరావు పేకాటలో ధనం పోగొట్టుకొని ఆత్మహత్యకు పూనుకొనగా శ్యామబాబు రక్షిస్తాడు. మిల్లు గుమాస్తా ధర్మసూరి కుమార్తె లలితను చూసి శ్యామబాబు విభ్రమపొందుతాడు.

---

పెండ్లయిన పదేళ్ళకు ధర్మసూరిగారికి ఒక ఆడపిల్ల పుట్టింది. ఈ పదేండ్లలోనూ విశ్వేశ్వరరావుగారి పరిస్థితి క్రమంగా మారసాగింది. ధర్మసూరికి పెళ్ళి చేసిన రెండేండ్ల తరువాత తమ రెండవ కుమార్తె ప్రభావతికి కూడా మంచి సంబంధం చూసి వివాహం చేసేశారు. ఈ పెళ్ళిళ్ళవల్లా, నానాటికి పెరుగుతున్న—ఆదాయాన్ని మించిన—ఖర్చువల్లా విశ్వేశ్వరరావుగారు అప్పులు చెయ్యడం, అవి తీర్చడంకోసం ఆస్తులను అమ్మడం ప్రారంభించారు.

ధర్మసూరికి ఇంగ్లీషు చదువబ్బకపోయినా, తెనుగులో గ్రంథాలన్నీ చదివే అలవాటుండడంవల్ల కొంత విజ్ఞానం అబ్బింది. విశ్వేశ్వరరావుగారు ఖర్చులు తగ్గించుకొని, అప్పులన్నీ తీర్చే ప్రయత్నంలో పడేసరికి ధర్మసూరికి కొంత బాధ్యత తెలిసి వచ్చింది. అప్పులు నానాటికి పెరగడమేగాని, అవి తీరే సూచనలు కన్పించకపోవడం, ఖర్చు ఎంత తగ్గించుకుందామన్నా తగ్గకపోవడం, తండ్రి వృద్ధుడై బాధ్యతలన్నీ తనమీద పెట్టుండడంతో ధర్మసూరికి వ్యసనాలమీద వ్యామోహం తగ్గి, కుటుంబ స్థితిని గురించి ఆలోచన ప్రారంభమైంది. అప్పటికీ ఆస్తి బాగానే వుండడంవల్ల అహంభావం పోలేదు.

ఈ సమయంలో ధర్మసూరికి చాలా జబ్బు చేసింది. రెండు మూడు నెలలు మంచాన పడి వుండ

—39వ పేజీ చూడండి





## జరిగిన కథ

హాంబర్గ్ నగర నివాసి ప్రొఫెసర్ లిడెన్‌బ్రోక్ ఒక పాత గ్రంథం సంపాదిస్తాడు. దానిలో దొరికిన ఒకపత్రం లోని రహస్య సందేశాన్ని ఆయన తమ్ముడు కొడుకైన ఆక్సెల్ తెలుసుకుని లిడెన్‌బ్రోక్‌కు చెబుతాడు.

'ఆర్నెసాక్నుస్సెమ్' అనే ప్రాచీన శాస్త్రజ్ఞుడు, ఐస్‌లాండ్‌లో ఆరిపోయిన ఒక అగ్నిపర్వతం ముఖద్వారంలోనుంచి భూగర్భంలోనికివెళ్లినట్లు అందులో వ్రాసి ఉంటుంది. ఆక్సెల్ ఇది నిజంకాదని వాదించినా వినిపించుకోకుండా ప్రొ॥ లిడెన్‌బ్రోక్ అక్కడికిప్రయాణంకడ్తాడు. స్నాఫెల్స్ పర్వతం వద్దకు దారి చూపేందుకుహాన్స్ అనే గైడ్‌ను కుదుర్చుకుంటారు. స్కార్టారిస్ శిఖరం దిగువన వారికి మూడు రంధ్రాలు కనిపిస్తాయి. మధ్య రంధ్రంమీద స్కార్టారిస్ నీడ పడేవరకు కనిపెట్టుకొనిఉండి, నీడపడిన రోజున ఆరంధ్రంగుండా లోనికి దిగుతారు. కొంత దూరం వెళ్ళేసరికి వారికి రెండుదార్లు కనిపిస్తాయి. తూర్పువైపు సొరంగం లోంచి పోగాపోగా ఆదారి ఒకచోట ఆగిపోతుంది. పొరపాటు తెలుసుకుని వారు మళ్లీ రెండుదార్లు చీలినచోటకు ప్రయాణమవుతారు.

## 22

ఈసారి రెండవదారివెంబడి దిగి వెళ్ళటం ప్రారంభించాము. ఎప్పటివలె హాన్స్ ముందు నడిచాడు. నూరు అంగలు వేశామో లేదో ప్రొఫెసర్‌గారు గోడలమీద వెలుగుపడేట్లువేసి, "చూడండి! అతి ప్రాచీన భూభాగం! సరియైన మార్గాన్నే అనుసరిస్తున్నాం! రండి! త్వరగా!" అని అరిచాడు.

మొదటిరోజుల్లో భూమి కొద్ది కొద్దిగా చల్లబడుతున్నప్పుడు, పైపెచ్చుమీద పగుళ్ళు, చీలికలు, ఏర్పడ్డాయి; భూగోళం సంకుచితమయిపోవడమే వాటికి కారణం. మేము ప్రస్తుతం ప్రయాణం చేస్తున్నది ఇటువంటి చీలికలోనే. పొంగివస్తున్న 'గ్రానైట్'ద్రవం దానిలోనుంచే పారిఉండాలి. దానిలోని సందులన్నీ కలిపి ఒకవ్యూహంవలె తయారయ్యాయి.

దిగినకొలదీ, రాతినిర్మాణంలో మార్పులు బాగా స్పష్టంగా తేలిపోయాయి. భూగర్భశాస్త్రంప్రకారం

పైన చెప్పిన శిలాభాగం, ఖనిజాల 'పెట్టె'కి ఆధారం. 'గ్రానైట్' రాతి పునాదిపైన 'స్లేట్' 'గ్నైస్' 'మైకాషిస్ట్' శిలావిశేషాలు వేరే ఉంటాయి.

ఖనిజ శాస్త్రజ్ఞులెవరూ ప్రకృతిని ఇంత దగ్గరగా పరీక్షచేసి ఉండరు! ఇతరులు యంత్రాలతో దొలిచి మాత్రం తెలుసుకోనగలిగిన శిలానిర్మాణ విశేషాలు, వివరాలు మా కళ్ళతో చూడగలిగాము.

అందమయిన ఆకుపచ్చరంగుకల 'స్లేట్' రాయిలో రాగి, మాంగనీస్ లోహాల రేఖలు చిత్రవిచిత్రంగా చుట్టుకుపోయి ఉన్నాయి; అక్కడక్కడ ప్లాటినమ్, బంగారం కలిసి ఉన్నాయి. మానవుని దురాశకు అందకుండా, భూగర్భంలో ఇంత లోతుగా పూడిపోయిఉన్న ఈ సంపద గురించి ఆలోచించాను— పారలకుగాని, మరేవిధమయిన పరికరాలకుగాని అందనంతలోతుగా పాతుకుపోయి ఉన్నాయి; వాటిని సమాధినుంచి ఎవరూ ఎత్తుకుపోలేరు.

'స్లేట్' క్రింద 'గ్నైస్' రాయి; దీని నిర్మాణం చాలా సమరూపం కలిగి ఉన్నది. వాటి తర్వాత మైకా పొరలు; మెరిసిపోయే తెల్ల మైకా కంటికి ఇంపుగా ఉన్నది.

మా దీపాల వెలుగు శిలానిర్మాణంలోని చిన్న ఫలకంపైన ప్రతిబింబించి, కాంతికిరణాలు ముక్కలు ముక్కలయిపోతున్న ఒక పెద్ద వజ్రం శూన్యమధ్యంలో ప్రయాణం చేస్తున్నట్లు ఊహించాను.

ఆరుగంటలు అవుతున్నదనగా ఈ దీపాల వెలుగు సన్నగిల్లిపోయింది. ఆపైన పూర్తిగా అయిపోయింది. గోడలు ఇంకా స్ఫటికనిర్మాణం ఉన్నట్లు కనిపిస్తున్నా, కాంతివిహీనమయిపోయాయి. మైకాతో ఇతర శిలావిశేషాలు కలిసిపోయి ఉన్నాయి. మా చుట్టూ ఎటుచూసినా గ్రానైట్‌రాయి!

రాత్రి ఎనిమిదైనా నీరు దొరకలేదు. నేను విపరీతంగా బాధపడుతున్నాను. మా పెదనాన్న ఆగటానికి ఇష్టంలేక ముందు నడిచి వెళ్ళిపోతున్నాడు. ఏ ఊట గలగల అయినా వినబడుతుందేమోనని చెవి ఒగ్గి వింటున్నాడు. కాని ఏ గలగల శబ్దమూ వినిపించలేదు.

నా కాళ్ళు నన్నింక ముందుకు తీసుకుపోయేందుకు ఒప్పుకొనలేదు. మా పెదనాన్నను ఆగమనవలసి వస్తుందేమోనని నాబాధ నాలో నేనే అణచివేసుకున్నాను. నేను కనుక ఆగమని ఉన్నట్లయితే ఆయనకొక పెద్ద దెబ్బగా ఉండేది — ఎందుచేతనంటే, ఆ దినంకూడా అంతమవుతున్నది. అదే ఆయన చివరి అవకాశం.

నా బలం నన్ను వదలిపోయింది. ఒక అరుపుతో కూలిపోయాను.

"రక్షించండి! చనిపోతున్నాను!"

మా పెదనాన్న వెనక్కి తిరిగి నడిచివచ్చాడు. చేతులు కట్టుకుని వంగుని నన్ను పరీక్షించాడు. తర్వాత నెమ్మదిగా అన్నాడు, "అంతం ఇదే!" అని.

నిస్పృహచెంది, నిరాశతో ఆయన తల ఆడించటం చూశాను. కళ్ళు మూసుకున్నాను.

మళ్ళీ తెరిచేసరికి నా సహచరులు ఇద్దరూ కంబళ్ళు కప్పుకుని కదలిక లేకుండా పడుకుని ఉన్నారు. నిద్రపోతున్నారా? నామట్టుకు నేను విశ్రాంతి తీసుకోలేకపోయాను. నా బాధ మరీ ఎక్కువగా

—38వ పేజీ చూడండి

# చిన్నారి పాపాయి

బి. ఎస్. ఎల్. పి. దేవి

చిన్నారి పాపాయి చిరునవ్వు చంద్రికలో
చీకట్ల తెరలన్ని చెదరేనులే, కనుల
నాళలే జ్యోతులై వెలిగేనులే.

చిరు గజ్జెలల చిన్నియడుగులే జాడంగ
చిత్తమున చిరునవ్వు చిగురొత్తులే, మంచి
ముత్యాల వానలే కురిసేనులే.

పొన్నారి చినపాప ముద్దు పలుకుల లోన
పలుకుం దేనెల సోనలా సేములే, భావ
నాలోకమున దేలి పోయేములే.

చిరు నవ్వుతో పాపలే చేతులందివ్వ
స్వర్గ సోపానాల విహరింతులే, మధుర
జీవితస్మృతులన్ని స్ఫురియించులే.

చిట్టి నాపాపాయి చిరునవ్వు మోములో
చందురుడు సాక్షాత్కరించేనులే, నాదు
జన్మంబె ధన్యతను బొందేనులే.

చిన్నారి పాపాయి ముద్దు మోమునుజూడ
శ్రీరంగధాముడే దలపించులే, హృదయ
మిహాలోక చింతనే విడేనులే.




దైవజ్ఞపాతూరి శ్రీరామమూర్తి

**9-2-1962 శుక్రవారము మొదలు**
**15-2-1962 గురువారము వరకు**

**మేషం :**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

వృత్తివ్యాపారాది విషయాలలో క్రొత్తవారి సంబంధం కలుగుతుంది. ఇంతకుముందు మీ మనస్సును బాధిస్తున్న ధనవ్యవహార సమస్యలు చక్కగా పరిష్కారం అవుతవి. బంధువర్గంలో మీ మాటకు విలువ లభిస్తుంది. కుటుంబంలో శుభ సంతోషాల నిమిత్తం ధన వ్యయం అవుతుంది. దూరమందున్న మిత్రులవద్ద నుంచి లాభవార్తలు తెలుస్తవి. రాజకీయాలలో ఎదటివారి మాటను నమ్మి తొందరపడతగిన సమయం కాదు. స్వశక్తితో కార్యం సాధించుకొనవలసి ఉంటుంది. విలువగల వస్తువులు కొంటారు. వారాంతంలో కుటుంబంలోనివారికి అనారోగ్యం చేస్తుంది. అనుకున్న ప్రయాణాలకు ఆటంకాలు కలుగుతవి. ఇతరుల వద్దనుంచి రావలసిన ధనం సమయానికి లభిస్తుంది. 12, 13 తేదులలో అధికారులవల్ల అనుకూలత, సంఘంలో గౌరవం.

* * *

**వృషభం :**

(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)

మీకు ఈ సమయంలో దైవబలం బాగున్నది. మీ ఆలోచన పదిమందికీ సంతృప్తికరంగా ఉంటుంది. సంఘంలో గౌరవంతోపాటు మీ ఆదాయం కూడా క్రమంగా అభివృద్ధి అవుతుంది. దుబారా ఖర్చులు మాత్రం ఇప్పుడే మిమ్మలను వదలవు. ఒకటి రెండు సమయాలలో పరోపకారం నిమిత్తం స్వంతపనులను వదులుకొనవలసి వస్తుంది. తూర్పు, ఉత్తరదిక్కుల నుంచి ముందు ముందు లాభించగల వార్తలు వస్తవి. వ్యవహార రంగంలో మీ మాటలను విపరీతంగా అర్థం చేసుకొని కలహాలకు దిగేవారు ఉంటారు. ధర్మ కార్యాలు నెరవేరుతవి. బుద్ధిబలంతో వ్యవహార జయం సాధించగలుగుతారు. తరచూ కుటుంబవిషయాలలో చికాకు తోస్తూ ఉంటుంది 9, 10 తేదులలో ఇష్టవస్తు ప్రాప్తి, దేహ శ్రమ అధికం.

* * *

**గ్రహస్థితి**

కర్కాటకంలో రాహువు, మకరంలో అంగారక, బుధ, గురు, శని, కేతువులు, మకర కుంభాలలో సూర్య, శుక్రులు, మీన మేష వృషభ, మిధునాలలో చంద్రుడు.

**మిధునం :**

(మృగశిర 3, 4 పా., ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ప్రత్యక్షంగా జరిగే అపకారం ఉండదు. కాని, మనస్సు మాత్రం ఆందోళనకు గురి అవుతూ ఉంటుంది. పెద్దగా లాభిస్తుందనుకున్న కార్యకలాపాలలో గౌరవం మాత్రం దక్కుతుంది. అలవని తలంపుగా బంధు మిత్రుల వద్దనుంచి కష్ట వార్తలు తెలుస్తవి. ఏ సందర్భంలోనూ ముందుగా వాగ్దానాలు చేయుటం మంచిదికాదు. వృత్తి ఉద్యోగాలలో గతవారం కన్నా మనశ్శాంతి లభిస్తుంది. మీ బాధ్యతలను సక్రమంగా నెరవేర్చి ఎదుటివారి మన్ననలను పొందగలుగుతారు. ఒకప్రక్క మీతో మంచిగా మాట్లాడుతూ మీ పనులకు ఆటంకాలు కలిగించేవారుంటారు. జాగ్రత్తగా ఉండండి. పిల్లల ఆరోగ్యం బాగుండదు. వారాంతంలో ధనాదాయం పెరగగల అవకాశాలున్నవి. 11, 12 తేదులలో ప్రయాణ సూచనలు, శుభ సంతోషాలకై ధన వ్యయం.

* * *

**కర్కాటకం :**

(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష)

గతవారంకన్నా ప్రోత్సాహకరంగా ఉంటుంది. రకరకాల మనుష్యులతో సంప్రదించగల అవకాశం లభిస్తుంది. విలువగల వస్తువులు కొంటారు. తాత్కాలికంగా శ్రమ చేయవలసివస్తుంది. కాని ముందు ముందు మీ స్థానాన్ని బలపరచుకొనగలుగుతారు. శుభకార్య ప్రయత్నాలలో ఆటంకాలు ఎదురుకాగల సమయం. వివాదాలలో భారం మీపైన పడకుండా చూచుకొనటం అవసరం. విశ్రాంతిలేని పనులవల్ల దేహసౌఖ్యం లోపిస్తుంది. బంధువర్గంలో ఒకరిద్దరు మీ మంచితనాన్ని ఆధారం చేసుకొని మీమీ బాధ్యతలను వదలటానికి చూస్తారు. వ్యాపార, వ్యవహారరంగాలలో మీ శత్రువులకు చక్కగా సమాధానం చెప్పగలుగుతారు. 14, 15 తేదులలో వృధా త్రిప్పట, ఆదాయ భంగం.

* * *

**సింహం :**

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

క్రమక్రమంగా గ్రహబలం బాగుపడి అన్ని విధాలా మీ అంతస్థు పెరిగే సూచన లున్నవి. పై అధికారుల ఆదరాభిమానాలు లభిస్తవి. మీకు ఆలోచనతోచని సమయాలలో బంధు మిత్రుల సహాయం లభిస్తుంది. మీ కార్యభారాన్ని తగ్గించుకొనటానికి దైవికంగా మంచి అవకాశాలు లభిస్తవి. ఉష్ణాధిక్యంవల్ల మీ ఆరోగ్యం తగ్గుతుంది.

జీర్ణకోశాలలోనూ, శిరస్సుకు సంబంధించిన అవయవాలలోనూ బాధ కనిపిస్తుంది. వృత్తి ఉద్యోగాలలో అభివృద్ధి ప్రయత్నాలు నిదానంగా అనుకూలిస్తవి. పరిశ్రమకు తగిన లాభం పొందగలుగుతారు. వారం రెండవ భాగంలో మీ తొందరస్వభావంవల్ల స్నేహితుల మనస్సుకు బాధ కలిగించే సూచనలున్నవి. 14, 15 తేదులలో ఆదాయమును మించినఖర్చులు, బంధువులవల్ల విస్తారాలు.

* * *

## కన్య:

(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

"ఆశకు" అంతు కనుపించదు. పరిస్థితులకు తగినట్లుగా మీ పద్ధతులను మార్చుకొనవలసి వస్తుంది. అధికారులతో కలహప్రసంగాలు వస్తవి. ఒకసారి మీ పక్షంలో మాట్లాడినవారే మరొక సందర్భంలో మీకు వ్యతిరేకంగా తయారుకాగల సూచనలున్నవి. ఖర్చులు అధికం అవుతవి కాని, తలవనితలంపుగా ఆదాయం కనిపించటంవల్ల ఏవిధంగానూ చిక్కు ఉండదు. తోటివారి కార్యక్రమాలలోని లోపాలోపాలను చక్కగా సవరించి సహాయం చేయగలుగుతారు. కుటుంబంలోని వారితో స్వల్పవిషయాలలో అభిప్రాయభేదాలు వస్తవి. ఆడంబరము, పట్టుదలలు సాగించదగిన సమయం కాదు. అప్పు చేయటం వంటి పనులలో జాగ్రత్త, ముందు యోచన అవసరం. 12, 13 తేదులలో శుభవార్తలు, దైవ కార్యాలలో పాల్గొంటారు.

* * *

## తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

ఈ సమయంలో ముఖ్యంగా మీ ఆరోగ్యం లోపిస్తుంది. మీ ఆలోచనలను ముందుకు సాగనీయకుండా చేసేవా రుంటారు. అయితే మీ ఉత్సాహము, పట్టుదలా తగ్గవు. ధనవిషయంలో సహాయం లభించింది. శక్తి మించిన భారాన్ని పైన పెట్టుకొనటంవల్ల ముందు ఆందోళన కలిగినా యుక్తితో సాధించుకు రాగలుగుతారు. క్రొత్త క్రొత్త విషయాలు అనుభవంలోకి వస్తవి. వారం రెండవభాగంలో జరిగే సంఘటనలువల్ల ఆశ్చర్యము, నిరుత్సాహము కలుగుతుంది. కాని, జాగ్రత్తగా సమర్థించుకొని గౌరవాన్ని దక్కించుకొంటారు. ముందు ముందు గొప్ప పనులను సాధించగలమనే ధైర్యము, అందుకు తగిన అవకాశము లభిస్తవి. పిల్లల ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి. 9, 10 తేదులలో అసౌఖ్యం, శుభవార్తలు, స్వల్ప ఆదాయం.

* * *

## వృశ్చికం :

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)

బయటివారివల్ల ఏవిధమైన లాభనష్టాలను ఎదురుచూడవలసిన అవసరం ఉండదు. మీరు చేసిన పనులు మీ ఆలోచనలకు వ్యతిరేకంగా జరగటంవల్ల ముందు ముందు కూడా ఏమీ చేయజాలమనే భావం తోస్తుంది. నిబ్బరంతో ఉండటం అవసరం. వ్యవహార రంగంలో చిక్కులను క్రమంగా దాటుకో గలుగుతారు. సంఘంలో మంచి పేరు ప్రతిష్ఠలు లభిస్తవి. మీ క్రింద పనిచేయువారితో కలహాలు ఆరంభం అయినా వెంటనే పరిష్కారం అవుతవి. కుటుంబంలోనివారి ఆరోగ్యం బాగుండక ఆందోళన పడతారు. సాధ్యమైనంతవరకు ప్రయాణాలు వాయిదా వేసుకొనటం మంచిది. వారాంతంలో శుభకార్య ప్రయత్నాలు సానుకూలంగా అవుతవి. ఆదాయం కూడా బాగుంటుంది. 14, 15 లలో ధనలాభం, సంచారము, బంధువుల మూలంగా ఖర్చులు.

* * *

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

గతవారం కన్నా ఈ వారంలో మనోధైర్యము, ధనవిషయంలో ధారాళత్వము, వ్యవహార రంగంలో అనుకూల వాతావరణము కనుపిస్తవి. మీరు విశేషంగా ప్రయత్నించవలసిన అవసరం లేకుండా సంఘ కార్యాలలో విజయం లభిస్తుంది. లోగడ ఎప్పుడో రావలసిన ధనం ఈ సమయంలో చేతికి వస్తుంది. ఏవిధమైన వ్యాపారంలోను విశేషంగా డబ్బు పెట్టుబడి పెట్టతగిన సమయం కాదు. అధికారులతో సంప్రదించగల అవకాశం లభిస్తుంది. వీలైనంతవరకు మీ రహస్య విషయాలలో ఇతరులకు ప్రవేశం కలుగకుండా చూచుకొనండి. సాహసకార్యాలలో దిగవద్దు. వారాంతంలో శుభవార్తలు, విందు భోజనాలు, వస్తునష్టము.

* * *

## మకరం :

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

క్షణం తీరిక ఉండదు. అయితే మీరు అనుకొన్న పని మాత్రం జరుగదు. మీరు ఇతరుల కలహాలలో కొంతవరకు నలగవలసి వస్తుంది. కొన్ని సమయాలలో డబ్బు యిబ్బంది కనుపిస్తుంది. కాని, బుద్ధిబలంతో బయటపడకుండా సమర్థించుకొంటారు. పెద్దగా లాభం లేకపోయినా వ్యవహారాలు ప్రశాంతంగా పరిష్కారం అవుతవి. పుణ్యకార్యాలు, విద్యా, వినోద ప్రసంగాలు మొదలయిన వాటిలో పాల్గొనే అవకాశాలు లభిస్తవి. పిల్లల మూలంగా ఆనందం లభిస్తుంది. ఉత్తర దిక్కునుంచి ధనలాభం ఉంటుంది. వారాంతంలో ఉష్ణ పైత్య ప్రకోపాలవల్ల బాధపడతారు. చట్టా వ్యాపారంవంటి పనులలో ఆసక్తి కలుగుతుంది. 12, 13 లలో వృత్తిలో సాటివారివల్ల అనుకూలత, సందేహాలవల్ల కార్యభంగం.

### ఈ వారము ధరలు

బంగారుధర క్రమంగా తగ్గుతుంది. వెండి ధర వారం ఆరంభంలో కొద్దిగా తగ్గి నిలకడగా ఉంటుంది. పసుపు ధరలో గిరాకీ కనుపిస్తుంది. నూలు ధర పెరిగి వారాంతంలో మందీ అవుతుంది. వేరుశనగ నూనెకు గిరాకీ వస్తుంది. పప్పు ధర నిలకడగా ఉంటుంది. మిర్చి ధర అకస్మాత్తుగా పెరిగే అవకాశా లున్నవి. మాపుల ధర వారాంతంలో మందీ అవుతుంది. కందులు, కంది పప్పు ధర కూడా మందీ కావచ్చు. బెల్లం ధర పెరుగుతుంది.

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

ధనవ్యయం విశేషంగా ఉంటుంది. కాని, బాహ్య విషయాలలో అనుకూలత కలుగుతుంది. మీ ఆరోగ్యం కూడా ముందుకన్నా మేలుగా ఉంటుంది. క్రొత్త వ్యాపారాల వంటి పనులలో ప్రవేశిస్తారు. మిమ్ములను నమ్మి వాక్సహాయము, ధన సహాయము చేసేవారు లభిస్తారు. మీ అభివృద్ధికి కావలసిన హంగులు అన్ని ఏర్పడుతవి. అయితే ముఖ్యమైన పనులు జరగటానికి కొంచెం నిదానం అయ్యే సూచన ఉన్నవి. ప్రయాణాలు చేస్తారు. కుటుంబంలోనివారి ఆరోగ్యం సరిగా యుండదు. మీరు వ్రాసే ఉత్తరాలలో గాని, డబ్బుకు సంబంధించిన లెక్కలలో గాని పొరపాట్లు రాకుండా చూచుకొనండి. మీ పనులలో తప్పులు వెతికేవారు సిద్ధంగా ఉంటారు. 10, 11 తేదులలో దేహశ్రమ, నిరుపయోగమైన పనులతో కాలక్షేపం.

* * *

## మీనం :

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

ఇతరుల దృష్టిలో మీరు గొప్పగా కనుపించకపోయినా మీకేవిధమైన లోపము తోచదు. కుటుంబంలో సుఖము, సంతోషము లభిస్తవి. వృత్తిలో మీ కార్యక్రమాలు అందరికి సంతృప్తిని కలిగించగలవు. అధికారులు అనుకూలిస్తారు. ముందు కొంచెం చికాకు, దేహశ్రమ తోచినా ఆర్థికంగా ఫలితం బాగుంటుంది. ఎదురు చూస్తున్న వార్తలు సకాలానికి అందుతవి. ఒకటి రెండు సందర్భాలలో మాటలు ముదిరి కలహాలకు దారితీసే అవకాశాలు వస్తవి. మీ బుద్ధిబలంతో చల్లగా తప్పించుకో గలుగుతారు. తరచు బంధుమిత్రులను కలుసుకొనవలసిన అవకాశం ఏర్పడుతుంది. దైవకార్యాలు జరుగుతవి. 14, 15 లలోగు గౌరవప్రాప్తి, పనులలో ఆలస్యం.

★



# హామేషా తమాషా



## మగువమాయ

రాముని రమణిని రావణుడు
కాముకుడై దొంగిలించ కలిగెను ముక్తి
మామూలు చూపు చూచిన
తోముదురీనరులు వీఁపు తుక్కగునటులన్!
గోపికలు వేలకొలదిగ
ప్రాపించగ కృష్ణుడెట్లు బ్రతికెనో గానీ,
కాపురమొకతితో జేయగ
నోపికతోనుండలేను నోర్వనుబ్రతుకున్!

బిజ్ఞాపల్లి లక్ష్మీకాంతంగుప్త,
(మహబూబునగరు జిల్లా)

* * *

## అదే ఇదీ

అదేఇది·ఇదంటే మీకు ఇదిగా వుంటుం
దేమో
హామేషా తమాషా గురించి మీకు
చెప్పాలని
నాకు చాలా ఇదిగా ఉంది.
ఇదంటే మీ రేమనుకుంటారో
దీనిని గురించి పెద్ద ఇదేమిలేదు
ఏదో వుందనుకొని చాలా ఇదైతా
రేమో గాని
ఇందులో పెద్ద ఇదేమీ లేదు
ఈ ఇదిని గురించి మీకు చాలా ఇదిగా
చెప్పాలనుంది నాకు.
కాని మొన్న చాలా ఇదిగా చెపితేనే
మా మాష్టారు చాలా ఇదై పొయ్యారు
ఆ యిదిచూచి మా వాళ్లంతా నన్ను
చాలా ఇదిగా చేసారు
ఇంకా ఇదిగా చెప్పాలనుందిగాని
మీకే యిది ఏర్పడుద్దేమోనని నా
కిదిగా ఉంది
ముగించా నిది.

పి. రామమోహన్ రావు, (ఖమ్మంమెట్టు)

* * *

## అనుభవజ్ఞానం

ఒకానొక నదిపై చిన్న వంతెన వుండెను. రెండు మేక లొకనాడు నదిని దాటుచు వంతెన మధ్యలో కలిసికొనెను. వంతెన చాల సన్న ముగ నుండుటచే నొకదాని నొకటి తప్పించుకొనుటకు వీలులేకపోయెను. అప్పుడు అవి తమ తెలివి నుపయోగించి వెనుకకు తిరిగిపోయి వేర్వేరుగా వంతెన దాటినవి. కొంతసేపటికి రెండు తెలివి తక్కువ మేకలు పై వాటివలె వంతెవ మధ్యలో కలిసికొనిన తరువాత దెబ్బలాడుకొని నదిలో పడిపోయెను. వెంటనే ఆ రెండును నీటిలో యీదుకొనుచు గట్టుచేరెను.

నీతి: నీటిలో పడుటవలన ఈత నేర్వవచ్చును.

డి. యల్. సేమాని బి. కాం. (బొంబాయి)







# సువర్చల

సాయంత్రం అయిదుగంట అయింది. నేనూ రాఘవా, కృష్ణుడూ కలిసి సుబ్బారావు కోసరం, వాడి ఇంటికి బయల్దేరాము. ప్రతిరోజూ సాయంత్రం అయిదున్నర కల్లా పార్కుకు చేరుకోవటం మా నల్గురికీ అలవాటు. ఆవేళ ఆదివారం అవటం మూలాన అయిదు గంటలకే బయల్దేరాము. సుబ్బారావు అరగంట క్రితమే బయల్దేరి వెళ్ళిపోయాడని వాళ్ళ చెల్లాయ్ చెప్పేప్పటికి చాలా ఆశ్చర్యపడ్డాము. ఎందుకంటే రోజూ మేము వచ్చే వరకూ ఖచ్చితంగా ఇంటిదగ్గరే ఉండేవాడు. ఎక్కడికి వెళ్ళాడా అని తర్జన భర్జనలు పడుతూ మేము పార్కుకు చేరుకొన్నాము. తీరా అక్కడికి వెళ్ళేవరికి సుబ్బారావు అప్పటికే అక్కడ మందార చెట్టు ప్రక్కన గడ్డిలో వెల్లకిలా పడుకొని ఏదో తీవ్రంగా ఆలోచిస్తూ కనబడ్డాడు. మా ముగ్గురికీ పచ్చే ఆశ్చర్యం వేసింది.

"ఏమిట్రా ? ఇవాళ నాలుగున్నరకే బయల్దేరావుట ?" ఆశ్చర్యపోతూ ప్రశ్నించాడు రాఘవ.

ముగ్గురం వాడి ప్రక్కన కూర్చున్నాము.

ఒహ రెండు నిముషాలు శూన్యంలోకీ, ఒక నిముషం మా మొఖాల్లోకి చూసి, ఇంకో నిముషం వూరుకొని అప్పుడు మెల్లిగా అన్నాడు సుబ్బారావు. "నేను ప్రేమించారా !"

నేను ఉలిక్కిపడ్డాను. రాఘవ వెధవమొఖం పెట్టాడు. కృష్ణుడు మాత్రం ఘొల్లున నవ్వేశాడు.

సుబ్బారావుకి కొద్దిగా కోపం వచ్చింది. లేచి కూర్చుని "ఏం ? నేను ప్రేమించకూడదా ?" అంటూ గట్టిగా అరిచాడు. ఇంకొంతసేపు నేమలా వూరుకొంటే వాడు ఘొల్లున ఏడిచేస్తాడని అనిపించింది మాకు.

రాఘవ సముదాయింపుగ అడిగాడు "చూడు సుబ్బారావూ ? నువ్వెవర్నిరా ప్రేమిస్తా ?"

సుబ్బారావు మొఖంమీదకి పడిన జుత్తుని వెనక్కి త్రోసుకుంటూ అన్నాడు.

"వెంకట్రామయ్యగారి అమ్మాయి లేదూ ! సువర్చల ! ఆ అమ్మాయినేరా !"

ఈసారి ముగ్గురం తుళ్ళిపడ్డాం ! కారణం అసలు సుబ్బారావు ఇంతవరకూ ఏ ఆడపిల్లవంకా నుంచొని ఒక అరక్షణం గూడా చూసిన పాపాన పోలేదు. వాళ్ళు అటుప్రక్కనుంచే తను ఇటు ప్రక్క ఉండేవాడు. అలాంటివాడు ప్రేమిస్తా మేమిటి ? పోనీ ఏదో ప్రేమించాడయ్యా అనుకొంటే అది సువర్చలనా ?

సువర్చల హైస్కూలు తెలుగు మేష్టారు వెంకట్రామయ్యగారి పెద్దమ్మాయి. ఇప్పుడే

# సుబ్బారావు

వరకూ చదివింది. సరిగ్గా సంవత్సరం క్రిందటే సువర్ణలకి పెళ్ళయింది. పెళ్ళయిన నెల రోజులకే ఆమె భర్త యాక్సిడెంట్‌లో చచ్చిపోయాడు. ఆమె గాజులు చిట్లిపోయినయి. ఆమె నుదుటి కుంకుమ ఆమె పదిహేడవ ఏటే చెరిగిపోయింది. అప్పటి నుండే ఆమె విధవ! సువర్ణలని వీడు ప్రేమింతటవా ?

"ఒరేయ్! నీ కేమన్నా మతి పోలేదుకదా ?" కృష్ణుడు సుబ్బారావు వంకే చూస్తూ ప్రశ్నించాడు.

"ఏం ? ఎందుకు పోవాలి ?" ఎదురు ప్రశ్న వేశాడు సుబ్బారావు.

"ఎందు కేమిట్రా ! నువ్వు ఒక విధవావిడని ప్రేమిస్తావా ? నీ కసలు బుద్ధుందీ ?" విసురుగా అన్నాడు రాఘవ.

సుబ్బారావు లేచి నుంచున్నాడు. కుడిప్రక్కనున్న చెట్టుకొమ్మ గట్టిగా పట్టుకొని సినిమాలో హీరో లాగా పోజిచ్చి గంభీరంగా అన్నాడు.

"హు ! విధవ ! జీవితమంటే, జీవించడమంటే అర్థం తెలియని అమాయకపు బాలిక విధవా ? దేవుడు విధించిన శిక్షకి బాధ్యురాలు సువర్ణలా ? సంసారం గూడా చెయ్యకుండానే భర్త చనిపోయినందుకు బ్రతికియుండటం సువర్ణల చేసిన తప్పిదమా ? అట్లయితే ప్రభుత్వము సతీ సహగమనము ఎందుకు రద్దు చేసినట్లు ? హు ! వెధవ సంఘం !"

వాడితో ఇహ వాదించటం అనవసరమని ఊరుకొన్నాడు రాఘవ.

"ఒరేయ్ ! మీరే చెప్పండ్రా ! మనకో చెల్లాయ్ ఉందనుకోండి ! మన చెల్లాయే ఆ పరిస్థితిలో ఉంటే మనం ఆమెకి మళ్ళీ పెళ్ళి చెయ్యటానికి ప్రయత్నిస్తామా లేదా ?"

మేము ఏమీ మాట్లాడలేకపోయాం ! వాడిలో కూడా చాలా నిజాయితీ, నిస్స్వార్థత ఉందని అప్పుడే తెలిసింది మాకు.

"అట్లయితే నువ్వు సువర్ణలని చేసుకోవడం తప్పదంటావు !" అన్నాను నేను.

"అవునురా ! నా జీవితంలో ఒక మంచి పని చేశానని తృప్తిపడతాను. అటుప్రక్క సూర్యుడు ఇటుప్రక్క పొడిచినా, సముద్రాలన్నీ పొంగినా ..."

"అవ్వేమీ జరగక్కరలేదు కాని మీ నాన్నకీ సంగతి తెలుస్తే, నాసామిరంగా !" వేళాకోళంగా అన్నాడు కృష్ణుడు.



"ఫరవాలేదు. 'మా నాన్న మాత్రం ఏమి చేస్తాడు ? "ఆస్తి ఇవ్వను పొమ్మంటాడు" అంతేగా ! స్వతంత్రంగా బ్రతకలేనా ? చేతిలో డిగ్రీ ఉంది. వెధవ గుమాస్తా గిరైనా దొరకదా?"

"ఒరేయ్ ! ఇంతకీ నువ్వింత హంగామా చేస్తున్నట్టు ఆ సువర్చల కేమైనా తెలుసా ?" సందేహంగా ప్రశ్నించాడు రాఘవ.

"లేదురా ! తెలియదు. కాని చెబుతాను. ప్రేమ భిక్ష పెట్టమని ప్రార్థిస్తాను. అంగీకరించేట్టు చేసుకొంటాను."

"ఏడిసినట్టే ఉంది ! ఇంతకూ ఈ గొడవేమీ ఆ అమ్మాయికి తెలియదన్నమాట !" చిరాకుగా అన్నాడు కృష్ణుడు.

"ఒరేయ్ ! ఈ విషయంలో మీ రందరూ నాకు సహాయం చెయ్యండ్రా ! సువర్చల దృష్టి నావేపు ఎలా మళ్ళించుకోవాలి? ఐడియాలూ, గట్రా అరువివ్వండ్రా !" ప్రాధేయపడ్డాడు సుబ్బారావు.

రాఘవగాడు మంచు ముక్కలాగా కరిగిపోయాడు.

"ఒరేయ్! సుబ్బారావూ ! నువ్వింతగా ప్రాధేయపడాలట్రా ! మేము నీకు ఏ విషయంలో సహాయం చెయ్యమన్నామురా ? చెప్పు, నా చూడు. నీకూ, సువర్చలకీ తప్పకుండా వివాహం జరిపిస్తాము." అభయహస్తమిచ్చేశాడు రాఘవ. సుబ్బారావు మొఖం చేటంత అయింది. అలాగే సహాయం చేస్తామని నా దగ్గర, కృష్ణుడి దగ్గరా వట్లేయించుకొన్నాడు. అప్పటికే బాగా ప్రొద్దుకూకి పోయింది. అందరం ఇళ్ళకి వడవడం ప్రారంభించాము. నలుగురం చీలిపోయేప్పుడు రాఘవ అన్నాడు : "ఒరేయ్ ! సువర్చల వీణ్ణి లవ్ చెయ్యటానికి అందరం ఐడియాలు ఈ రాత్రికి ఆలోచిద్దాము. ప్రొద్దున్నే నలుగురం కృష్ణుడు గదిలో కలుసుకొని ఒక మంచి ఉపాయం ఆలోచించి అమలుపరుద్దాం !

ఎవరి దారిన వాళ్ళం వెళ్ళిపోయాం ! నాకు ఆ రాత్రంతా వాడి గురించే ఆలోచన. వాళ్ళ నాన్నకి వా డొక్కడే సుపుత్రుడు. బోలెడంత ఆస్తి ఉంది. వీణ్ణి బందరులో వాళ్ళ బాబాయి దగ్గరుంచి కాలేజీలో చదివించాడు. రెండు, మూడు మార్లు చూసి చివరకి మొన్న సెప్టెంబరులోనే బి. ఏ. కంప్లీటు చేశాడు. ఆ పైన ఏమైనా సరే చదువనని వాళ్ళ బాబాయితో చెప్పేశాడు. రాఘవా నేనూ అంతకుముందే బి. ఏ. కంప్లీటు చేసి కలక్టరాఫీసులో గుమాస్తాలుగా చేరిపోయాం. కృష్ణుడు మాత్రం ప్రస్తుతం ఫైనలియర్‌లో ఉన్నాడు. అసలు సుబ్బారావు అంత మంచి కుర్రాడు—మా దృష్టిలో అమాయక చక్రవర్తి—ఇంకోడు లేడని పెద్ద ప్రతీతి. అలాంటివాడు ఇలా ప్రేమించి పెళ్ళి చేసుకొంటా ననడం—అందులోనూ ఒక వితంతువుని—నిజంగా ఆశ్చర్యపడదగ్గ విషయమే. ఏది ఏమైనా మొత్తానికి సుబ్బారావు ప్రేమించాడు. వాడు ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోవటానికి మే మందరం తోడ్పడటం అనేది మా కనీసపు విధి అని నిర్ణయించుకొన్నాను.

మర్నాడు ప్రొద్దున్న నేను కృష్ణుడు రూముకి వెళ్ళేసరికి అప్పటికే అక్కడికి చేరుకొన్న ముగ్గురూ

# సువర్చలా-సుబ్బారావు

కనిపించారు. రాఘవ పడక్కుర్చీలో పడుకొని ఆ రూము దూలాల వంకే చూస్తున్నాడు. కృష్ణుడు గంభీరంగా కిటికీలోంచి ఎదురింటి కిటికీ వంకే చూస్తూ సిగరెట్టు తాగేస్తున్నాడు. సుబ్బారావు వీళ్ళిద్దరి వంకా ఆత్రుతగా చూస్తున్నాడు. నా రాక నెవ్వరూ గమనించలేదు కూడా. అయిదు నిమిషాలు గడిచిపోయినయి. ఒక్క అంగుళం కూడా కదలకుండా అలాగే కూర్చుని మెల్లగా అడిగాడు రాఘవ.

"ఒరేయ్ ! సుబ్బారావూ ! సువర్చల నీ దగ్గర నుంచి పుస్తకాలు పట్టుకెళుతుం దన్నావుగదూ!"

"అవునురా! రెండు మూడు రోజుల కోసారి మా చెల్లాయి నడిగి తీసుకెళుతుంది."

"మరి మీ చెల్లాయికా పుస్తకా లెక్కడివి ?"

---

కొన్ని సంవత్సరాల తరువాత ఇద్దరు స్నేహితులు మళ్లీ కలుసుకున్నారు.

"మీ ఆవిడ మంచిదేనా" ప్రశ్నించాడు ఒకడు రెండో అతణ్ణి.

"దేవత! అంటే నమ్మ" సమాధానం చెప్పాడు అతడు.

"ఎంత అదృష్టవంతుడివిరా! మా ఆవిడ ఇంకా బ్రతికే ఉన్నది." విలపించాడు మొదటివాడు.

డి. పాండురంగరావు (కర్నూలు)

---

"నేనే ఫ్రెండ్స్ యూనియన్ నుంచి తెచ్చిస్తుంటాను" అన్నాడు సుబ్బారావు.

"అవునా ! మరి ఏం నవలలు తెచ్చిస్తుంటావ్?"

"శరత్‌వి, ప్రేమచంద్‌వి ఎక్కువగా తెచ్చిస్తుంటాను !"

"అదే నీ బుద్ధితక్కువతనం !"

గతుక్కుమన్నాడు సుబ్బారావు. "అదేవిట్రా ?" అంటూ ప్రశ్న కూడా వేసేశాడు.

"అవునురా ! ఒక వితంతువు పిల్లకి, అందులోనూ నువ్వు లవ్ చేసిన పిల్లకి ఇవ్వాల్సిన పుస్తకాలు అవా ? ఏ వెధవ చెప్పాడూ అంట ?" కోప్పడ్డాడు రాఘవ.

"మరింకేం ఉన్నయిరా !" విచారంగా అన్నాడు సుబ్బారావు.

"నీ బొంద ! ఏమీ లేకపోవడ మేమిటి ? వితంతు వివాహాలను గురించిన పుస్తకాలు అనేకం ఉన్నాయి. కందుకూరి వీరేశలింగంగారి స్వీయ చరిత్ర ఉదాహరణకి తీసుకో. ఇంకా బోలెడు. కన్యాశుల్కం ఇంకోటి. ఇలా కన్యాశుల్కం లాంటి నవల లన్నీ వెదికి, వితంతు వివాహాల్ని ప్రోత్సహించే సరిక్రొత్త నవల లేవన్నా మార్కెట్టులో కొస్తే కాని, వాటిని సువర్చల కందజేయించు మీ చెల్లి ద్వారా ! ఆ పుస్తకాల ద్వారా ఆమెకు తిరిగి వివాహం చేసుకోవాలని, అలా చేసుకొంటే అది తప్పు కాదనీ అభిప్రాయం కలగాలి. తరువాత నువ్వు మన పేటలో ఉన్న వితంతుశరణాలయంలో మెంబరుగా చేరు. నెలకు పది రూపాయలు చందా పడేస్తే చాలు. నిన్నే అధ్యక్షుడు చేసిపారేస్తారు. ఇంకోపని చెయ్యి. సువర్చల మీ చెల్లాయి కోసం వచ్చినప్పుడల్లా నువ్వు వితంతు వివాహాలగురించి చిన్న లెక్చర్లు—సువర్చల వినేట్లు దంచుతూండు"

సుబ్బారావు బ్రహ్మానందపడిపోయాడు. రాఘవ చెప్పిన విషయాలన్నీ తు. చ. తప్పకుండా పాటిస్తాననిమాట గూడా ఇచ్చేశాడు. సుబ్బారావు అందరికీ కాఫీలు తెప్పించటంతో ఆవేళ మా కార్యక్రమం పూర్తయిపోయింది. మరో రెండు రోజుల వరకూ సుబ్బారావు మాకు కనబడలేదు. మూడో రోజు సాయంత్రం మేము పార్కునుంచి ఇంటికి వెళుతూంటే సుబ్బారావు హడావుడిగా అద్దె సైకిలుమీద పోతూ ఎదురుపడ్డాడు. మమ్మల్ని చూసి సైకిలు దిగాడు.

"ఏవిట్రా ! అసలు కనబడటమే మానేశావ్?" అంటూ అడిగాను నేను.

"ఏముందిరా ! కొద్దిగా బిజీ ! అన్నట్టు వితంతు శరణాలయంలో మెంబరుగా చేరాను. వచ్చే నెలలోనే దాని తాలూకు ఎలక్షన్స్. అందరూ నన్ను శక్రటరీగా ఉండమంటున్నారురా! ప్రస్తుతం ఆ పనిమీదే తిరుగుతున్నాను. ఇంకో సంగతిరోయ్! మీరు చెప్పినట్టు సువర్చలకి ఆ పుస్తకాలు కొని అందజేయించాను. అప్పు డేమయిందో తెలుసా ! సువర్చలే నా దగ్గర కొచ్చి "ఈ రెండు పుస్తకాలు చాలా బాగున్నాయండి. ఇలాంటివే ఇంకేమైనా ఉంటే ఇవ్వండి ! శరత్ నవలలతో విసుగెత్తింది !" అందిరా !

"గూడ్ ! దారిలో కొస్తూందన్నమాట !" సంతోషపడిపోయాడు రాఘవ.

"వెళ్తారా ! కొద్దిగా పనుంది. రేపు—కాదు—ఎల్లుండి సాయంత్రం పార్కు కొస్తా ! టాటా" అంటూ పుషరుగా వెళ్ళిపోయాడుసుబ్బారావు.

అనుకొన్నట్లే ఆ రెండోరోజు సాయంత్రం పార్కుకు మాకంటె ముందే వచ్చి కూర్చున్నాడు సుబ్బారావు. మనిషి దిగాలుపడి ఉన్నట్టు కూర్చున్నాడు.

"ఏమిట్రా ! అలా ఉన్నావేం ?" అంటూ అడిగాము మేము.

"మా బాబాయి కోప్పడ్డాడు. అన్నాడు తల వంచుకొని.

"ఎందుకూ ?" అన్నాడు రాఘవ ఆశ్చర్యంగా.

"నేను వితంతుశరణాలయంలో కలగజేసుకుంటున్న సంగతి ఆయన కెవరో చెప్పారుట. "హాయిగా ఇంట్లో కూర్చోక నీ కెందుకురా ఆ గొడవలన్నీ ? మరోసారి ఇటువంటి వేషా లెయ్యి

లోకు. ఇకనుంచీ అక్కడికి కెళ్ళొద్దని" వార్నింగిచ్చాడురా !"

"అది సరేగాని సువర్చల సంగతి ఏమయింది?"

సువర్చల సంగతడిగేప్పటికి సుబ్బారావు కొద్దిగా తంబరపడ్డాడు.

"వరేయ్ ! సువర్చల నాతో మాట్లాడిందని చెప్పానా ? నిన్న నా గదిలో కూర్చున్నా నేను. మా చెల్లి కాలేజీ నుంచి ఇంకా రాలేదు. మా పిన్ని వంటింట్లో ఉంది. అప్పుడేమో సువర్చల సరాసరి నా గదిలోకి వచ్చేసిందారా' మీ చెల్లి ఏదండీ ?" అంటూ. నేను కొద్దిగా స్టన్ అయి తెప్పరిల్లి "ఇంకా కాలేజీ నుంచి రాలేదూ" అన్నా. వెను తిరిగి వెళ్ళిపోబోయింది.

"కూర్చోండి ! ఇప్పుడే వస్తుంది. వచ్చే టైమయింది." అన్నా.

మాట్లాడకుండా అక్కడ కుర్చీలో కూర్చుంది. "నిన్న మీరు తీసుకెళ్ళిన పుస్తకం ఎలా ఉంది ?" అన్నారా !

"చాలా బాగుందండి ! కాని అందులోని కొండలరావులాంటి కారెక్టర్లు నిజ జీవితంలో ఉండటం అసంభవమేమో అనిపిస్తుంది." అంది.

"భలేవారండీ ! అనేకమంది ఉన్నారు. నాకూ నిజంగా పుస్తకంలోకల్లా ఆ పాత్రే నచ్చింది" అంటూ పుస్తకం చదవకపోయినా కోసేశాను నేను.

"మీకు కూడా వితంతు వివాహాలంటే చాలా ఇష్టమనుకొంటానే ?" అందిరా ! అంతే అక్కడ్నుంచి ఒక లెక్చరు దంచేశాను.

"అవునండీ ! దురదృష్టవశాత్తూ వితంతువులకి వివాహాలు జరగాలని కోరేవాళ్ళలో నే నొకణ్ణి. వీరేశలింగం మొదలైన మహాపురుషులు వారి జీవితమంతా ధారపోసి ఇటువంటి వివాహాలు చేయటానికి ప్రయత్నించి సఫలీకృతు లయ్యారు. నిజం ఆలోచించి చూడండి. ఎవరికైనా చిన్నప్పుడే భర్త పోయా డనుకోండి. అప్పు డిహ వారి గతేమిటి ? జీవితాంతం వారలా బ్రతకవలసిందేనా ? వారూ మానవులే కదా ! వారికి కూడా అనేక కోరికలుంటయ్ ! కాని యీ వెధవ సంఘం వారిని దూరంగా త్రోసివేస్తుంది. అప్పుడు వారి గతేమిటి !? అలా బ్రతికి ఉండటం కంటే చావడం మంచిది. అందుకనే పీతైనంతవరకూ వారికి సహాయపడటమే నా జీవిత పరమావధిగా ఎంచుకొన్నాను. నేనూ ఒక వితంతువునే పెళ్ళాడతాను. నేనే కాదు. మా శరణాలయంలోని మెంబర్లందరూ అదేపని చేస్తారు. సంఘాన్ని ఎదిరిస్తాము. ఈ విషయంలో తల్లిదండ్రులని కూడా లెక్కచెయ్యము.....క్షమించండి. ఆవేశంలో ఏవేవో మాట్లాడేసినట్లున్నాను."

సువర్చల నవ్వుతూ అంది : "మీలాంటి సహృదయులు ఉండబట్టే సంఘం ఆటలు సాగటంలేదు. నిజంగా మీతో పరిచయం కలగటం నా అదృష్టంగా భావిస్తున్నాను."

"దాన్దేముంది గాని, సువర్చలాదేవిగారూ ! మీరు కూడా వితంతు శరణాలయంలో ఎందుకు చేరగూడదు ?"

"ఏమోనండీ ! అంతమందిలోకి రావాలంటే నాకు ఏమిటోగా ఉంటుంది" అంది సిగ్గుపడుతూ.

"మొదట్లో అలాగే యుంటుంది. ఫరవాలేదు. రేపే చేరండి. అక్కడ మీ యిష్టమొచ్చిన పని నేర్చుకోవచ్చు. అల్లికలు, కుట్టుపని, టైపు ప్రాక్టీసింగ ...."

"నిజంగా ఇవన్నీ ఉన్నాయాండీ ?"

"నిజంగా ఏమిటండీ ? ఉన్నవే అనుయితేనూ! రేప్పే చేరండి. నేను వెళ్ళేప్పుడు మీ యింటకొస్తాను. వెళదాం !" అన్నాను.

"రేపు వద్దులెండి. ఎల్లుండి వస్తాను" అంటూ వెళ్ళిపోయింది. అదిరా సంగతి. కాబట్టి మనం రేపు ఆమెని వెంట నిడుకొని మా శరణాలయ ప్రవేశ మొనర్చుచుంటిమి" అన్నాడు సుబ్బారావు సగర్వంగా.

వారం రోజులు గడిచిపోయినయి. సుబ్బారావు ఈ వారం రోజులూ ఏమైపోయాడో ఎవ్వరికీ తెలియలేదు. ముగ్గురం కలిసి వాడి యింటికి బయల్దేరాము. మమ్మల్ని చూసి సంతోషపడిపోయాడు.

"ఇప్పుడు మీ దగ్గరికి నేనే వద్దామను కొంటున్నారా !" అన్నాడు నవ్వుతూ.

"ఈ వారం రోజుల్నుంచి క్షణం తీరిక లేదురా! రేపే మా శరణాలయం వార్షికోత్సవం. దానికి ఏర్పాట్లూ అవీ చెయ్యడానికి తల ప్రాణం తోకకి వస్తూందనుకోండి. అన్నట్టు మీ రందరూ రేపు మధ్యాహ్నం మూడున్నర కల్లా అక్కడికి కొచ్చెయ్యండి. ఏవో నాటికలు గూడా ఏర్పాటు చేశాం! నేనేం వేయటంలే దనుకో !"

"వరేయ్ ! అంత గట్టిగా మాట్లాడుతావేంరా! మీ బాబాయి ...." అంటూ ఏదో అనబోయాడు రాఘవ.

సుబ్బారావు ఇల్లెగిరేట్లు నవ్వాడు. "పిచ్చి నాయనా ! మా బాబాయి ఊళ్ళో లేడనీ, మరో వారం దాకా రాడనేగా నే నీ వ్యవహారంలో తిరుగుతోంది ?"

'సరే ! ఈ గొడవేం గాని సువర్చల సంగ తేమయింది ?''

సుబ్బారావు హఠాత్తుగా గొంతు తగ్గించి చెప్పటం మొదలెట్టాడు. ''అన్నట్టు మీకు తెలియ దనుకొంటా. సువర్చలని ఆరోజే అందులో చేర్పించేశాను. అప్పట్నుంచీ నేనంటే చాలా 'ఇది' గా ఉంటోంది. నాతో చాలా చనువుగా కూడా మాట్లాడుతోంది. రోజూ తప్పనిసరిగా ఆమే, నేనూ శరణాలయంలో ఒక నిమిషంసేపన్నా మాట్లాడు కొంటున్నాము. మొన్న సాయంత్రం ఏమందో తెలుసా ?'' అంటూ ఆశ్చర్యార్థకం ఉపయోగించి మళ్లీ తనే చెప్పుకుపోసాగాడు, సుబ్బారావు. ''తన జీవితం అధోగతిపాలు కాకుండా ఆమెని నేను రక్షించానుట. అందుకని తన యావజ్జీవితమూ ఆమె నాకు కృతజ్ఞురాలై యుంటుందిట.'' అని కాసేపాగి ''ఈ మాటల అర్థం ఏమిటంటారూ ?'' అన్నాడు సుబ్బారావు.

''అది కూడా నువ్వే చెప్పు !'' అన్నాడు కృష్ణుడు వాడి ప్రేమ సఫల మయిపోతోందీ అన్న ఉక్రోశంతో. ఎందుకంటే సువర్చల చాలా అందంగా ఉంటుంది. అటువంటి అందగత్తె సుబ్బారావు గాడికి దక్కుతోందే అని చూసినా ఎవడయినా సరే, లోపల్లోపల ఏడవక మానడు. (నాకూ రాఘవాకి మాత్రం ఆ ఉక్రోషం లేదు. సుబ్బారావు మా ప్రాణ స్నేహితుడు.)

ఇంతలో ఎవరో వచ్చి సుబ్బారావుని పిల్చు కెళ్లిపోయాడు. మే మందరం ఎవరి ఇంటికి వాళ్ళ బయలుదేరాం.

''ఒరేయ్ ! సుబ్బారావు వాళ్ల నాన్న ఈ పెళ్లికి ఒప్పుకొంటా డంటావా ?'' అనుమానంగా అడిగాడు కృష్ణుడు.

''ఏమో ! ఉన్నది ఒక్కడే కొడుకయ్యె ! ఒప్పుకోక దూరం చేసుకొంటాడా !'' అన్నాడు రాఘవ.

మర్నాడు మధ్యాహ్నం మూడున్నరకల్లా ముగ్గురం శరణాలయం దగ్గరికి వెళ్లాం ! అక్కడ చాలా కోలాహలంగా ఉంది. స్టేజీ చక్కగా అలంకరించారు. మమ్మల్ని చూడగానే సుబ్బారావు పరుగెత్తుకొంటూ వచ్చి తీసుకెళ్లి మొదటి వరుస కుర్చీల్లో కూర్చోబెట్టాడు. మరి కాసేపటికల్లా సభ ప్రారంభమైంది. ఎవరో ఒకమ్మాయి ''వందే మాతరం'' పాడింది. సుబ్బారావు మా ప్రక్కనే కూర్చుని ''సువర్చల కూడా వచ్చిందిరా ! ఆ వరుసలో నాలుగో కుర్చీ చూడండి !'' అంటూ గొణిగాడు. మేము అటువేపు చూశాము. సువర్చల అక్కడ అప్సరసలాగా కూర్చుంది. ఆభరణా లేవీ లేకపోయినా మిగతావారి కందరికన్నా చాలా అందంగా ఉందామె. అందరూ ఉపన్యాసాలిస్తున్నారు.

''ఒరేయ్ ! సుబ్బారావ్ ! నువ్వు కూడా ఒక చిన్న ఉపన్యాసం దంచు. సువర్చల డంగైపోవాలి. నీ వాగ్ధాటి చూసి !'' అన్నాడు రాఘవ నవ్వుతూ.

సుబ్బారావు వెంటనే లేచి స్టేజి వెనుకకు పరుగెత్తాడు. మరో నిముషంలో మైకులో సుబ్బారావు పేరు వినిపించింది. ''ఇప్పుడు సుబ్బారావు గారు మాట్లాడుతారు.'' వెంటనే సుబ్బారావు చిరునవ్వుతో మైకు ముందు నుంచున్నాడు. వాడింతకుముందు పట్టుమని పదిమందిలో కూడా

## సువర్చలా-సుబ్బారావు

మాట్లాడి ఎరగడు. అలాంటివాడు స్టేజిమీద ఎలా మాట్లాడగలడా అని ఆశ్చర్యం వేసింది. సుబ్బారావు మెల్లగా పెదవి విప్పాడు. ''అధ్యక్షా ! సోదర సోదరీమణులారా ! (రెండుసార్లు దగ్గాడు.) నేడు .... జమీన్ ఇవాళ .... చాలా గొప్ప దినపర్వం .... సారీ, పర్వదినం! (వెనుకనుంచి కేరింతలు.) అసలు వితంతు వివాహాల గురించి ఆలోచించే ముందు మనం .... మనం .... ముందు తెల్సుకోవల్సింది ... దాని అర్థం ! వితంతువంటే ఎవరు ? (''వెధవ'' వెనుకనుంచి సమాధానం.) అవును ! భర్త లేని స్త్రీ. అప్పు డామె గతేంకావాలి ? (వెనుకనుంచి కేక ''ముండ మొయ్యాలి !'') ''అంతే !

ఆ తరువాత ఎంత వెదకినా సుబ్బారావు మాకు స్టేజీమీద కనబడలేదు. నాటికలు అయిపోయిన తరువాత మా దారిన మేము ఇళ్లకు వెళ్లిపోయాం. తరువాత రెండు రోజుల వరకూ సుబ్బారావు మాకు కనబడలేదు. ఆరోజు రాత్రి నేనూ, రాఘవా మాట్లాడుకొంటూ కృష్ణుడు రూములో కూర్చున్నాము. టైము తొమ్మిదయివుంటుంది సుబ్బారావు ఉంగారుగా లోపలి కొచ్చాడు. వాడి మొహం పాలిపోయింది.

''ఏవిట్రా ! ఇప్పు డొచ్చావ్ ? ఏం జరిగింది?'' అంటూ ప్రశ్నించాడు రాఘవ.

''ఇందాక సువర్చల మా యింటి కొచ్చిందిరా !'' అన్నాడు నెమ్మదిగా.

''ఇంత రాత్రిప్పుడా ? ఎందుకు వచ్చినట్టు ?''

''ఎందు కేమిట్రా ? వచ్చి ''అన్నయ్యా నన్నూ రామాన్నీ ఆశీర్వదించు'' అందిరా.

రాఘవ నేనూ కూడా ఉలిక్కిపడ్డాం ! ''ఏమిట్రా ? రామం ఎవరూ ?'' కృష్ణుడు అడిగేశాడు.

''వాళ్లింటి ప్రక్కన అద్దె కుంటున్నాడురా! నేను చేయూత యివ్వటం మూలాన్నే తను ఆ నిశ్చయాని కొచ్చిందట. లేకపోతే తను బావితో కప్పలాగా అలాగే జీవించేదట. ఇద్దరూ ఇప్పుడు పది గంటలబండికి బెజవాడ వెళ్తున్నారు. అక్కడ రిజిష్ట్రారాఫీసులో రేపు మారేజీ చేసు కొంటారుట. మొన్న పెద్ద పెద్ద నాయకు లందరూ ఇచ్చిన ఉపన్యాసాలు ఆమెకు ధైర్యాన్నిచ్చి నయ్యట ! పైగా నా ఉపన్యాసమే ఆమెకు ఆ నిర్ణయం కలుగజేసినయ్యట !

నేను అలా సహాయపడ్డందుకు నాకు తనూ ఆ రామంగాడూ జీవితాంతం ఋణపడి ఉంటారుట. అదిరా సంగతి ! నా ప్రేమకోసం నేనేడిస్తే చివరికి జరిగిం దిదీ ! బండి బయల్దేరటానికి మరో అరగంట టైముంది. సువర్చలా వాళ్ల నాన్నతో వాళ్ళు పారిపోతున్న సంగతి చెప్పెయ్యనా ?'' ఉక్రోషంగా అరిచాడు సుబ్బారావు.

''పోనీలేరా ! సువర్చల కాపోతే ఇంకో అమ్మాయి! నువ్వలా ఊలా అయిపోతావేం ? అయినా వాళ్ళ పెళ్లి చెడగొడితే నీకేమొస్తుంది !'' అంటూ ఓదార్చాడు రాఘవ.

కాసేపాగాక ''ఛీ! పాడు శరణాలయం ! ఈ... పాడు .... సువర్చల కోసం అక్కడ అద్దమైన చాకిరీ చేశాను. ఛచ ! బుద్ధి తక్కువయిపోయింది' అనుకొంటూ ఇంటికి వెళ్లిపోయాడు సుబ్బారావు.

''శ్రమ ఒకరిదీ, ఫలితం మరొకరిదీ ?'' అన్నాడు కృష్ణుడు.

* * *

ఆ తరువాత నెలరోజులకల్లా తన పెళ్లి శుభలేఖలు అందరికీ పంచిపెడుతూ కనబడ్డాడు సుబ్బారావు.

కట్నం పాతికవేలుట ! పిల్లను తను చూడకుండానే ఒప్పుకొన్నాడుట!

''హరి ! సుబ్బారావ్ !'' అనుకొన్నాం మేం ముగ్గురమూనూ. ★



ఉన్నది. ఈ ప్రమాదం తప్పించుకొనటం ఎలా? మా పెదనాన్న అన్న, "అంతం ఇదే!" అన్న మాటలు నా చెవులలో ప్రతిధ్వనిస్తున్నాయి. నా అలసటతో, తిరిగి భూతలంపైకి చేరుకొనగలమా అనుకున్నాను.

మాపైన ఉండేది నాలుగున్నర మైళ్ళ దళసరి భూభాగం. అంత మందమయిన భూభాగమూ నా భుజాలమీదకే ఒరిగిపోతున్నదా అనిపించింది. నాలో మిగిలిన శక్తినంతా మరొకవైపు తిరిగి పడుకొనటానికి వినియోగించాను.

కొన్ని గంటలు గడిచాయి. మమ్మొక గాఢమైన నిశ్శబ్దం ఆవరించింది. ఇది సమాధిలోని నిశ్శబ్దం. మాచుట్టూ ఉన్న గోడలతో సన్నటిది కనీసం అయిదు మైళ్ళ మందం ఉంటుంది.

ఆ నిద్రమైకంలోనే ఏదో సవ్వడి వినిపించినట్లయింది. సొరంగంలో చీకటి అధికమవుతున్నది. జాగ్రత్తగా నా చుట్టూ చూశాను. హాన్స్ ఒక దీపం పట్టుకుని వెళ్ళిపోతున్నాడు.

ఎందుకు వెళ్ళిపోతున్నాడు? హాన్స్ మమ్మల్ని వదలిపారిపోతున్నాడా? మా పెదనాన్న మంచి నిద్రలో ఉన్నాడు. అరవాలి అనుకున్నాను. ఎండిపోయిన నా పెదవులను చొచ్చుకుని రాలేకపోయింది నా కంఠస్వరం. పూర్తిగా చీకటిపడిపోయింది. సద్దు మణిగిపోయింది.

"హాన్స్ మనల్ని వదిలిపోతున్నాడు!" అని అరిచాను. "హాన్స్! హాన్స్!"

కాని ఈ మాటలు నాలో నేనే అరుచుకున్నాను. నన్ను దాటి వెళ్ళలేదు. కొన్ని క్షణాలు భయవిహ్వలుడనయినా, అంతవరకూ అతి నమ్మకంగా మసలుతూ వచ్చిన ఒక వ్యక్తిని అనుమానించినందుకు సిగ్గుపడ్డాను. అసలు అతను మమ్మల్ని విడనాడటంలేదు. పైకి నడిచివెళ్ళేబదులు క్రిందుగా దిగి నడిచివెడుతున్నాడు. దురూహగనుక ఉండినట్లయితే పైకి పోయేవాడు. ఈ ఊహ నన్ను శాంతపరచింది. ఇంకొకవిధంగా ఊహించటం ప్రారంభించాను. హాన్స్ అతి నిదానంకల మనిషి. ఏదో పెద్ద ప్రమాదమయిన విశేషం ఉంటేగాని నిద్రనుంచి మేల్కొనేవాడుకాదు. అతన్ని లేపినది ఏమై ఉంటుంది? నిశ్శబ్దమైన ఆ రాత్రిలో నా చెవులకు అందనిదేమయినా విన్నాడా?

## 23

నిదానంగా మా వేటగాడు వెళ్ళిపోవటానికి ఏవేవో కారణాలు వెదెక్కిన నా మెదడులో తిరగవేశాను. అర్థంలేని ఆలోచనలతో నా తల నిండిపోయింది. పిచ్చెక్కుతున్నదేమో అనుకున్నాను.

కాని చివరకు అగాధంలోనుంచి కొన్ని శబ్దాలు వినిపించాయి. హాన్స్ తిరిగి వచ్చేస్తున్నాడు. గోడల పైన అస్థిరమయిన వెలుతురు పడుతున్నది. హాన్స్ కనిపించాడు.

మా పెదనాన్నవద్దకు వెళ్ళి, భుజంమీద చెయ్యి వేసి నెమ్మదిగా మేలుకొలిపాడు. మా పెదనాన్న లేచి కూచున్నాడు.

"ఏమిటి?" అని అడిగాడు.

"ఫొట్టెన్," అని జవాబు ఇచ్చాడు మా వేటగాడు.

కావలసినంత చికాకుపడినట్లయితే ఎవరయినా బహు భాషా ప్రవీణుడు అవవచ్చుననుకుంటాను.

# భూగర్భంలోనికి సాహసయాత్ర

27-వ పేజీ తరువాయి

నాకు డానిష్ ఒక ముక్క అయినా రాదుకాని మా 'గైడ్' ఏమి చెప్తున్నాడో గ్రహించాను.

"నీరు! నీరు!" అని అరిచాను పిచ్చివానివలె చప్పట్లు కొడుతూ, అభినయము చేస్తూ.

"నీరు!" అన్నాడు మా పెదనాన్న. "హ్వార్?" అని ఆ అయిస్‌లాండర్‌ను అడిగాడు.

"నెడాట్" అన్నాడు హాన్స్.

ఎక్కడ? క్రిందనా! నాకు చక్కగా అర్థమయింది. మా వేటగాడిచేతులు పట్టుకుని అదిమాను. అతను నావైపు నిదానంగా చూశాడు.

మా నిర్గమనానికి సన్నాహాలు ఎక్కువసేపు పట్టలేదు. త్వరలోనే బాగా క్రిందకి వాలిపోతున్న ఒక సొరంగంలోనికి దిగివెళ్ళాము.

---

ఒక వ్యాపారస్తుడు దొంగలు పడితే మోగే రెండుయంత్రాలు తన యింటికి తెచ్చుకున్నాడు. వాటిని ఎక్కడ ఉంచాలో అతని ఆలోచన తెగక మునుపే బయట కార్లో పెట్టివచ్చిన ఆ రెండు యంత్రాలు గల్లంతు అయినాయి.

కె. ఎస్. ఆర్. శర్మ (వరంగల్లు)

---

గంటసేపటికి ఆరువేల అడుగులు నడిచాము. రెండువేల అడుగులలోతుకి దిగి ఉంటాము.

అప్పటికే, 'గ్రానైట్' గోడ వెనుక ఒక వింత శబ్దం వినగలిగాము. దూరంనుంచి వినిపించే ఉరుముల గర్జన పోలిఉన్నది. అరగంటముందు, వెతుకుతున్న ఊట దొరకకపోవటంతో, నా బాధ తిరిగి వచ్చింది. కాని మా పెదనాన్న ఈ కొత్త చప్పుడు ఏమిటో వివరించి చెప్పాడు.

"హాన్స్ పొరబడలేదు" అన్నాడు. "నువ్వు వినేది ఒక ప్రవాహం గర్జన."

"ప్రవాహమా?" అని అరిచాను.

"సందేహంలేదు. మన సమీపంలోనే ఒక అంతర్వాహిని ప్రవహిస్తోంది."

ఒక నూతనమైన ఆశ మమ్మల్ని ఆవరించగా, త్వరత్వరగా అడుగులు వేయదొడగాము. ప్రవహిస్తున్న నీటి శబ్దం నాకు కొంత శక్తిని ఇచ్చింది. శబ్దం అధికమవటం బాగా తెలుస్తున్నది. మాపైన దూరమైన మార్గం అనుసరించి ఎడమవైపు గోడవెనుక గర్జిస్తూ దొర్లిపోతున్నది. ఎక్కడయినా తడి దొరుకుతుందేమోనని రాతిని తడుముతూ వచ్చాను. కాని లాభం లేకపోయింది.

మరొక అరగంట గడిచింది. మరొక మైలున్నర ప్రయాణం చేశాము.

మా వేటగాడు మొదటే ఇంతదూరం అన్వేషించి వచ్చిఉండడని స్పష్టంగా తెలిసిపోయింది. పర్వతేయులకుఉండే సహజజ్ఞానంతో రాతిమధ్య అంతర్వాహిని "పసిగట్టి" గలిగాడు: అయితే ఈ అమూల్య ద్రవం చూడలేదు, దానితో దాహం తీర్చుకొనలేదు.

ఇలా ముందుకు సాగిపోయినట్లయితే ప్రవాహం దాటిపోగలమని తెలుసుకున్నాము; ఎందుచేతనంటే దాని గర్జన సన్నగిల్లటం ప్రారంభించింది.

వెనక్కి తిరిగాము. హాన్స్ ప్రవాహం ఎక్కడ బాగా దగ్గరగా ఉన్నదో అంచనావేసి అక్కడ ఆగాడు.

నేను గోడకు ఆనుకుని కూర్చున్నాను. బహుశః నాకు రెండు అడుగులదూరంలో నీరు ప్రవహిస్తున్నదికాని మధ్యనున్న గోడ గట్టి గ్రానైట్‌ది. హేతుబద్ధంగా ఆలోచించలేక, కర్తవ్యమేమిటో ఊహించకుండా, నిరాశతో ప్రయత్నం విరమించేందుకు సిద్ధంగా ఉన్నాను.

హాన్స్ నా వంక చూశాడు. అతని పెదవులపైన చిరునవ్వు మెదిలింది అనుకున్నాను.

దీపం పుచ్చుకుని లేచి నుంచున్నాడు. అతన్నే చూస్తూ ఉండిపోయాను. గోడవైపుకి తిరిగాడు. కళ్ళతో అనుసరించాను. ఎండిపోయిన రాతికి చెవి ఆన్చి విన్నాడు. జాగ్రత్తగా వింటూ, ముందుకీ వెనక్కీ జరిగి చూశాడు. ఎక్కడ ప్రవాహం శబ్దం అధికంగా ఉన్నదో వెతుకుతున్నాడన్నమాట. ఎడమవైపు గోడమీద నేలకు మూడు అడుగులపైన దొరికింది.

ఊపిరి బిగపట్టాను. మా వేటగాడు ఏమి చెయ్యదలచాడో నిర్ణయించలేకపోయాను. గడ్డపార పట్టుకొనడంతో అంతా అర్థం చేసుకున్నాను. ఎగిరి లేచి నుంచుని వీపు తట్టాను.

"బతికిపోయాం!" అని అరిచాను.

"అవును" అని కేకవేశాడు మా పెదనాన్న. "హాన్స్ ఊహ సరైనదే! బలేవాడు! మనకి తట్టేదే కాదు!"

ఆయనతో పూర్తిగా ఏకీభవించాను. సులభంగా ఉన్నప్పటికీ ఇటువంటి 'పరిష్కారం' మాకు తోచేదికాదు.

భూగర్భంలోని ఈ గోడకి చిల్లు పొడవటం కన్నా ప్రమాదకరమయినది వేరేలేదు. కూలిపోయి మేము నలిగిపోవచ్చు! లేక నీరు వరదలుగా పారి ముంచిపారవెయ్యవచ్చు! ఈ విపత్తు కేవలం ఊహాజనితమయినది మాత్రం కాదు. కాని ఆ సమయంలో ఏ భయమూ మమ్మల్ని ఆపగలిగేదికాదు. మా దాహం ఎంత తీవ్రంగా ఉన్నదంటే దానిని తీర్చుకొనటానికి సముద్రంనేలనైనా కోసేవారము.

హాన్స్ పని ప్రారంభించాడు. మా పెదనాన్న కాని, నేనుకాని పని పూర్తిచేసి ఉండగలిగేవారము కాదు. రాయి పగులగొట్టాలనే ఆత్రంతో తొందరపడి అలిసిపోయిఉండేవారము. మా గైడ్, కంగారు లేకుండా, నిగ్రహంతో ఆరు అంగుళాల పరిమాణం కల చిల్లు పొడిచాడు. చిన్న ఆఘాతాలతో రాయి చెక్కివేశాడు. ప్రవాహంశబ్దం అధికమవటం విన్నాను. ప్రాణం తిరిగి ఇచ్చే నీటిఊట పెదవులకు తగిలినట్లే ఉన్నది.

విట్టకేలకు గడ్డపార గ్రానైట్‌తో రెండడుగులు తొలిచివేసింది. ఈపని గంటకుపైన సాగింది. అత్రంతో మెలికలుతిరిగిపోయాను. మా పెదనాన్న ఏదో అఘాయిత్యానికి ఒడికట్టేవాడేకాని, నేను అడ్డుపడ్డాను. ఇంకొంచెం ఉంటే నేనూ ఆపలేక పోయేవాడిని. గడ్డపార అందుకొనపోతున్నాడనగా ఒక పెద్ద 'బుస' వినిపించింది. బలమైన నీటిధార బయటకు పొడుచుకునివచ్చి అవతలవైపు గోడను తాకింది.

నీటిధార తగిలి వెనక్కి ఒరిగిపోయిన హాన్స్ బాధగా అరవకుండా ఉండలేకపోయాడు. నేనూ, ఆ నీటిలో చెయ్యిపెట్టి కేకపెట్టాను. నీరు మరుగుతున్నది.

"ఉష్ణోగ్రస్థితి నూరుడిగ్రీ లుంటుంది!" అని అరిచాను.

మేము నుంచునిఉన్న సొరంగం ఆవిరితో నిండి పోయింది. త్వరలో నీరు చప్పరించగలిగాము.

ఆహా, ఏమి సంతృప్తి! ఏమి సుఖం! ఇది ఏ రకమయిన జలం? ఎక్కడినుంచి వచ్చింది? ఫరవాలేదు. అది నీరు, మా ప్రాణాలు కాపాడుతున్నది—ఇంకా కొంచెం వేడిగా ఉన్నాసరే. ఆపకుండా, రుచి గమనించకుండా త్రాగాను.

ఒక నిముషం పూర్తిగా ఈ ఆనందంలో మునిగిపోయిన తర్వాతనే అరిచాము: "ఏమిటి ఇనుము ఉప్పులు కలిసిఉన్నాయి!"

"ఒంటికి మంచిది" అన్నాడు మా పెదనాన్న. "అవును, కావలసినన్ని ఖనిజాలు కలిసి ఉన్నాయి! 'స్పా' (Spa), 'టాప్‌లిట్జ్' (Toplitz) లకు వెళ్ళినంత ఫలం."

"అద్భుతం!"

"ఒప్పుకుంటాను! ఆలోచించి చూడు—భూగర్భంలో ఆరుమైళ్ళలో మన నీరు త్రాగటమా! కొంచెం సిరా రుచి ఉన్నప్పటికీ అసహ్యంగా మాత్రం లేదు. హాన్స్ మనకోసం ఒక మంచి ఊట కనిపెట్టాడు! అందుకని ఆతనిపేరు పెట్టదలచాను."

"చాలా బాగుంది!" అని అరిచాను.

'హాన్‌బాక్' అని నామకరణం వెంటనే జరిపాము.

ఈ గౌరవానికి హాన్స్ మురిసిపోలేదు. కొద్దిగా నీరు త్రాగి ఒక మూలకి వెళ్ళి మామూలు ప్రశాంతతతో ఆనుకుని కూచున్నాడు.

"ఈ జలం ఊరికే ఇలా పారి దండుగ అవకూడదు" అన్నాను.

"దానిని గురించి కంగారుపడకు" అన్నాడు మా పెదనాన్న. "ఇది అఖండప్రవాహ మనుకుంటాను."

"అయినా మన పాత్రలనిండా పోసి ఈ చిల్లు మూసివేద్దాం."

నా సలహా పాటించారు. రాతిచిప్పలు, త్రాటిపీచుతో హాన్స్ ద్వారం మూయటానికి ప్రయత్నించాడు. అది అంత తేలికైనపని కాదు. ఏమీ సాధించలేకపోగా చేతులు కాల్చుకుంటున్నాడు; నీటిధార మరీ శక్తివంతంగా బయటికి వస్తున్నది. మా ప్రయత్నాలు విఫలమయినాయి.

"దీని శక్తినిబట్టి ప్రవాహం మన తలలపైన మంచి ఎత్తువరకూ ఉన్నదనుకుంటాను" అన్నాను.

"నిస్సందేహంగా" అన్నాడు మా పెదనాన్న.

"నా కొక ఊహ వచ్చింది."

"ఏమిటది?"

"మనం ఈద్వారాన్నెందుకు బిరడావేసెయ్యాలి?"

"ఎందుకా? ఎందుకంటే.........."

సరియైన కారణం చెప్పలేకపోయాను.

"మన పాత్రలు, సీసాలు ఖాళీ అయితే తిరిగి నింపుకోగలమని ఖండితంగా చెప్పగలవా?"

"చెప్పలేమని తెలుస్తూనే ఉన్నది."

"అయితే ఈ నీరు పారనీ! నీరు పల్లానికే పారుతుందిగనుక మనకు మార్గదర్శిగానూ ఉంటుంది, దాహానికీ పనికివస్తుంది."

"మంచి సూచన!" అని అరిచాను. "ఈ ప్రవాహం మనతోబాటు ఉన్నట్లయితే ఈయాత్ర విజయవంతమయితీరాలి!"

"దారిలోకి వస్తున్నావా, అబ్బాయ్!" అన్నాడు మా పెదనాన్న నవ్వుతూ.

"అంతేకాదు—హృదయపూర్వకంగా యాత్ర కొనసాగించాలంటున్నాను!"

"ఒక్క క్షణం ఆగు! కొన్ని గంటల విశ్రాంతి అవసరం."

మధ్యరాత్రి అనే సంగతి మరచిపోయాను. గడియారం చూస్తే గుర్తుకి వచ్చింది. చివరకు పోయిన శక్తి కొంత కోలుకుని మంచి నిద్రలో మునిగిపోయాము. (సశేషం)

---

# ఏడుకొండలు

25-వ పేజీ తరువాయి

డంతో, మళ్ళీ తేరుకునేటప్పటికి కొంత దైవభీతి ఏర్పడింది. అతని మనస్సు ఎక్కువగా దైవ వ్యాసంగం వైపు వెళ్ళాండ నారంభించింది. ఎక్కడైనా మహాత్ములున్నారంటే వారిని దర్శించటం, వాళ్ల సేవ చెయ్యటం భార్యాభర్త లిద్దరికీ అలవాటయింది. ముఖ్యంగా జగదాంబకు చాలా దైవభక్తి వుంది. ఆమె ప్రోద్బలంవల్లనే ధర్మసూరికిభగవద్భక్తి అబ్బింది.

జగదాంబ చాలా ఓర్పుగల మనిషి. భర్తయొక్క వ్యసనాల గురించి ఆమెకు తెలిసినప్పటికీ, భర్త నేమీ అనేదికాదు. ఆమె కళ్ళ యెదుటే ధర్మసూరి ఇతర స్త్రీలతో తిరిగినా, పల్లెత్తు మాట అనేది కాదు. ఎవరైనా ఆమెతో, "ఏమమ్మా! నీ భర్త ఆవిధంగా పరస్త్రీలతో తిరుగుతూంటే, నువ్వెలా సహిస్తున్నావు?" అని అంటే, ఆమె చిన్న చిరునవ్వు నవ్వి, "మనం సహించక చేసేదేముంది? కొన్నాళ్ళకు ఆయనకే తెలుస్తుంది" అనేది. ధర్మసూరికి జబ్బు చేసినప్పుడు ఆమె అహోరాత్రాలూ అన్నాహారాలు మాని సేవ చేసింది. ఆ సేవ ధర్మసూరి మనసులో బాగా నాటుకుపోయింది.

తరువాత ధర్మసూరి నెదుర్కున్న ఆపద తండ్రి మరణం. విశ్వేశ్వరరావుగారు హఠాత్తుగా గుండె జబ్బువల్ల మరణించారు. ఆయన అంత్యక్రియలు ధర్మసూరి చాలా ఘనంగా చేశాడు. సుమారు పాతిక ముప్పయివేల రూపాయలు ఖర్చుపెట్టి అంత్యక్రియలు జరిపించాడు. ఆయన అస్థికలు గంగలో కలిపాడు. విశ్వేశ్వరరావుగారు పోయిన సంవత్సరమే ధర్మసూరి తమ ఆఖరి ఎస్టేటు లక్ష రూపాయల కమ్మి కొన్ని అప్పులు తీర్చాడు.

ఆ తరువాత వరసగా అయిదారు సంవత్సరాలు పంటలు సరిగా పండకపోవడం, రైతులు పంట ఇవ్వకపోవడం, కోర్టుల్లో దావాలు వెయ్యడం ఈ చికాకుల్లో మళ్ళీ అప్పు పెరగనారంభించింది. ఈ చికాకుల్లో ధర్మసూరిగారికి లలిత తరువాత యిద్దరబ్బాయిలూ, ఒక అమ్మాయీ పుట్టడం జరిగింది.

ఈ సమయంలోనే ధర్మసూరిగారి ఆధ్యాత్మిక చింత కూడా పెరగనారంభించింది. ధర్మసూరిగారికి జ్యోతిషం, కవిత్వం, సంగీతం మొదలైన విద్యలలో కొంత ప్రవేశముంది. ఆధ్యాత్మిక గ్రంథాలనేకం ఆయన చదివారు. రామకృష్ణ పరమహంస వివేకానందస్వామీ మొదలైనవారి జీవిత చరిత్రలూ, భారత, భాగవతాది పురాణ గ్రంథాలూ ఆయన చదువుతూండేవారు. భగవత్తత్వాన్ని యోగ సాధన చేసి తెలుసుకోవాలని ఆయనకు కుతూహలంగా ఉండేది.

కలివరానికి కొద్దిదూరంలో శాస్త్రులపేట అని ఒక కుగ్రామం వుంది. ఆ ఊరిలో రామకృష్ణయ్యగారని ఒక శ్రోత్రియ కుటుంబీకుడు వుండేవాడు. ఆయన గొప్ప వేదాంతి. అంతేకాక, వారికి కొంత ఆస్తి కూడా వుంది. కొద్దిగా స్థితిమంతులనే చెప్పుకోవచ్చు. వారికి కులక్రమాగతమైన విద్య, రాజయోగము. ఆయనకు ఇద్దరు కొమాళ్ళున్నారు. వారి తాత ముత్తాతలనుంచీ సాంప్రదాయంగా ఆముష్మిక విద్య వారి కుటుంబంలో అభ్యసించబడుతూనే వుంది. రామకృష్ణయ్యగారు తమ కొమాళ్ళకు మాత్రం ఈ విద్య నభ్యసించే అర్హత లేదని వారికి సాధన నేర్పలేదు.

ఒకనాడు రామకృష్ణయ్యగారు మరి యిద్దరు అనుచరులతో గలిసి అక్కడకు దగ్గరలోవున్న పట్టణానికి వెళ్ళి వస్తూ, కలివరం వచ్చేటప్పటికి చీకటి పడిపోయింది. వారికి బాగా దాహమగుటవలన ధర్మసూరిగారి యిల్లు ఆ గ్రామంలో పెద్ద భవంతిలా కన్పించడంవల్ల వారి యింటికివెళ్ళి దాహమిమ్మని అడిగారు. ధర్మసూరిగారు రామకృష్ణయ్యగారి నెరుగరు. అయినా ఆయనను చూడగానే తనకే తెలియని ఆకర్షణకులోనై, ఆయన నెంతో గౌరవించి దాహమివ్వటమేకాక, ఆ రాత్రి తమ యింట్లో వారికీ, వారిఅనుచరులకూ మంచి విందు భోజన మేర్పాటు చేసి, వారిని ఆ రాత్రి అక్కడ వుండమని కోరారు. రామకృష్ణయ్యగారు అంగీకరించారు.

ఆ రాత్రి వారిద్దరిమధ్య భారత భాగవతాది పురాణ విషయాల గురించి చర్చ జరిగింది. రామకృష్ణయ్యగారు, భగవదవతార తత్వాన్ని గురించి, అద్వైత వేదాంతాన్ని గురించీ, ధర్మసూరిగారి సందేహాలెన్నిటినో నివృత్తి చేశారు. ధర్మసూరిగారు తాము యోగసాధన చెయ్యాలనే తలంపుతో నున్నామనీ, తగిన గురువుకోసం చూస్తున్నామనీ చెప్పారు. రామకృష్ణయ్యగారది విని చిరునవ్వు నవ్వి వూరుకొన్నారు. మర్నాడు ఆయన తన గ్రామం వెళ్ళిపోతూ, ధర్మసూరిగారిని తరుచూ తమవద్దకు

# ఏడు కొండలు

వస్తూ యుండమని చెప్పారు. అప్పటినుంచి ధర్మసూరిగారు తరుచు ఆయనవద్దకు వెళ్తూ, తన సందేహాలు వారి ద్వారా నివృత్తి చేసుకోవడమే కాకుండా క్రొత్త విషయాలెన్నో నేర్చుకుంటూండేవారు.

క్రమంగా రామకృష్ణయ్యగారి గొప్పతనాన్ని గ్రహించి, వారిని తమ గురువుగా స్వీకరించారు ధర్మసూరిగారు.

అప్పటికి ధర్మసూరిగారి స్థితి బాగానే వున్నా, కోర్టులో భూముల గురించిన పెద్ద కేసొకటి నడుస్తూ వుండేది.

కొంతకాలం తర్వాత భూముల తాలూకు కేసులో ధర్మసూరిగారు ఓడిపోయారనీ, భూములు చాలావరకు రైతులకే స్వాధీనం చెయ్యాలని తెలిసింది. అక్కడినుంచి ఒకదాని వెనుక ఒకటిగా ఆయన్ను కష్టాలువచ్చి చుట్టుముట్టాయి. అప్పులు ఆకాశాన్నంటి ఉన్నాయి. అవి తీర్చడానికి ఆస్తంతా సరిపోలేదు. భార్యా, పిల్లల మెళ్లో చిన్న మెత్తు బంగారం లేకుండా అమ్మేశారు. పాత్ర సామాను కూడా అమ్మేశారు. ఇల్లు ఖాళీ చెయ్యవలసి వచ్చింది. బంధువులెవ్వరూ పలకరించలేదు. రెండేళ్ళల్లో కళవరం వదిలిపెట్టి, కుటుంబంతోసహా ఉదరపోషణార్థం ఏదైనా ఉద్యోగం చెయ్యాలని బయల్దేరారు ధర్మసూరిగారు. అప్పటికి లలితకు ఆరేళ్ళు. తక్కిన పిల్లలు చిన్నవాళ్ళు.

'కరి మ్రింగిన వెలగపండు' లోని గుజ్జులాగా ధర్మసూరిగారి సంపదంతా హరించిపోయి అన్నవస్త్రాలకు కూడా కరువైంది వారికి. రెండు మూడేండ్లు అక్కడక్కడ గ్రామాలలో పాఠాలు చెప్పుకుంటూ, పూరి గుడిసెలలో నివసిస్తూ అనేక రోజులు పస్తులతో కాలక్షేపం చేస్తూ గడిపారు. దరిద్రమనేది మానవుడిని అనేక రకాలుగా పరీక్షిస్తుంది. అనేక కొత్త విషయాల్ని నేర్పుతుంది. ధర్మసూరిగారు మంచిస్థితిలో వున్నప్పుడు వారిని గౌరవంగా చూసే బంధువు లెవ్వరూ, వీరి బీదస్థితి గమనించి వారిని పలకరించడమే మానేశారు. ముఖ్యంగా వారి చెల్లెలు సత్యవతీ, ఆమె భర్త కేశవరావుగారూ, ధర్మసూరిగారివలన ఎంతో లాభం పొందినవారు అయినప్పటికీ, స్థితి మారగానే, వీరిని ద్వేషించ నారంభించారు.

కేశవరావు విశాఖపట్టణంలో డాక్టరుగా ప్రాక్టీసు చేసి చాలా డబ్బు గడిస్తున్నాడు. వారికి 'శంకర్' అని ఒక అబ్బాయి పుట్టాడు. ధర్మసూరిగారు ఉచ్చస్థితిలో నున్నప్పుడు శంకర్‌కు లలితను వివాహం చేసుకుంటామని సత్యవతి అనేది. శంకర్ లలితకన్నా నాలుగేళ్లు పెద్ద. అతను తల్లితో కలిసి మేనమామ ఇంటికి వెళ్ళినప్పుడల్లా లలితా, అతనూ కలిసి ఆటలూ, పాటలూ ఆడుకుంటూ, పాడుకుంటూ చాలా సరదాగా వుండేవారు. చిన్నతనంలోనే వారి మనస్సులో ఒకరంటే ఒకరికి ఎంతో అభిమానం ఏర్పడింది.

ధర్మసూరిగారి స్థితి మారినకొద్దీ సత్యవతి అభిప్రాయం మారసాగింది. అన్న బీదరికంలో పడినప్పుడు, ఆమె ఏమాత్రం సానుభూతి చూపించ

లేదు. అన్నయ్యా వదినె ఇద్దరు చేజేతులారా తెచ్చుకున్నదేనని, తండ్రి యిచ్చిన ఆస్తంతా వ్యసనాల క్రింద తగలేశాడని, ధర్మసూరిగారిమీద కోపం తెచ్చుకుంది. రెండవ చెల్లెలైన ప్రభావతి చాలా మంచి మనసు కలిగిన ఆమె. మద్రాసులో ఆమె భర్త పెద్ద కంపెనీ మానేజరుగా పని చేస్తున్నాడు. ఆమె పెళ్ళయిన దగ్గర్నుంచీ రెండుసార్లు మాత్రమే పుట్టింటికి వచ్చింది. భర్త ఆమెను చాలా అభిమానంగా చూసుకొంటాడు. ధర్మసూరిగారి ఇబ్బందులు కొంతవరకు తెలిసి, వారిని తమవద్దకి రమ్మని ప్రభావతీ, ఆమెభర్తా ఆహ్వానించారు. వాళ్లకు పిల్లలులేరు.

తన పరిస్థితు లెలాటివైనా, బంధువులనుగాని స్నేహితులనుగాని సాయమడుగకుండా గడుపుకో నిశ్చయించారు ధర్మసూరిగారు. మరీ భరింపరాని పరిస్థితి కలిగినప్పుడు, భగవంతుని ఏదైనా సహాయం చెయ్యమని ప్రార్థించేవారు. అప్పుడు తప్పకుండా ఏదో ఒక ఆధారం కన్పించేది.

రామవరం వచ్చేముందు ఆ ప్రక్కనేవున్న మరొక చిన్న ఊరిలో వుండేవారు. అక్కడ జీవనం గడపటం కష్టమైంది. ఆఖరికి భార్యా భర్తలిద్దరూ, వున్న కొద్ది బియ్యమూ వండి పిల్లలకు పెట్టి, మూడు రోజులు మంచినీళ్లు త్రాగి గడిపారు. నాల్గవ నాడు పిల్లల్ని కూడా పస్తు పడుకోపెట్టవలసి వచ్చేట్లు కన్పించింది. భార్య కూడా ధైర్యాన్ని కోల్పోయి సంతత ధారాపాతంగా కన్నీరు కార్చసాగింది.

ఒకరోజు ధర్మసూరిగారి పాత స్నేహితుడొకడు ఈయనను వెదుక్కుంటూ వచ్చాడు. అంతేకాక ఏనాడో ధర్మసూరివద్ద తను వంద రూపాయలు అప్పు తీసుకొన్నది జ్ఞాపకంచేసి, ఆ సొమ్ము తీసుకోమని బలవంతంచేసి యిచ్చాడు. ఆనాడు యింటిల్లిపాదీ కడుపునిండా భోజనం చేశారు. స్నేహితుణ్ణి కూడా తనతోపాటు భోజనం చెయ్యమన్నారు ధర్మసూరిగారు. భోజనం చేస్తూ తను ఇతరుల ద్వారా విన్నదానినిబట్టీ తను చూస్తున్న దానివలనా, ధర్మసూరిగారి స్థితంతా తెలుసుకొని, ఆ స్నేహితుడు రామవరంలో సత్యన్నారాయణగారనే మిల్లు ప్రొప్రయిటరున్నారనీ, ఆయనతోచెప్పి ఆయన వద్ద గుమాస్తాగా వేయిస్తాననీ, ఆయనకూ, తనకూ బాగా పరిచయముందని చెప్పి ధర్మసూరి గారిని ఆనాడే రామవరం తీసుకెళ్లాడు.

సత్యన్నారాయణగారు జాలిహృదయం కలవారు. ధర్మసూరిగారి చరిత్రంతా విని వెంటనే తమవద్ద ఏభయి రూపాయల జీతంమీద గుమస్తాగా వేసుకొని వుండటానికి ఇల్లు కూడా యిచ్చారు ఆ సమయంలో ఆ యాభై రూపాయల ఉద్యోగం ధర్మసూరిగారి కుటుంబానికి కల్పవృక్షంలా కన్పించింది.

ఆనాటినుంచి ఆ యాభై రూపాయల జీతం మీదే, జాగ్రత్తగా కాలక్షేపం చేస్తూ, గడపసాగారు. కాలం క్రమంగా దొర్లిపోయింది. ఆ జీతం వారి తిండికే చాలడం కష్టమయ్యేది. నలుగురు పిల్లలూ ఇద్దరు పెద్దలూ అతి సామాన్య జీవితం గడుపుతూ ఈ ఎనిమిది సంవత్సరాలూ నెట్టుకొచ్చారు. జీతం సరిపోకపోవడం మూలాన దుకాణంమీదా, సత్యన్నారాయణగారివద్దా అప్పు చేయవలసి వస్తూ వచ్చినా, మొత్తంమీద చాలా తక్కువ వస్తులతో కుటుంబాన్ని పోషించుకొస్తున్నారు ధర్మసూరిగారు.

ప్రతివారం ఆంధ్రదేశమంతటా లక్షలమంది ఆంధ్ర సచిత్ర వారపత్రికను చదివి ఆనందిస్తూ ఉంటారు. మీ స్థానిక ఏజెంటు ద్వారా చందాదారులయితే మీ కాపీ మీకు వారం వారం నిశ్చయంగా చేరగలదు.

లలిత వివాహ సమస్య వీలైనంత త్వరలో పరిష్కారం చెయ్యాలని తలితండ్రులకు ఆసక్తిగా వుంది. ఎలాగా తన చెల్లెలు సత్యవతి, కొడుకు శంకరానికి లలితను చేసుకుంటానన్నది గాబట్టి లలిత వివాహం శంకరంతో జరిపించాలని ధర్మసూరిగారు ఆత్రుతగా వున్నారు. కాని ఈమధ్య సత్యవతి వీరింటికి వచ్చి చాలా కాలమైంది. ఆమె యొక్క మనోభావాలు వీరికి తెలియవు. జగదాంబకు సత్యవతితత్వం తెలుసు. అందువల్ల ఆమెకు, ధర్మసూరిగారిలా, సత్యవతి లలితను కోడల్ని చేసుకుంటుందనే నమ్మకంలేదు. భర్తతో లలిత వివాహం విషయం ఏదో నిశ్చయం చెయ్యమని పోరుతూండేది.

శ్యామ్‌బాబు, ధర్మసూరిగారి పొరుగున మకాం పెట్టిన కొద్ది రోజులలో క్రమంగా పై విషయాలన్నీ తెలిశాయి. పదిహేను రోజులవరకూ సత్యనారాయణగారు హైదరాబాదునుంచి తిరిగి రాకపోవటంవల్ల, ధర్మసూరిగారికి మిల్లుపని ఎక్కువుండేదికాదు. ఇద్దరూ సాయంకాలంపూట ఆ పల్లెటూరు విడిచి చాలాదూరం షికారు వెళ్ళి అనేక విషయాలు మాట్లాడుకుంటూండేవారు. ఆ యా మాటల్లో, సరళమైన మనస్సుగల ధర్మసూరిగారు తన పాత జీవితాన్నంతా శ్యామ్‌బాబుతో చెప్పేశారు. శ్యామ్‌బాబు చాలా శ్రద్ధతో, సానుభూతితో వినేవాడు. ముఖ్యంగా ఇన్ని కష్టాలలోనూ ధర్మసూరిగారికి భగవంతునిమీద భక్తి నిలచివుండడం, బాహ్యంలో ఎంత కఠినమైన పరిస్థితుల నెదుర్కొంటున్నా ఆంతర్యంలో ఆయన ధైర్యంగా, ఆనందంగా వుండగలగడం శ్యామ్‌బాబుకు ఆయన మీద ఎంతో గౌరవాన్ని కలుగజేసింది.

వారిద్దరూ పొలాల ప్రక్కన నడుస్తూ, అస్తమించే సూర్యుణ్ణి, చుట్టూవున్న కొండల్నీ, దూరంగా కన్పించే రామవరం రైల్వేస్టేషన్నీ చూస్తూ, ప్రకృతిలోని సౌందర్యాన్ననుభవిస్తూ ఆధ్యాత్మిక విషయాన్ని, ధర్మసూరిగారికి జీవితంలో ఎదురైన కష్టాల్లో భగవంతుడు ఏ విధంగా తోడ్పడిందీ, చర్చిస్తూ కాలాన్ని గడిపేవారు. ఆ పదిహేను రోజుల్లోనూ ధర్మసూరిగారికీ, శ్యామ్‌బాబుకూ ఎంతో సఖ్యత ఏర్పడింది. ముఖ్యంగా శ్యామ్‌బాబుకు లలితంటే ఎంతో అభిమానం. ప్రొద్దున్న లేచిన దగ్గర్నుంచీ లలితకన్పిస్తూంటేనే శ్యామ్‌బాబుకు తృప్తిగావుండేది.

లలితంటే శ్యామ్‌బాబు చూపిస్తున్న ప్రత్యేకాభిమానం గమనించి, ధర్మసూరి దంపతులు శ్యామ్‌బాబుకు ఏం కావలసివచ్చినా ఇవ్వడానికి లలితను నియోగిస్తూండేవారు, అతని సంతృప్తికి తాము అడ్డు నిలవరాదని. లలిత శ్యామ్‌బాబును 'బాబాయిగారు' అని పిల్చేది. ధర్మసూరిగారికి ఒక ఆవుండేది. అది సమృద్ధిగా పాలిస్తుంది. ఆ పాలే కొన్ని వాళ్ళు శ్యామ్‌బాబు కిచ్చేవారు. ఆ పాలివ్వడం, శ్యామ్‌బాబు వంట చేసుకుంటూంటే సాయం చెయ్యడం, అప్పుడప్పుడు అతన్ని ఇల్లు శుభ్రం చెయ్యడం, ఇలాటి పనులు లలిత చేస్తూవుండేది. లలితకు శ్యామ్‌బాబు రోజూ రాత్రి ఒక గంట చదువు చెప్తూండేవాడు. ధర్మసూరిగారు కూడా ప్రక్కనే వుండేవారు. లలిత చదువు అయిపోగానే శ్యామ్‌బాబూ ధర్మసూరిగారూ కాస్సేపు లోకాభిరామాయణం మాట్లాడుకునేవారు.

ఎన్ని మాటలు మాట్లాడినా శ్యామ్‌బాబు తన విషయమేమీ చెప్పేవాడుకాదు. మొదట ఏయే విషయాలు చెప్పాడో, అంతకుమించి ఒక్క అక్షరం కూడా అతని గురించి ఎవరూ తెలుసుకోలేకపోయారు. ముఖ్యంగా నళినీ, విశ్వం ఎన్నో ప్రశ్నలు వేసి అతని గురించి తెలుసుకుందామని ప్రయత్నించారు. కాని అతను వివాహితుడనీ, మద్రాసులో వుండేవాడనీ, పిల్లలు లేరనీ, ఉద్యోగంకోసం ప్రయత్నిస్తూ, ఢిల్లీ వెళ్తూ, దారిలో సామాన్లన్నీ పోగొట్టుకొని రామవరంలో దిగాడని—అతను మొదట చెప్పిన విషయాలకన్నా, అదనపు సమాచారమేమీ సేకరింపలేకపోయారు వారిద్దరు. ధర్మసూరిగారూ, వారి కుటుంబం శ్యామ్‌బాబు తన స్వవిషయాలు మాట్లాడడాని కిష్టపడడని తెలుసుకొని, ఆ ప్రసక్తే అతనితో ఎత్తేవారుకారు. కాని, అతను పెద్ద కుటుంబానికి చెందినవాడే అయివుండాలనీ, ఏవో కష్టాలలో చిక్కుకొని ఈ విధంగా జీవితం గడప నిశ్చయించివుంటాడనీ అనుకునేవారు, అతని ప్రవర్తననూ, సంస్కారాన్నీచూసి.

సాయంకాలం నాలుగు గంటలప్పుడు, పాంటూ షర్టు టకప్ చేసుకొని, భుజాన్నుంచి వేళ్లాడే సంచీతో చేతిలో చిన్న తోలుపెట్టె పట్టుకొని, సుమారు ఇరవైయ్యేళ్ళ వయస్సుగల యువకుడొకడు ధర్మసూరిగారింటికి వచ్చాడు. వాకిట్లోవున్న లలిత, అతన్ని చూసి, ఎరుగున్న మొఖంలావుంది ఎవరా? అని సందేహిస్తూ నిలబడింది.

లలితను చూస్తూ, ఆ యువకుడు, "ఏం లలితా! నన్ను మర్చిపోయావా? అలా చూస్తున్నావు" అన్నాడు. అప్పుడు లలితకు జ్ఞాపకమొచ్చింది. అరె! అతను ఎవరోకాదు. శంకర్‌బావ! క్రితంసారి చూసినప్పటికన్నా బాగా ఎదిగిపోయాడు; అందుకని తను గుర్తుపట్టలేకపోయింది. లలిత గబుక్కున లోపలికి పరిగెత్తింది.

"అమ్మా బావొచ్చాడే!" అని తల్లితో చెప్పింది. ఇంట్లో పిల్లలూ, తల్లీ అంతా వాకిట్లోకి వచ్చారు. జగదాంబ శంకర్‌ని చూసి "రా! నాయనా! లోపలికి రా!" అని ఆహ్వానించింది.

శంకర్ లోపలికి వచ్చి, తన పెట్టె అక్కడపెట్టి, సంచీ దానిమీదపెట్టి కుర్చీలో కూచున్నాడు. "మామయ్య లేరా అత్తా?" అని అడిగాడు.

"మిల్లుకు వెళ్లారు నాయనా. అమ్మా, నాన్నా అంతా కులాసాయేనా?"

"ఆ!"

"నువ్వు చాలా పెద్దవాడివయ్యావు. ఏం చదువుతున్నావ్"

"బి. యస్ సి. ప్యాసయ్యాను" అని చెప్తున్నాడు, శంకర్. కానీ, అతని మనస్సూ, కళ్ళూ అన్నీ— ఆ అందమైన అమ్మాయి……లలిత……… ఆమెకోసం వెదుకుతున్నాయి. జగదాంబ భుజాల వెనుకనుంచి రెండు……పెద్దకళ్ళు……తనవైపు చూస్తున్నాయి. ఓ! అదా సంగతి! తల్లి వెనకాల నుల్చొని తనని చూస్తోందా! …. "ఎమ్. యస్‌సీలో జేరాలనుకుంటున్నాను" అని జగదాంబవైపు తిరిగి చెప్పాడు.

"సంతోషం నాయనా. కాస్త కాఫీ కాచిస్తానుండు" అని ఆవిడ తొందరగా వంటింట్లోకి వెళ్లింది. ఆవిడ తప్పుకోగానే, ఆవిడ వెనకాలదాగున్న దొంగ బయటపడిపోయింది……లలిత! శంకర్ లలితవేపు చూశాడు. లలిత కేం చెయ్యాలో తెలియక కొంచెం ఖంగారుపడింది. తను తల్లి వెనక్కాల వంటింట్లోకి వెళ్ళిపోదామనుకొంది. కాని…… మనస్సు పనిచేసినంత త్వరగా కాళ్ళు పనిచెయ్యటం లేదు. ఉహూ! తనెందుకు, అక్కడ? లోపలికి వెళ్ళిపోవాలి. 'పదండి' అని కాళ్ళని ఆజ్ఞాపించింది. అవి…. ఇష్టం లేనట్టుగా కదలబోయాయి……

"నువ్వేమన్నా చదువుకుంటున్నావా? లలితా !" అని శంకర్ అడిగాడు లలితను. ఆమెకాళ్ళు కదలడం మానేశాయి. ఆ మాటలు ఆమె చెవికి తియ్యగా వినిపించాయి. జవాబు చెప్పడానికి కొంచెం సిగ్గువేస్తోంది. అసలు, తల్లి వెళ్ళిపోగానే లలిత తలదించేసింది. ఇప్పుడు జవాబుచెప్తూ మళ్లీ ఒకసారి తలెత్తచ్చు. లలిత కొంచెం ధైర్యం తెచ్చుకుంది. గోడ నాధారం చేసుకుని, నిల్చున్నదల్లా తలెత్తి, "లేదు బావా. ఇక్కడ స్కూలు అయిదవక్లాసు వరకే వుంది" అని ఒకసారి అతనివేపు చూసింది.

"అక్క ఇంగ్లీషు నేర్చుకుంటోంది" అన్నాడు. లలిత రెండో తమ్ముడు శీను, అంతవరకూ శంకర్‌ను చూస్తు వున్నవాడల్లాతనూ బావని పలకరిద్దామనే వుద్దేశంతో.

"అలాగా ఎవరు చెప్తున్నారు?" అని అడిగాడు శంకర్, లలితనూ, శీనునూకూడా వుద్దేశించి. శీను బావ పక్కన కూచుని లలిత చదువు వివరాలు, ఆమె శ్యామ్‌బాబుదగ్గర చదువుకుంటోందనీ, ఇంగ్లీషుపాఠం చదవగలదనీ చెప్పి, తన చదువు వివరాలు కూడా చెప్పసాగాడు. శంకర్ అప్పుడప్పుడతన్ని ప్రశ్నలువేస్తూ, మధ్యమధ్య లలితవేపు చూసి, ఏదో ప్రశ్నవేసేవాడు. లలిత, దానికి సమాధానం చెప్తూ, మళ్లీ ఒకసారి అతనివైపు చూసేది. కొద్దిగా మొదట్లో బెరుకుగా వున్నా, కొంచెంసేపయ్యేటప్పటికి లలితా శంకర్‌లమధ్య చనువు ఏర్పడింది. 'బావ పెద్దవాడైనా, ఇంకా వెనకటిలాగే మాట్లాడుతున్నాడు' అనుకుంది లలిత. శంకర్‌కూడా లలిత తనతో మామూలుగా మాట్లాడుతుందో లేదోనని తను భయపడుతూ వచ్చినందుకు లలిత చనువుగా మాట్లాడడంతో, అతనికి ఎంతో సంతోషంగా వుంది. జగదాంబ కాఫీ తయారుచేసి తెచ్చేసరికి ధర్మసూరిగారు కూడా వచ్చేశారు. ఆయనకూడా మేనల్లుణ్ణి ఆప్యాయంగా పలకరించారు. ఆ యింట్లోనివా రందరూ శంకర్‌యందు ఎంతో ప్రేమాభిమానాలు చూపించారు. శంకర్ అందుకు చాలా సంతోషించాడు.

శంకర్ మొట్టమొదట, తన మామయ్య ఇంట్లో తనని వెనుకటి వాత్సల్యంతో అందరూ చూస్తారో లేదో అని భయపడ్డాడు. అందుకు కారణం, తన తలితండ్రుల ప్రవర్తన. ధర్మసూరిగారి స్థితి మారినదగ్గర్నుంచీ, తన తలితండ్రులు, వారి కేమీ సాయం చెయ్యకపోగా, వారి కుటుంబమంటే మండిపడ నారంభించారు. ఏవో దుర్వ్యసనాలవల్ల ఆస్తినంతా ధర్మసూరిగారు పోగొట్టుకున్నారనీ, ఆయననే మాత్రం సానుభూతితో చూడరాదని, సత్యవతీ, కేశవరావుగార్ల వుద్దేశం. వారు ధర్మసూరిగారింటికి రావడం మానేసి చాలాకాలమైంది. శంకర్‌కి మాత్రం మామయ్యలంటే చాలా ఆపేక్ష. అతని మనస్సులో చిన్నప్పటినుంచీ లలిత తన భార్య అనే తలం పేర్పడింది. తన తలిదండ్రులు, ధర్మసూరిగారంటే విముఖత చూపనారంభించినది

మొదలు తనకూ, లలితకూ వివాహమవడం కష్టమేమోనన్నభయం అతనికి కలుగసాగింది. కాలేజీలో చదువుతున్నప్పుడు కూడా, లలిత ఎలావుందో చూడాలని, అతని మనస్సులో కోరిక ఉదయిస్తూండేది. కాని తను మామయ్య యింటికి వెళ్ళడానికి తలితండ్రులు యిష్టపడరని తెలిసి, తన మనసులోని కోరిక బయటపెట్టలేకపోయాడు. అంతేకాక, తను బి. యస్. సీ. చదువుతుండగా కొన్ని పెళ్ళి సంబంధాలు పెద్ద పెద్ద కట్నాలిస్తామని వస్తూంటే తల్లి, ఆపిల్లల్ని ఒకసారి వెళ్ళి చూడమని తనతో అనటం, అందులో నచ్చిన పిల్లను చేసుకోవచ్చునని చెప్పటంతో శంకర్ యొక్క అనుమానం ధృఢమైంది. చిన్నప్పుడు తనతల్లి లలితను శంకర్‌కు చేసుకుంటామని అనేకసార్లు మామయ్యతోనూ, అత్తతోనూ అనటం తనకు గుర్తుంది. అప్పుడు మామయ్య లక్షాధికారి. ఇప్పుడు బీదవాడవడం వల్ల తన తలితండ్రులదృష్టిలో హీనుడయ్యాడు. శంకర్‌కుమాత్రం మామయ్యన్నా, వాళ్ళ కుటుంబమన్నా ఏమాత్రం అపేక్ష తగ్గలేదు. అందుకే తలితండ్రులకుచెప్పకుండా మామయ్యయింటికిబయల్దేరాడు.తల్లితో తానొకస్నేహితుని ఇంటికి వెళ్తున్నాననీ, రెండురోజులలోతిరిగివస్తాననీచెప్పాడు. అప్పటికి బి. యస్. సి. ఫలితాలు తెలిసివారం రోజులైంది.

మామయ్య ఇంటికి వెళ్ళాలని బయల్దేరాడే కాని, తన తలితండ్రుల ప్రవర్తన మనసులో వుంచుకొని వాళ్ళంతా తనను అప్యాయంగా చూడరేమోనని శంకర్ భయపడ్డాడు. ముఖ్యంగా లలిత తనగురించి ఏమనుకుంటోందో? బహుశా వారంతా, తనుగూడా తన తలితండ్రులలాగే వారిని ద్వేషిస్తున్నా ననుకొంటున్నారేమో? 'అతండ్రి కొడుకేగదా, వాడూ అంతే'నని అనుకుంటున్నారేమో?అని పరిపరివిధాలుగా శంకర్ అనుమానించాడు.

తను వచ్చిన కొద్దిసేపటిలోనే శంకర్, ధర్మసూరిగారియింట్లో ప్రతి ఒక్కరూ తనని పూర్వంకన్నా ఎక్కువ ప్రేమాభిమానాలతో చూడటంతో, తన అనుమానం, భయం, ఆధారం లేనివనీ, అనవసరమైనవనీ గ్రహించాడు. ధర్మసూరిగారు మేనల్లుడు బాగా చదువుకొంటున్నాడని సంతోషించారు.

సాయంకాలం శ్యామ్‌బాబుతో శంకర్‌కు పరిచయమైంది. ధర్మసూరిగారు అతనే తమ లలితను పెండ్లిచేసుకోబోయే మేనల్లుడని చెప్పారు. శ్యామ్‌బాబు శంకర్‌యందు ఎంతో అభిమానం చూపించారు. రాత్రి లలితకు శ్యామ్‌బాబు చదువు చెప్పటంకూడా శంకర్‌చూశాడు. 'లలిత అందమైనదేకాక తెలివిగలదికూడాను!' అనుకున్నాడు.

రాత్రి ధర్మసూరిగారూ, శంకర్, శ్యామ్‌బాబూ కూడా, అది వేసంకాలం అవడంవల్ల ఆరుబయటనే పడుకున్నారు. శంకర్ తన కాలేజీ విషయాలూ, విశాఖపట్నం కబుర్లూ, తలితండ్రుల మాటలూ అన్నీ చెప్తున్నాడు. అరుగుమీద తల్లిప్రక్కన కూచొని లలిత అన్నీ వింటోంది. సాయంకాలం బావ వచ్చినదగ్గరనుంచీ ఆమె మనస్సు ఏవో లోకాలలోకి తేలిపోతోంది.

బావను ఆమె పరీక్షగా అనేకసార్లు చూసింది. ఎప్పుడూ నవ్వుతూ మాట్లాడుతాడు. ఒకొక్కప్పుడు తనవేపు అమాయకంగా చూస్తాడు. ఆ చూపు తనని హృదయంలో చక్కలిగింత పెట్టినట్లవుతుంది. అతని ముక్కు పెద్దది. అతనివేపు చూసినప్పుడల్లా ఆ ముక్కు స్ఫుటంగా కన్పిస్తుంది. దానివేపు చూస్తూంటే తనకి నవ్వొస్తుంది. బావ చెప్పిన కబుర్లన్నీ తను వింటోంది. ఇంతలో నాన్నగారు, "పడుకోరా, శంకర్. చాలా టైమయింది" అన్నారు. బావెంతో వుత్సాహంగా చెప్తూంటే, మధ్యన ఈయన ఇలా అంటారేమిటి! 'సరే'నని బావ పడుకుంటానన్నాడు. తనూ, అమ్మావాళ్ళూ ఇంట్లోకొచ్చేసి పడుకున్నారు. బావగురించి ఆలోచిస్తూనే లలిత నిద్రపోయింది.

శంకర్‌కు మనసంతా లలితతో నిండిపోయింది. లలిత తనది. ఆ సుకుమారంగా మాట్లాడే అందాలరాశి తనదే! ఆమెను చూడనంతవరకూ, అందమంటే తనకేమిటో తెలియదు. మంచి పసిమీ, కను ముక్కుతీరూ వుంటే చాలు—వాళ్ళని అందరూ అందమైనవాళ్ళంటారు. కాని వాళ్ళు నవ్వితే ఏడ్చినట్లున్నవాళ్ళున్నారు. కాస్త వాళ్ళముఖంలో ఏ చలనం వచ్చినా, చూసేవాళ్ళు భయపడి పారిపోదామని పించేటట్లున్నవాళ్ళు చాలామంది వుంటారు. ఆ అందమైనవాళ్ళలో. అసలు అందమంటే అదికాదు. నవ్వితే, పద్మం విచ్చినట్లుండాలి. మాట్లాడితే గులాబీ పరిమళిస్తున్నట్లుండాలి. మొహంలో ఏక దలికవచ్చినా ఆభావం, వెన్నెల నీటిమీద ప్రతిఫలించినట్లుండాలి. అదీ అందం! లలిత అందం అలాంటిది. ఆమె మాట్లాడుతూంటే సంగీతం విన్నట్లుంటుంది. మనిషికూడా సన్నగా, నాజూకుగా, ఆరోగ్యంగావుంది. పరికిణీ, వోణీ తో ఠీవిగా ఆమె నిల్చొనే తీరూ, పరికిణీ కుచ్చెళ్ళు ముందర కదుల్తూంటే మెల్లిగా ఆమె నడచివచ్చేతీరు, ఎంత చూసినా చూడాలనే వుంటుంది.

అసలు లలితలాటి అమ్మాయిలు నూటికీ, కోటికీకూడ ఒకరుండరని శంకర్ నమ్మకం. ఏమైనా సరే! లలితనే తను వివాహంచేసుకోవాలి. తలితండ్రుల నెదిరించైనాసరే! అని శంకర్ నిశ్చయించుకొని పడుకున్నాడు.

మర్నాడు ప్రొద్దున్న లేచినదగ్గర్నుంచీ, ఆ యింటిలో వాళ్ళందరితోనూ శంకర్ సరదాగా కబుర్లుచెప్తూ, ఎన్నాళ్ళనుంచో వాళ్ళతో కలిసి మెలిసి వున్నవాడిలా ప్రవర్తించసాగాడు. అతని బావమరదులిద్దరూ రామూ, శీనూ అతనికి తమ వూరు చూపించారు. ధర్మసూరిగారు మిల్లుకు వెళ్ళిపోయాక, శంకర్ బావ మరదులతో కలిసి తోటవైపు వెళ్ళాడు. ధర్మసూరిగారింటి వెనకాల మామిడితోట వుంది.

జగదాంబ, శంకర్ వచ్చాడని ఎద్దైనా పిండివంట చెయ్యాలని సంకల్పించింది. ఆమె వంట చేస్తూంటే లలిత సాయం చేస్తోంది. ఆఖరిపిల్ల పద్మ బొమ్మలతో ఆడుకుంటోంది. లలితకు తల్లితో బావ గురించి మాట్లాడాలనివుంది. బావను తల్చుకుంటోంటేనే ఆమెకు ఏమిటో చెప్పలేని వుత్సాహం వస్తోంది. అసలు లలిత అవాళ ప్రొద్దున్నే లేచి, నీళ్ళు పోసుకుని, జడవేసుకుని ముస్తాబైంది. శంకర్ లేచేటప్పటికే ఆమె స్నానాదులన్నీ అయిపోయాయి. బావ కేమేమి కావాలో అన్నీ తనే ఇవ్వసాగింది. శంకర్‌కు ఇంట్లోనే కూచొని లలితతో మాట్లాడుతూ కాలం గడపాలని వున్నా, అది ప్రొద్దున్నపూట సాధ్యంకాదని, బావ మఱిదులతో తిరిగిరావడానికి వెళ్ళాడు.

కూర తరుగుతూ లలిత తల్లితో, "అమ్మా! బావ, మామగారికిమల్లే డాక్టర్‌చదు వెందుకు చదవలేదే?" అని తన సందేహాన్ని వెలిపుచ్చింది. జగదాంబకు వంటమీద కొంత దృష్టి వుంది. మరి కొంత ధ్యాస, ఈ శంకర్ దగ్గర పెళ్ళిప్రస్తావన తెచ్చి వాళ్ళ అభిప్రాయాలు కనుక్కోవట మెలాగా ? అని, వుంది. లలిత ప్రశ్నలు ఆమెకు ముఖ్యమైనవిగా తోచటంలేదు. "ఏమోనమ్మా. నువ్వే ఆ విషయం మీ బావ నడుగు" అంది.

"అదికాదమ్మా.డాక్టరుచదువు చాలామంచిదికదా..."

"ఆ కూరముక్కలు ఇలా తేమ్మా. అప్పుడే తొమ్మిది దాటింది. నువ్వు మజ్జిగ చెయ్యి."

లలిత, తల్లికి కూరముక్క లిచ్చేసి, పెరుగు గిన్నె తెచ్చి కవ్వంతో మజ్జిగ చెయ్యనారంభించింది. మజ్జిగచేస్తూ, "అమ్మా బావలో నాన్నగారిపోలిక లున్నాయికదే?" అని అడిగింది.

"మేనమామ పోలికలు రాక ఎక్కడికిపోతాయి. అయినా నువ్వు గంటలకొలదీ మజ్జిగచేస్తూ కూచుంటే ఎలాగే? ఇంకా పంచదార పాకం పట్టాలి. బూందీ వెయ్యాలి. తొందరగా కాని"

"చేస్తాను లేవే" అంది లలిత. అమ్మ ఎప్పుడూ ఇంతే. ఎవరైనా చుట్టాలుగనక ఇంటికివస్తే వూరికే కంగారుపడిపోతుంది' అనుకుంది లలిత. బావా, నాన్నగారూ వచ్చేటప్పటికి వంటే అవకపోతుందా, అమ్మకి అనవసరభయం కాని.

పంచదార గిన్నెలోవేసి, కొద్దిగా నీళ్ళుపోసి, పొయ్యిమీద పెట్టింది లలిత. బావ నాలుగురోజులుంటే బాగుణ్ను! అతని ధోరణి చూస్తే అవాళే వెళ్ళిపోయేటట్లున్నాడు. ఎన్నాళ్ళకి వచ్చాడు! "అమ్మా! అత్తయ్యా, మామగారూ మనయింటికి వచ్చి ఎన్నేళ్ళయిందే?" అని తల్లి నడిగింది.

"ఏడెనిమిదేళ్ళయిందమ్మా. వాళ్ళు మనింటికి ఎందుకొస్తారు ? మనగతి ఇలా అయిందయ్యే! మనం బాగున్నరోజులలో వచ్చి నెలలతరబడి వుండే వాళ్ళు. మనకు చికాకులు ప్రారంభమయ్యాక, మనం వున్నామో, చచ్చామోకూడా వాళ్ళ కవసరం లేకపోయింది" అంది జగదాంబ మనస్సులోంచి పైకొస్తున్న దుఃఖాన్ని ఆపుకొంటూ.

లలితకు కూడా బాధవేసింది. అయినా ఆ విషయాలు తల్చుకొని ఏం లాభం? లోకంతీరే అంత "పోనీలే అమ్మా. వాళ్ళలాటివాళ్ళయితేనేం, బావ చాలా మంచివాడు" అంది.

"మంచివాడు గనకనే ఇన్నాళ్ళకు మనల్ని చూడడానికి వచ్చాడు. అతని కా అభిమానం వుంది. అసలు నువ్వు పుట్టిందగ్గర్నుంచీ నిన్ను శంకర్‌కే ఇచ్చి పెళ్ళిచెయ్యా లనుకున్నాం."

"చాల్లేవే. ఎప్పుడూ పెళ్ళి పెళ్ళంటూ కూచుంటావు నువ్వు."

"అదికాదే. పోనీ, ఎంతైనా మేనరికంగదా. అన్నమీద అభిమానంకొద్దీ యైనా మేనకోడల్ని తన కొడిక్కి చేసుకోకూడదా. మీ అత్తయ్యా?"

"పోనీ. చేసుకోకపోతే చేసుకోకపోయారు!" అంది లలిత కోపంగా. పాకంగిన్నె పొయిమీదనుంచి దింపుతూ. పైకి అలా అందిగాని, లలిత మనస్సులో బావ తనని తప్పక చేసుకుంటాడని ధైర్యం వుంది. బావ చాలా మంచివాడు. ఆ విషయం తనకు తెలుసు.

ఇంతలో శీను పరిగెత్తుకుంటూ వచ్చి, "అమ్మా అమ్మా. ఏం జరిగిందంటే..."అంటూ రొప్పుతూ, "బావేమో....మరేమో......మరేమో"అని ఎదో పెద వింత జరిగినట్లు చెప్పడం మొదలెట్టాడు. లలితా, జగదాంబా ఆతృతగా అతనివేపుచూశారు. (సశేషం)

అనుటయే ఉద్భట శాస్త్రమే—అలంకారశాస్త్రమే—శరణ్యమని నిర్ధారించుకొనిరి. రాజనాథుడు వెదకి వెదకి కొన్ని దోషముల పట్టిక సిద్ధముచేసి, అవి ఏయే శ్లోకముల కన్వయించునో వివరించెను. డిండిము డది పరీక్షించి తాను మరికొన్ని చేర్చి, దోష నామములు ప్రసిద్ధ గ్రంథములలోనున్నవిగా గాక మారుమూల గ్రంథములలోనివి పెట్టి, దోషపట్టిక సిద్ధము చేయించి మరునాడు పరిషత్తు కర్పించి సభలో చదివెను.

శ్రీనాథుడు దాని ప్రతి తీసికొని తన పండిత బృందము ముందుంచి, వారి సాహాయ్యముతో స్పష్టముగా సమాధానపత్రిక సిద్ధము చేసెను. బుద్ధి సర్వతోముఖముగ చెరచెర ప్రసరించు లక్కన నూరి ఇందులో శ్రీనాథున కెంతయు నుపకరించెను. మారుమూల గ్రంథములు తమకు అజ్ఞాతములు కావనుటకై, వానికి ప్రసిద్ధులగు నాలంకారికులు ఏనామాంతరములతో వ్యవహరించిరో ఆ పత్రికలో సూచించిరి. సమాధాన పత్రిక ప్రతులు బహుశతములుగా సిద్ధము చేయించి, శ్రీనాథుడు డవి శ్రీదేవరాయప్రభువులకును పరిషత్సభ్యులకును అరుణగిరినాథులకును మాత్రమేకాక, ప్రేక్షకులకు గూడా విప్పించెను.

నాలవనాడు వాద సభ జరిగెను. ఆనాడు డిండిమ భట్టు కేవల వాగాడంబరము పరిత్యజించి, తన తర్కకర్కశ సూక్ష్మబుద్ధినంతయు ప్రదర్శించి, శ్రీనాథుని సమాధానముల ననేక మార్గములలో ఖండించి, దోష నిరూపణమును సమర్థించెను. సభకు వచ్చిన విద్వద్వర్యులందరు డిండిమభట్టారకు లానాడు విశ్వరూపప్రదర్శనము కావించిరని వేనోళ్ల శ్లాఘించిరి.

శ్రీనాథుడు కూడ ముందు అరుణగిరినాథుల విద్వదతిశయమును బుద్ధి వైశిత్యమును శ్లాఘించి, అంతటివారితో తన క్షుద్రకావ్యమును సమర్థించుటకై వాదింపవలసివచ్చినందులకు తన చింత ప్రకటించెను. "అరుణగిరినాథులు మొదటి దోషముగా తెలిపినది—ఇది క్షుద్రకావ్యమనుటే. ఆలంకారిక పరిభాషలో మానసోల్లాసము క్షుద్రకావ్యమనుమాట నేనును అంగీకరింతును. క్షుద్రకావ్యమనగా మహాకావ్యము కాదనియేగాని, దోషములు కలదనికాదు. మహాకవి కాళిదాసు మేఘదూతమును క్షుద్రకావ్యమే. ఆలంకారికులకు అభిమానపాత్రములైన శాలివాహన సప్తశతి మొదలగు ముక్తక కావ్యము లన్నియు క్షుద్రకావ్యములే. అధమ శృంగార వర్ణనముగల యోగానంద ప్రహసనము కూడా దృశ్య కావ్యకోటిలో క్షుద్ర కావ్యముగానే పరిగణనము చేయవలె. స్తుతి కావ్యములన్నియు, మానసోల్లాసమువలెనే, క్షుద్రకావ్యములే. అదే మొదటి దోషముగా నెత్తిచూపుటలో వారి తొందరపాటు వ్యక్తమగుచున్నది. అయ్యో, వారు తొందరపాటున నోరుజారి యన్న దానిని సమర్థించుకొనుటకు ఎట్టి పాట్లుపడవలసి వచ్చినదో, ఈ మొదటి దోషమే వ్యక్తముచేయుచున్నది. వారు చూపిన తక్కిన దోషములు కూడ నిట్టివే."

ఇదే విధముగా దోషములన్న తక్కిన వానిని గూడ దోషములు కావని శ్రీనాథుడు నిరూపించెను. ఆ వాదాతడు తన వాదములో శ్రీ విశ్వేశ్వరుల చమత్కార చంద్రికలోని యుక్తు లెక్కువగా నుపయోగించు

# కవిసార్వభౌముడు

23వ పేజీ తరువాయి

కొనెను. పరిషత్తునకును, సభవారికిని ఆ గ్రంథము అజ్ఞాతపూర్వమగుటచే, ఆ యుక్తులు వారికి అభినవ రమ్యములుగాతోచి ఆశ్చర్యవిస్మితుల గావించెను. రస మన్నను, ధ్వనియన్నను, రీతియన్నను, ఔచిత్య మన్నను—ఏది కావ్యమునకు ఆత్మభూతమైనదని చెప్పుకొన్నను, రమణీయార్థమును ప్రతిపాదించుచు లోకోత్తర చమత్కారముతో సహృదయ హృదయానురంజనము కావించు శబ్దమే కావ్యమని ఒత్తిచెప్పెను. దోషైకదృక్కులకు దోషములుగా భాసించు భాగములలో నెల్లెడ, గుణ విశేషము లెత్తిచూపి, తనకు విరూపాక్షస్వామియెడగల భక్తిభావమే తనచే నట్లు పలికించినదని నిరూపించెను. "ఈ వృథావివాదములో చిక్కుకొనకుండియున్నచో, సహృదయ చక్రవర్తియగు అరుణగిరినాథునకే మానసోల్లాసకావ్యములోని భక్తి భావావేశము హృదయ స్పర్శియై యుండెడిది" అనుచు తనవాదము పూర్తి కావించెను.

పరిషత్తువారు వారిద్దరికీ మరల మరల వాదించుట కవకాశమిచ్చిరికాని వారు అవసరము లేదనిరి. వారి వాదములలో మధ్య మధ్య పరిషత్సభ్యులు ఇద్దరిని ఎన్నో ప్రశ్నలువేసి సమాధానము లాలకించిరి. ఉభయవాదులు తాము చెప్పుకొనవలసినది పూర్తియైనదని తెలిపిన పిమ్మట పరిషత్సభ్యులలో వైయాకరణసార్వభౌముడుతుదకు శ్రీనాథునిట్లు ప్రశ్నించెను.

"శ్రీనాథభట్టా, ఈ మానసోల్లాసము అశ్రద్ధగా నాలకించినవారికి వ్యాకరణదోషములని భ్రాంతి కలిగించు భాగములు కొన్ని యున్నవి"—అని కొన్ని చదివి వినిపించి మరల నిట్లనెను. అవి శబ్ద దోషములుకావు. అయినను అట్టి దోషాభాసములు కావ్యములో నుండుట కావ్యగుణమునకు ఉత్కర్షదాయకములనియే మీ యుద్దేశమా?"

ఆ తుది క్షణమున నడిగిన యా ప్రశ్నవిని శ్రీనాథు డొక్క క్షణకాలము నిస్తబ్ధుడయ్యెను. యాత్రారంభమున కొండవీటిలో పదునొకండు దినములు దీక్షగా ఉపాసించిన బ్రాహ్మీమూర్తిని భక్తిభావముతో ధ్యానించెను. తన కెదురుగా కూర్చున్న పోతన రూపమున వ్యక్తమగు బాలకృష్ణుని దర్శించెను. శ్రీనాథుడు అర్ధనిమీలితనేత్రుడై భక్తితత్పరభావముతోడనే ఈ ప్రత్యుత్తర మొసగెను.

"చిత్తము ఆర్యా! పండితంమన్యులు అపశబ్దములని భ్రాంతిపడు శబ్దములు విద్వాంసులకు చమత్కారముగా నుండునుగదా! అట్టిది గుణమే యగును గాని దోషము కానేరదు. అదియుగాక, సర్వజ్ఞుడగు శ్రీ విరూపాక్షేశ్వరస్వామికి భక్తుడనగు నాబోటి యల్పుడను, ఏవో ఒకటి రెండక్షరములు నేర్చిన గర్వముతో తగుదునని స్తోత్రము చేయ సమకట్టితినిగదా! తమ పసిబిడ్డల వచ్చియు రాని తొక్కుపలుకులే తల్లి దండ్రులకు, పెద్దలకు ప్రీతియే కలిగించునట్లు,జగజ్జనకుడగు శ్రీవిరూపాక్షస్వామియు ఈ శిశువు రచించిన కావ్యమునకు సంప్రీతుడగునని వ్యంగ్య విధానమున సూచించితినని కూడ భావింపనగును."

ఆ మరునాటికి పరిషత్తువారి నిర్ణయము తెలుపు సభ వాయిదా పడెను.

తమ యిండ్లకు బోయినప్పటినుండియు అటు డిండిమునకు తాను గెలువచ్చునను వాశావేశమును, ఇటు శ్రీనాథునకు వైయాకరణసార్వభౌముని కడపటి ప్రశ్నకు తా నిచ్చిన సమాధానము తృప్తి కలిగించెనో లేదో యను భయావేశమును ఆవహించెను. డిండిమభట్టు బరువు తీరిపోయినవానివలె ఏమైన కానిమ్మనియు, డిండిమము వదలిపోయినచో, ఇంటిలో తనభార్య నిత్యము చేయుచున్న గోలయైన శాంతించునను తృప్తితో, నిర్భయముగా నారాత్రి సుఖనిద్రపోయెను.

శ్రీనాథున కట్లుకాదు. ఆ నిర్ణయముపై తాను బహు సంవత్సరములనుండి చేసిన ప్రయత్నమేకాక, తనప్రభువు పెదకోమటి వేమభూపాలుడును, సింగన ప్రధానియు కనుచున్న కలలును, కొండవీటిరాజ్యము పొడవున తన్ను పూజించిపంపిన మహాజనముల యాశలును. తన ప్రియమిత్రమగు వామభట్టబాణుని ప్రాణములును, రాజకొండలో విశ్వేశ్వర కవి చంద్రుల మానమును, తాను తన పండిత మిత్రులతో ఈ యాత్రచేసి ఇంతవరకు కావించియున్న పన్నాగములును—సమస్తము నాధారపడియున్నవి. అది యాతనికి జీవన్మరణ సమస్యకంటె గురుతరమై హృదయభారము కలిగించెను.

శ్రీనాథు డానా డుపవసించి రాత్రి జాగరణ మొనర్చెను. ఆత డానా డహోరాత్రము వేదపారాయణము చేయుచు, భారతీ ధ్యానముతో గడపెను. ఆతని ముఖ భంగిచూచి ఎవ్వరు పలుకరింప సాహసింపలేదు. ఇన్నాళ్లను విద్వజ్జనముల ప్రసంగ సల్లాపములతో మారుమ్రోయుచుండిన కొండవీటి విడిది నిర్మానుష్యమైనట్లు నీరవమై యుండెను.

పరిషత్తు నిర్ణయము ప్రకటింపబోవుచున్న నాటి ప్రాతఃకాలమున శ్రీనాథుడు సంధ్యోపాసనాదులు ముగించుకొని గృహదేవతాయతనములో మహాదేవునియెదుట వినమ్రుడై ధ్యానము చేయుచు నిలుచుండెను. చల్లని యడుగులతో శ్రీదేవి వచ్చి ప్రక్కగా నిలిచెను. శ్రీనాథు డామెను ప్రశ్నించుచున్నట్లు తల యెత్తిచూడగా, నామె వినయముతో నిట్లు ప్రార్థించెను.

"మీ విద్యా విజయవేళలో మిమ్మొకవరము అర్థింపవచ్చితిని. అరుణగిరినాథుల డిండిమము మీరు గెలుచుకొన్నపిమ్మట, దానిని మాత్రము మనపతికి తేవద్దు. దాని నేదో పిశాచమో భూతమో ఆవేశించియున్నదని పూజ్యురాలగు వారి పత్ని గౌరీదేవి గోలపెట్టుచున్నది."

శ్రీనాథుడు ప్రేమార్ద్రమైన చూపు ప్రసరింపజేసెనేకాని బదులు చెప్పలేదు. మహేశ్వరునకు ప్రణామ మాచరించి మహేశ్వర ధ్యానపరవశుడైయాతడు మిత్రులతో సభాస్థానము చేరికొనెను.

ఆనాటి సభ ఆహూతులైన పెద్దలతోడనేకాక, ఇతర ప్రేక్షక జనముతో గూడ కిటకిటలాడుచుండెను. ఆసభ ముఖ్యాధికరణస్థానము (అధికరణస్థానమనగా నేటి న్యాయస్థానము వంటిది. ఆ కాలమున నవి రెండు విధములు. ముఖ్యాధికరణ స్థానములో ప్రభువే తీర్పరి. ఆ ముఖ్యాధికరణస్థానములో రాజోద్యోగులు తీర్పరులు.) వంటి

జరుగుటచే, విద్వద్గోష్ఠి కను విచ్చిమాపుటకు ప్రత్యేక స్థానము కలదు. సభామందిరము వెలుపల నువ్వుల వేసిన రాలకుండునట్లు జనములు గుంపులుకూడి యుండిరి. ఏమగును, ఏమగును?—అని యందరు తహతహలాడుచుండిరి. అందరికంటె శ్రీనాథు డెక్కుడ తహతహతో నుండెను. అతడు తన యుత్కంఠ నంతటిని మహేశ్వరార్పణము కావించుచు ధీర నిశ్చలముగా స్థాణునివలెనే సభలో గూర్చుండెను.

శ్రీ దేవరాయ సార్వభౌములు రాజమర్యాదలతో సింహాసనాసీనులైరి. పరిషత్సభ్యులు ప్రభువుల సెలవు తీసికొని అవలనున్న యేకాంతమందిరము నకు వెళ్ళిరి. గడియపాటు వారి సంశయములు వారు తెలుపుచు సంప్రదించుకొనిరి. తుదకు వా రేక గ్రీవముగా నొక నిర్ణయమునకు వచ్చిరి. అది ప్రాడ్వి వాకుడు పత్రముపై వ్రాసి వారికి చదివి వినిపించెను. అందరు సమ్మతించిరి. అంతటవారు సభా స్థానమున ప్రవేశించి పరిషదాసనము అలంకరించిరి. ప్రాడ్వివాకుడగు చంద్రభానుక్రియాశక్తి పరిషన్నిర్ణయమును శ్రీ దేవరాయల కిట్లు వినిపించెను.

"శ్రీ దేవరాయప్రభూ, మే మందరము శ్రీనాథ భట్టవిరచితమైన మానసోల్లాసస్తుతి కావ్యమును నిశితముగా పరీక్షించుచు పఠించితిమి. దాని గుణ దోషములగూర్చి శ్రీ అరుణగిరి నాథులయు, శ్రీనాథులయు వాదములు శ్రద్ధగా నాలకించి విమర్శించితిమి. ఈ మానసోల్లాసస్తుతి కావ్యము ఎట్టి దోషములులేని ఉత్తమస్తుతి కావ్యమని మే మేక గ్రీవముగా నిర్ణయము చేయుచున్నాము. దీనిని ప్రభువులు శ్రీ విరూపాక్షేశ్వరస్తుతి కావ్యరాజము లలో నొకటిగా పరిగ్రహించి స్వామి గ్రంథ భాండాగారమునను ప్రభువుల కోశాగారమునను పూజ్య స్థానమున ప్రతిష్ఠింపదగునని మా పరిషత్తు నిశ్చయము!

"వరాకుగానున్న సమయములలో శ్రీ అరుణగిరి నాథులు వినుటచే, వ్యాకరణ దోషము లున్నవని భ్రాంతిపడి కొంత యమాయికముగా తొందరపడి యన్నమాటలచే, ఈ వివాదము పొసగినదికాని లేకున్నచో వారు కూడ మా అభిప్రాయముతో నేకీభవించియుండెడివారని మా విశ్వాసము!—అపైన దేవరవారిచిత్తము!"

పరిషన్నిర్ణయమును శిరసావహించుటకై శ్రీనాథుడు లేచి తూలి ఆసనమున కూలబడెను. ఆసనమునుండి లేవలేకయే అరుణగిరినాథుడు మూర్ఛిల్లెను. వా రిరువురు కొలది సేపటిలోనే తేరికొనిరి. శ్రీ దేవరాయసార్వభౌములు నిర్ణయమును సభాపతి యిట్లు ప్రకటించెను:

"పండిత పరిషత్తు నిర్ణయించిన ప్రకారముగా శ్రీనాథభట్టు విరచిత మానసోల్లాస కావ్యము నిర్దుష్టమైనదని యంగీకరించుచు, దానిని యథార్థముగా పూజింపవలెనని శ్రీ దేవరాయ ప్రభువులు శాసించుచున్నారు. ఇక ఈ వాదారంభమున ఉభయ వాదులు కావించుకొన్న ప్రతిజ్ఞాపణముల ననుసరించి, విద్యాధికారులు శ్రీ అరుణగిరినాథులు తమ డిండిమమును శ్రీనాథభట్టుకు సమర్పించుకొనవలెను. జయపత్రిక శ్రీనాథభట్టునకు ఇప్పించు చున్నారు!"

వెంటనే లాజశేఖరుడు జయపత్రిక లిఖించి దేవరాయలవారికి చూపెను. రాయలు యనుమతితో రాజ ముద్రాధికారి దానిపై రాజముద్రికవేసి సభాపతికీయగా, అతడది శ్రీనాథునకు ప్రసాదించెను. శ్రీనాథుడు దానిని వినయముతో నందుకొని కన్నుల కద్దుకొనగా, రెండు కన్నీటిబొట్లు దానిని అర్ద్ర మొనర్చెను.

అంతట రాజనాథుడు తండ్రి పక్షమునలేచి సభాంగణమునయుట శకటములపైనున్న కంచు ఢక్కను తెప్పించి, శ్రీనాథభట్టుముందున్న పీటముపై పెట్టించి సమర్పించెను. శ్రీనాథు డది చేతులతో స్పృశింపనైనలేదు. దానిని చూచినంతనే అతనికి జుగుప్స కలిగినది. శుచియైనవాడు సమీప మునున్న యమంగళ వస్తువును చూచినట్లే అసహ్యము, కనబరచుచు ప్రభువుల కిట్లు విన్నవించెను.

"ఈ వాదారంభమున చేసిన ప్రతిజ్ఞ పరిషదనుగ్రహమున ప్రభువుల కటాక్షమువలన మేము నిర్వహింప గలిగితిమి. అది విరూపాక్షస్వామి కృప! మే మీ నగరము చేరిన మరునాటి యుదయము ననే ప్రథమపర్యాయము ఈ ఢక్కను దాని వెనుక శ్రీ అరుణగిరినాథులను చూచుట తటస్థించినది. అప్పుడే శ్రీ అరుణగిరినాథులపై గౌరవ భావమును, ఈ డిండిమముపై నసహ్యమును యౌగపద్యముగా సంజాతమైనవి. శ్రీ విద్యానగరములో విచారించగా, మాకేకాక ఇక్కడ ప్రసిద్ధులగు కవి పండితుల కెందరకో ఈ డిండిమ వాదన తాండవము ములు అవమానకరములుగా నున్నవని తెలియవచ్చినది. కవి పండితుల నా యవమానమునుండి తప్పించుటకే, మా వాదమున కీపణము పెట్టితిమి. ఇప్పు డీ డిండిమ వాదనముతో మేము కవి పండితుల నవమానించుట కెంత మాత్రము నిచ్చగింపము. ఈనాడు సభ కరుదెంచుచు మహేశ్వరధ్యానము చేయుచుండగా, ఈ డిండిమమును తాకవద్దనియు, విడిదికి తేవలదనియు, మాకు శ్రీ శివాజ్ఞ ఉపశ్రుతమైనది. ఆపైని దేవరవారి చిత్తము!"

ఆ మాట లాలకించి సభ ఆవేశపూరితమైనది. వాదములో నాతడు ప్రదర్శించిన ప్రతిభవలన కంటె శతగుణముగా నీ మాటలవలన నాతని మహత్వము వారికి ద్యోతమయ్యెను. వాదములో సాధించిన విజయముకంటె ఈ డిండిమ నిరాకరణము అరుణగిరి నాథునిలోకంటె శ్రీనాథునిలోనున్న అతిశయ మిప్పుడు ధ్రువపరచినది. లాజసభలో నున్నా మనుమాట కూడ విస్మరించి, కొందరు పండితులు సాధువాద మొనర్చిరి. ఇంతలో వారికి రాజాజ్ఞా ప్రసాదితమైన కంచు ఢక్కను స్వీకరింపకుండుట రాయలు అవజ్ఞగా భావింతురేమో యను భయ మావహించినది.

దేవరాయలు కూడ శ్రీనాథుని మాటలకు ఆగ్రహింపవలెనో సంతోషింపవలెనో తోపక, కొంత సేపు తటపటాయించెను. అది తమ తాతగారగు బుక్కరాయలవారు అరుణగిరినాథుల తండ్రి శోణాద్రినాథులకు అనుగ్రహించిన గౌరవ లాంఛనము. అట్టిదానిని శ్రీనాథుడు గ్రహింపక నిరాకరించుట ప్రభుధిక్కారముగానే భావింపనగును. అయినను ఆతడు వినయముతో చెప్పిన సమాధానము కూడ సమంజసముగానే ఉన్నది. వారందువలన కర్తవ్యమును పరిషత్తునే నిర్ణయింపు నానతిచ్చిరి.

పరిషత్తుకు ధర్మ నిర్ణయము చేయుట కెక్కువ కాలము పట్టలేదు. "ప్రతిగ్రహీతకు ఉద్దేశించి ఉంచబడిన వస్తువును ప్రతిగ్రహీత గ్రహింప నిరాకరించినచో, అది యింతటి విలువగలదైనను దానిని శత్రువులు కూడ గ్రహింపరాదు. అట్టిది కోటి గుణితముగా అమంగళకరము. ఈ కంచు ఢక్కను వెంటనే పగులగొట్టింప నాజ్ఞాపింపవలయునని ప్రభువర్యులకు నివేదించుచున్నాము" అని ప్రాడ్వివాకుడు తెలిపెను.

రాయలవారి యాజ్ఞ సభాపతి యిట్లు ప్రకటించెను :

"జగద్వంద్యులైన బుక్కరాయనృపాలురు శోణాద్రినాథులకు మహా సభాసమక్షమున ఇప్పటికి ఏబదియేండ్లక్రిందట బహూకరించిన ఈ కంచు ఢక్కను శ్రీ శివాజ్ఞ ప్రేరితులమై వెంటనే పగుల గొట్టింప నాజ్ఞాపించుచున్నాము—ఈ వివాదము వలన మాకు విద్యాధికారులగు శ్రీ అరుణగిరినాథుల యందుగల విద్యా గౌరవ మేమాత్రము తగ్గలేదని ఈ సభాముఖమున ప్రకటించుచున్నాము. మరియు వారికి వంశానుగతముగా వచ్చుచున్న డిండిమభట్ట బిరుదము (అరుణగిరినాథుని కుమారుడును, మనుమడును, మునిమనుమడునులగు రాజనాథుడు, శోణాద్రినాథుడు, రాజనాథుడు వరుసగా ఆ బిరుదము ధరించినవారే.) దినిచే పోలేదని ఉద్ఘాటించుచు మరల వారికి స్థిరపరచుచున్నాము!"

మూర్ఖ క్షమైన దేవరాయల శాసనమునకు సభవారు ఆనంద పులకితులైరి.

వెంటనే ఇద్దరు భటులు కంచుఢక్కను దూరముగా తీసికొని పోవుచుండిరి. అప్పుడు దానిలోనుండి స్పష్టముగా పిశాచముల యార్తనాదమువంటి భయంకర శబ్దము వినవచ్చి సభాసదులను చకితుల గావించెను. భీమదండములతో భటులిద్దరు ఒక్కపెట్టున కొట్టిన దెబ్బతో, ఆ కంచు ఢక్క శూలాఘాతము మర్మస్థానమున తిన్న రాక్షసుని వలె బొబ్బ పెట్టి మూర్ఛిల్లుచు శకల శకలము లుగా చిదికిపోయినది.

వెంటనే ఒకప్రక్క శ్రీనాథుడును, ఆ ప్రక్క అరుణగిరినాథుడును తమయొద్దగల బంగరుకొమ్ము చెంబులనుండి గంగను గ్రహించి ఆశౌచ నివృత్తి కొరకై ఆచమించిరి. సభలో నుత్పన్నమగుచున్న కలకలము రాజపురోహితుడు గ్రహించి, వెంటనే యక్షరాక్షస పిశాచోపద్రవశాంతికై రాక్షసత్నాత్మకము లగు వాధ్యరణ యంత్రములు పఠించుచు, మంత్రపూతోదకమును కూర్చతో రాయల సింహాసనము నను సభాంతరాళమునను సంప్రోక్షించెను. దానితో రాజసభ శాంతించెను.

దేవరాయలవారు సభ చాలించుటకుముందు మరల సరిగా ఆనాటికి వారము రోజులకు తమ యాస్థానములో విద్యా వినోదగోష్ఠిని రావలెనని శ్రీనాథభట్టు నాహ్వానింపగా, నాతడు వినయముతో నంగీకరించెను. రాయలసభ ముగిసినది.

మౌనముద్రాంకితులై శ్రీనాథుడును అరుణగిరినాథుడును ఆసనమునుండి ఒకరి నొకరు సమీపించి ఎదురై గంభీర వదనములతో దోసిలొగ్గి ఒకరి నొకరు బాహువులతో నాలింగన మొనర్చుకొనిరి. ప్రక్కనున్న రాజనాథుడు "ఈ కంచు ఢక్కను బలవంతముగా వదలించినందులకు మా తాతపాదులు మీకు కృతజ్ఞతాభావముతో నున్నా"రనెను.

(సశేషం)

# మహాడవ సమాధి

17-వ పేజీ తరువాయి

కొడవలి, గడ్డిబుట్ట తీసుకొని వచ్చింది. తను మోట పలుగు పేనుతున్నాడు. వెనకాలనే వచ్చి కళ్ళు మూసింది.

అమ్మ దొంగా .... ! అంటూ చెయ్యి గట్టిగా ఒత్తేడు.

అబ్బో .... ! అంటూ పట్టు వదిలింది.

ఇద్దరూ వచ్చిగడ్డిమీద కూచున్నారు. అనసూరి తన ఒడిలో తలపెట్టి :

"నిన్ను సూత్తుంటే ఆ సినిమాలో హీరో యాదుకొత్తున్నాడు సైదులూ .... !"

"మరిగంత గట్టా మాట్టాడకు .... !" తను మందలించాడు.

"గెట్టా .... ?" అమాయకంగా చూసింది.

"గిట్టా .... !" అని ఆమెని తన బాహుపంజరంలో బంధించేడు.

సూరి వారించలేదు. అవి కొన్ని క్షణాలే. కాని .... అవి ఆనాటి తన జీవితంలోని మరుపలేని, మరపురాని, మరిపించలేని, మెరపువంటి మధుర క్షణాలు. అప్పుడు తను మన్మథుడు. ఆమె రతి. ఆమె రాధ. తను మాధవుడు. ఆ పచ్చగడ్డే నంద కిశోరుని నిలయమైన బృందావనం. అదే తనని ఆశీర్వదించిన ఏకైక సాక్షి. అనసూరికి తన చిన్నతనంలోనే పెళ్ళయింది. యవ్వనంలోనే ఆమె భర్త తనువు చాలించేడు. తాళికట్టిన భర్తయొక్క ముఖమయినా సరిగా పరిశీలించలేకపోయిన బాల్య వితంతువామె. బావికిందనున్న నాలుగెకరాల తరితో బ్రతుకు వెళ్లదీస్తున్న ఏకాకి. తనకి మల్లితో లగ్నమవుతుంటే ఆ రోజల్లా సూరి ఇంటిలో కూర్చొని ఏడ్చిందట. మరునాడు తను సూరింటికి వెళ్లేడు.

"ఏంది బావా.... !" సూరి దుఃఖాన్ని దిగమ్రింగుకొంటూ అడిగింది.

"నీకు నామీద కోపం రావటంలేదా ?" సూటిగా ఆమె ముఖంలోకి చూస్తూ అడిగేడు.

"ఎందుకు ...... ?"

ఆ ప్రశ్న తన వ్యక్తిత్వానికే ఒక సవాలనిపించింది. సమాధానంలేని ఆ ప్రశ్న తన ఆత్మలో బల్లెంలా గ్రుచ్చుకొంది. ఒక స్త్రీలోని, ముఖ్యంగా అనసూరిలోని సహనశక్తిని తొలిసారిగా చవిచూడగలిగే డతను. హృదయ మొక్క విభిన్న దృక్పథాల వనమయితే, అందులో పశ్చాత్తాపం దావానలంలా నాలికలు చాచుకుంటూ ఎగబడుతోంది.

"నేను నీకు సానా దోహం చేశా సూరి ! నావంటి పాపి ఈ పెపంచంలో బతకకూడదు. నీలాయింకా ఈ పెపంచంలో ఎంతమంది మోసపోతున్నారో .... ! నన్ను సంపెయ్యి సూరి ! బతికుండి ఈ జీవితంలో సుఖమనుభవించలేను — నీ కాళ్లముందు ఆనందంగా సానా తొడులుతాను !" విద్యార్థి పాఠ మప్పగించినట్లు గబగబ అనేశాడు.

"తప్పు బావా! నీ సూరికి సొర్థం లేదు. నాకు కావలసిం దొకటే. నీ సుఖమే నాకు కావాలి. ఈ

సూరిని .... మరచిపోతావా బావా ....'' కళ్ల నీళ్లు తిరిగేయి.

"నా మల్లి తోడుగా నిన్ను మరువను సూరీ....!''

"నీకు నామీద దయ ఉంటే నా ఇంటి దర్వాజా ఎప్పుడూ తెరుచుకొనే ఉంటుంది—''భావయుక్తంగా పలికింది.

మల్లి కాపురానికి రాగానే తను సూరిని పూర్తిగా మరిచిపోయాడు. పొద్దు మబ్బుల్లో ఉండగానే పొలం వెళ్లిపోతాడు. పగలంతా పొలంలో పనిచేసి పొద్దు క్రుంగగానే ఇంటి కొస్తాడు. చెమటలు స్రవించిన శరీరశ్రమతో ఇంటికి రాగానే మల్లి చూపే ఆదరణలో, అందిచ్చే ఆనందంలో సూరి మరుపు తెరమాటున ఉండిపోయింది. తన యౌవన జీవనస్రవంతి ఈరోజునే ప్రపంచం సుఖాల మీద విసిగి సాగరసంగమం కాబోయే నదిలా పరమాత్మలో లీనమయ్యే అంతిమ దినం. తనలో తొలిసారిగా ప్రేమబీజాన్ని నాటిన సూరిచెంతనే ఈయాల పానా లొదలాలి. కాళ్ళు సూరి ఇంటి దగ్గర ఆగేయి. మెల్లగా తలుపు తట్టేడు.

"ఏంది బావా ! ఈయాల బాట తప్పినావా ?'' సూరి చిరునవ్వుతో పలకరించింది. "పాతబాట ఎలా మరిచిపోతా సూరీ—''అంటూ ఆమెని సమీపించబోయాడు.

"వద్దు బావా!దూరంగా ఉండు—''సూరి మాటగా తన ఎదలో బల్లెం విసిరినట్లయింది.

"సూ .... రీ—''లాలనగా పిలిచేడు.

"నువ్వు నా ఇంటికి ఇటువంటి కోరికలకోసం రాకు ! నీకూ, నాకూ ఉన్న ఆనాటి సంబంధం వేరు. ఇప్పుడు నేను కొత్త సూరిని. చేసిన పాపాలకి కన్నీళ్లతో కుమిలిపోతూ ఆ బగమంతుణ్ణే శరణు కోరుతున్న ఈ కొత్తజీవితంలో నాలోని పాత కోరికలు సచ్చిపోయాయి. వద్దు బావా .... మంచిగా బ్రతుకుతున్న నన్ను మళ్లా ఆ మలిన బాటమీదకి గుంజకు—''

"సూరీ....!'' అతని నరాల్లో పొంగుతున్న రక్తం గొంతులో నవచైతన్యమిచ్చింది. "మల్లి నెన్నడు తొలుకొస్తావ్'' .... సూరి వెనక్కి వెళుతూ ప్రశ్నించింది.

ఆప్రశ్నతో అతని రూపంలో దాగిన ప్రతిరూపం ముఖంలో ప్రవేశించింది. క్షణంలోనే ఆ ముఖంలోని వాంఛ, కళాకాంతులు అంతరించి దిగాలుపడిపోయాయి.

"నేను సచ్చిపోతున్నాను సూరీ .... !'' దిగులుగా అన్నాడు.

"ఛా ! అదేంమాట — ''సూరి కళ్లెర్రజేసింది.

"అవును సూరీ ! మద్దేనేల మోటకాడినుండి తరిపాలాని వెళుతున్నా. ఆడ చేనుగట్టుమీద కోడెత్రాసు పడగిప్పి ఆడుతోంది. సీదా నా బాటని నేను పోక కర్ర పుచ్చుకొని కొట్టినా. రెండు దెబ్బలు తగలగానే కర్ర విరిగిపోయింది. పాము కలుగులో దూరిపోయింది. దెబ్బతిని పారిపోయిన నాగుపాము, కక్షకట్టిన శత్రువు ఇడిచిపెట్టరు సూరీ—నాకింక పానాలమీద నమ్మకంలేదు. నీ బావను శమించు. మల్లితో ఈమాట చెప్పు .... !''

అంటూ గుమ్మాలు దిగేడు "బావా—బావా !'' అని పిలిచే సూరిపలుకులు అతని కింక వినిపించలేదు. తిన్నగా ఇంటి కెళ్లేడు. మల్లి తన ఒళ్లో తల పెట్టుకొని ముచ్చట్లు చెబుతున్నప్పుడు ఎవరైనా వస్తే హఠాత్తుగా లేచిపోయినట్లు ఇంట్లో గునగుసలాడుకొంటున్న ఎలుకలు చూరుమీదకి ఎగబ్రాకేయి. ఇల్లు బావురుమని విలపిస్తున్నట్లుంది. కుండలోని కూడు కంచంలో పెట్టుకొని కూర్చున్నాడు. ముద్ద నోట్లోకి పోవటం లేదు. లేచి చెయ్యి కడుగుకొని దీపం ముట్టించి మంచముమీద పడుకొన్నాడు. రోజూ తను మంచముమీద ఒరగగానే నిద్ర ఆవహించుకుంటూ వస్తుంది. ఈరోజు కళ్లు మూతలు పడటంలేదు. పాము తన అడుగుల పసికడుతూ బిబమ్మ ఒంటేలుకాడికి వస్తాది. ఆ డి ను ం చి సూరి ఇంటి కెళ్తాది. మళ్లా అడుగులు వాసన చూసుకొంటూ తనింటి కొస్తాది. తనని కాటేస్తుంది. తను సచ్చిపోతాడు. ఇదివరకో పాలి కన్నయ్య పాము కరిచే సచ్చిండంట. ఎవరి కేవిధంగా సావుందో? ఎవరికి భూమిమీద ఎన్నాళ్ళ ఋణమో ? అతని చూపులు అలా అలా ముందుకు పోయాయి. గుండె యథాస్థానంలో లేదు. గోడమీద ఏదో మెదలుతోంది. అటు యిటూ కదలుతోంది. అది పామే —ఆ పామే .... ! తనకి చావు తప్పదు. ఇంక తన ఆయువు ఘడియల్లో పూర్తవుతుంది. తన ఆకస్మికమరణం మల్లికి పిడుగుపాటులా — పరిణమిస్తుంది. సంసారసుఖాలని సంతృప్తిగా, సంతోషంగా అనుభవించని తన జీవితం మూన్నాళ్ల ముచ్చటా ? ఇరవై అయిదు సంవత్సరాలలోనే తన ఆయువు సంపూర్తి అయిందా ? తన జీవితంలో ఋణానుబంధం ఇంతవరకేనా ??? చూపులు ఆగోడమీదే నిలిచిపోయాయి. గ్రామదేవతకి కోళ్లని బలిచేసే గణాచారిలాగుం దా కాలసర్పము.

---

"ఒక్క పెళ్లాంతోనే మేము అంతా వేగలేకుండా ఉంటే, ఒక్కసారిగా ముగ్గురిని చేసుకున్నావు ఏం బావుకుందామనీ?'' అని అడిగాడు ఒక ప్లీడరుగారు జైలుకి వెళ్ళిన తన క్లయింట్ ని.

"అబ్బే! ఏమీలేదు. ముగ్గురితో నెగ్గగలనో లేదో చూద్దామనీ'' నసిగాడు క్లయింట్.

ఏ. గోపాలరావు (మద్రాసు)

---

## 2

ఒక్కొక్కప్పుడు ఊహాలే స్వప్నాలుగా బహిర్గతం కావచ్చు. మరొకప్పుడు రానున్న భవిష్యత్తు సూచనప్రాయంగా కళ్లముందు కలగా కనిపించవచ్చు. కొన్ని కలలు నూటికి నూరుపాళ్ళ నిజాలవుతాయి. కొన్ని కల్ల లవుతాయి. బ్రతుకే కలవంటి ఒక కల్లయని గుర్తించినవారే భావిలో కూడా కలలు కనటం సహజం. సైదులు రాత్రి చాలాసేపు ఆలోచించి, విచారించి, తీరని వేదనతో, ఆరనిదిగులుతో, రగులుతున్న ఆత్రుతలో, ఎప్పుడో, ఎట్లో—తాత్కాలికంగా నిద్రాదేవతా ఒడిలోవాలేడు. సర్వసాధారణంగా పాము మంచము ఎక్కదని గాఢమయిన మూఢనమ్మకం. సైదులు విషయంలో అందుకు వ్యతిరేకంగా జరిగింది. పాము పైనుంచి తనమీద పడింది. కాటు వేసింది. ప్రాణభయంతో పారిపోయింది. పరులప్రాణాలు కబళించటం దానికి వినోదం. తన ప్రాణరక్షణ అత్యవసరం. సైదులు చచ్చిపోయాడు. మల్లి లబోదిబో మని మొత్తుకొంటోంది. నలుగురు మనుష్యులు అతన్ని మోసుకుపోయారు. ఆ సింతచెట్టుకాడ రెండు సమాధుల ప్రక్కగా మూడవసమాధి కూడ వెలిసింది. అంతా అంధకారం. ఆ అంధకారంలో అందమయిన మల్లి. కథ పూర్తయింది. కల కరిగిపోయింది. సైదులుకి మెలకువ వచ్చింది. తనింకా చచ్చిపోలేదని తెలుసుకొన్నాడు. మళ్లా ఆలోచనలు అనేక బాటలుగా చీలి, కేంద్రమయిన అతని మస్తిష్కంనుంచి విడివడుతున్నాయి. అంతలోనే ఎక్కడినుంచో అతనిమీద ఒక మెత్తటి పదార్థం పడింది. గుండె అమితవేగంతో కొట్టుకొంది. ఆ పడిన పదార్థంమీద దుప్పటి వేసి కంగారుగా లేచేడు. రెండు అంగలలో వెళ్లి కర్ర, దీపం తెచ్చేడు. ఆ పడినపదార్థం దుప్పటిలో గిలగిలలాడుతోంది. గజగజ వణుకుతున్న చేతులతో దుప్పటి తొలగించాడు. అది ఒక ఎలుకపిల్ల. భ్రాంతిలో, అవివేకంగా తను చేసిన పనికి తనకే నవ్వు వచ్చింది. కాలమానాన్ని సూచిస్తూ ఇంటి ముందు తొలికోడి కూసింది. హేతువు లేకుండానే ఆకాశం మీద తీతువుపిట్టలు కూస్తూ ఎగిరిపోతున్నాయి. పొలాల్లోని నక్కలు సన్నాయిరాగం పట్టినట్లు కూస్తున్నాయి. నాట్యానికి మేళ, తాళ, గాన వాద్యాల్లా ప్రకృతిదేవత ప్రళయతాండవానికి ఆ విస్పందార, నిశ్శబ్ద, నిశీధిలో కీచురాళ్ళ రొదలు, గజ్జెల పురుగుల ధ్వనులు, కప్పల బెకబెకలు శృతికలుపుతున్నాయి. సైదులు కింక నిద్రపట్టలేదు. చుట్ట వెలిగించి మంచముమీదే పడుకొని కాలుస్తున్నాడు. క్షణమొక యుగంగా గడుస్తోంది. మలికోడి కూసింది. ఒక రెండెడ్ల బండి తన ఇంటివేపు వస్తున్న ట్లనిపించింది. ఎద్దుల మెళ్లోని గంటలు అంతకంతకీ దగ్గరగా వినబడుతున్నాయి. బండి ఇంటిముందు ఆగింది. ఎవరో దిగేరు. తట్టిన తలుపుమీద మల్లి చేతిగాజులు ఘల్లున మ్రోగేయి. ఒక్క ఉదుటున వెళ్లి తలుపు తీశాడు. తన రక్తాన్ని పంచుకొని, మల్లి రూపాన్ని మలచుకొన్న మూడునెలల ముద్దుబిడ్డడు తండ్రి చేతిలో వాలిపోయేడు.

* * *

బండి తోలుకొచ్చిన పాలేరు వీధిలో అరుగుమీద కూర్చొని చుట్ట ముట్టించేడు. మల్లి మెల్లిగా తలుపు వేసివచ్చి మంచముమీద అతని ప్రక్కగా కూర్చొంది. పిల్లవాడు మంచము

# మూడవ సమాధి

మీద విశ్రాంతిగా నిద్రపోతున్నాడు. కుశలవార్తలు, కులాసాకబుర్లు పూర్తయినతరువాత :

"నిజంగా నిన్ను చూస్తా ననుకోలేదు మల్లీ ...." అన్నాడు.

"ఎందుకట్టా .... ?"

అతను జరిగినదంతా చెప్పేడు.

"నేను అదృష్టవంతురాలిని....!" అని మంగళ సూత్రం కళ్ళకద్దుకొంది.

మంచముమీద విశ్రాంతిగా నిద్రపోతున్న పసికందు ఊహాలుతెలియని శైశవంలోకూడ ఎందుకో నవ్వుతున్నాడు. సైదులు అతన్ని తదేకంగా చూస్తున్నాడు.

"ఏందిగట్టాచూస్తావ్....?"మల్లిమెల్లగాఅంది.

"నీ రూపే ...." సైదులు గొణిగేడు.

"రంగో .... ?"

"వాకుమల్లే ఉన్నాడు. నీ రూపు, నా రంగు."

"పోదూ ...." సిగ్గుతో మందలించింది.

సైదులు తన ముద్దుతనయుని నిర్నిమేషంగా చూస్తున్నాడు. మనసులో ఆలోచనలు ధూమశకటాల్లా పరుగు లిడుతున్నాయి. ఆ అదురుష్టమంతా మల్లి మంగళసూత్రానిది కాదు. తన బాబు పుట్టిన వేళా విశేషం. "ఇదిగో మల్లీ....!" ఆలోచనలనుంచి తేరుకుంటూ పిలిచేడు.

"ఏందంట."

"మన బాబుకి ఏం పేరెడదాం ?"

"నీ యిష్టం."

"నాగరాజు అని పెడదాం."

"ఎందుకని .... ?"

"అబ్బాయి అదురుట్టంవల్లనే నే నీవేళ బవాయించాను. అందుకని నాగరాజు పేరెడదాం .... !"

"గట్టనే ....!" అంది మల్లి.

ఆమెని—గుండెల కదుముకొన్నాడు.

## 3

రోజంతా చీకటి రాజ్యము చేయదు. సుఖదుఃఖాలలో డోలాయమానంగా ఊగులాడే మానవుల రోజులు, ఋతులు అనుసరిస్తూ ఉంటాయి. కారుమబ్బులని తొలగించుకొని కరుణాకరుడయిన దినకరుడుదయించినట్లు మల్లి ఆగమనంతో సైదులు భీతి అంతరించి, ముఖాన దరహాస రేఖలు వెల్లివిరిశాయి. కబుర్లతో, పరాచికాలతో భళ్ళున తెల్లవారింది. మల్లి లేచి గృహకృత్యాలలో అడుగుపెట్టింది. సైదులు నిద్రలేని కళ్ళతో మంచముమీద ఒరిగేడు. కుంభకర్ణుడి వారసుల నందరినీ మేల్కొల్పటానికి బయట కాకులన్నీ కట్టుగా కలసి రణగొణధ్వని చేస్తున్నాయి. జన సందోహాలు మారుమోగుతున్నాయి. పల్లెటూరి వాతావరణానికి అది ప్రతిబింబమే కాబట్టి సైదులికి ఏమంత కొత్తగా అనిపించలేదు. అప్పుడప్పుడే చిన్నగా, సన్నగా కునుకుపడుతోంది. ప్రక్కింటి పెద్దులు వచ్చి :

"సైదులూ....సైదులూ....!" అని పిలిచేడు.

"ఏందిరా కొంప మునిగిపోయినట్టు గట్టా పిలుస్తుండావ్!" అని విసుక్కొంటూ తలుపు తీసేడు.

"కుమ్మింకా తెంత నిద్రోతున్నావా ?"

"ఏమాయె .... ?"

"అనసూరి సచ్చిపోయిందిరా....!" అని పెద్దులు పరుగు తీశాడు.

సైదులు గుండెల్లో వెయ్యి రైలు ఇంజన్లు ఒక్కసారిగా కూతపెట్టినట్లయింది. పెద్దులు అబద్ధం పలకడు. అందులోనూ ప్రత్యేకంగా పొద్దున్నే అబద్ధమాడవలసిన పనిలేదు. రాత్రి చిరునవ్వుతో పలకరించిన అనసూరి తెల్లవారేసరికి మృత్యువుకి బలి అయిందా ? సైదులు తన చెవులని తానే నమ్మలేకపోతున్నాడు. ఆ సమయంలో తన ఇల్లొక నరకకూపంలా కనిపిస్తోంది. రెండు అంగల్లో అనసూరి ఇల్లు సమీపించాడు. అక్కడ జనం గుమిగూడి ఉన్నారు. అందరు తలోకరకంగానూ మాట్లాడుతున్నారు. ఇంటి ముందు అనసూరి శవం పడిఉంది. నిద్రపోతున్నట్లు ఆమెకళ్ళు మూసుకొని ఉన్నాయి. తను వెళ్లిపోయేటప్పుడు అనసూరి పిలిచింది. అప్పుడు తను వినిపించుకొని ఆమెపిలుపుని అందుకున్నట్లయితే ఇలా ఆకస్మికమృత్యువువాత పడేది కాదేమో ? హిమగిరిశిఖరాలనుంచి కరిగి, జారిన మంచుమంచి స్రవించే గంగోత్రిలా అతని కళ్ళ అశ్రుబిందువులు ద్రవిస్తున్నాయి. మరల అనసూరివంక చూసేడు. ఆమెకి కొంచెం దూరంలో ఒక కర్ర, దానికి కొంచెం దూరంలో చచ్చిన పాము పడిఉన్నాయి. ఆమె మరణానికి అవి రెండే సాక్ష్యులు. వాటికి కారకుడు తనే. అనసూరి ఎంత పని చేసింది ? స్వల్పవిషయాలకికూడ స్వార్థంతో విలువకట్టే యీ మానవసమాజంలో మరొక ప్రాణికోసం మరువలేని మహత్తరత్యాగం చేసింది. కసితో, పగబట్టిన వ్యక్తిని నుసిచేయాలనే తలంపుతో, బరబర ప్రాకుతూ వచ్చిన కాలసర్పాన్ని ప్రతిఘటించి, పదాశయసఫలతకై తన ప్రాణాలనే బలిచేసింది. ఆమె మానవస్త్రీ కాదు. దేవత. నిన్ను చూస్తుంటే సినిమాలో చూసిన ఆ హీరో యాదు కొస్తున్నాడు అంటూ తన బాహుపంజరంలో బంధితురాలయిన అనసూరి ఈమేనా ? —అప్పు బావా ! నీ నూరికి సొర్గం లేదు. వాకు కావలసిం దొకటే— నీ సుఖమే నా క్కావాలి. ఈ నూరిని—మరచిపోతావా ? అని జాలిగా ప్రశ్నించిన అనసూరి. నువ్వు నా ఇంటికి క్షణికమయిన కోరికకోసం రాకు. నీకూ నాకూ ఉన్న ఆనాటి సంబంధం వేరు. ఇప్పుడు నేను కొత్తమారిని. చేసిన పాపాలకి కన్నీళ్లతో కుమిలిపోతూ ఆ జగన్మంతుణ్ణే శరణుకోరుతున్న ఈ కొత్తజీవితంలో నాలోని పాత కోరికలు సచ్చిపోయాయి. వద్దు బావా ! మంచిగా బ్రతుకుతున్న నన్ను మళ్ళా ఆ మలినబాటమీదికి గుంజకు — అనసూరి విరక్తిగా పలుకుతోంది. సైదులు కళ్ళముందు అనసూరి రూపం అనేక భంగిమలలో కనిపిస్తోంది. ఎవరు, ఎప్పుడు, ఎలా మరణిస్తారో అనేది నిర్ణయించలేని సమస్య. ఎవరికి ఎన్నాళ్ళ ఋణమో ?

*     *     *

ఆ రోజంతా సైదులు భోజనం చేయలేదు. అనసూరి అంతిమక్రియలు తనే జరిపించాడు. ఆ సింతచెట్టుక్రింద, రెండు సమాధుల పక్కగా మరొక సమాధి వెలసింది.





"గులేబకావళి కథ"లో జమున, ఎన్. టి. రామారావు.

## చిత్రసమీక్ష

"ఆనందో బ్రహ్మయటన్న బ్రాజదువునంతర్బుద్ధి నూహింపుమా" ఈ మాటలు ఈ నాటివికావు. నీ స్థూల బుద్ధికి లేకపోతే పోయిందీ, అంతర్బుద్ధితో నైనా నే చెప్పింది నేర్చుకోమని వరూథిని అనే ఒకానొక అచ్చెర మచ్చెకంటి కర్మిష్ఠియైన ప్రవరుడనే బాపన చిన్నవాణ్ణి నడివీధిలో మాదిరిగా వాలుగు తలి కొండల మధ్య నిలవేసి దబాయిస్తూ అన్న మాటలు. ఆ చిన్నది అన్నది ఇంకో విషయంలోనైనా కావ్యం వల్ల కూడా బ్రహ్మానంద సదృశమైన ఆనందం కలుగుతుందని పెద్ద లన్నారు. ఆ ఆనందం ఎలాంటిదోననే సంశయాత్ములకు కథేలాంటిదైనా కమ్మని సంగీతంతో, రసగుళికల్లాంటి పాటలతో ఆద్యంతంలాస్యం చేసే నవనీత హాస్యంతో, కనువిందువైన ఛాయాగ్రహణంతో 'కళా'ర్థదంగా యన్. ఎ. టి. వారు నిర్మించిన "గులేబకావళి కథ"లో చక్కని సమాధానం లభిస్తుంది.

తను తిరిగిన మలుపుల బాటలతో ప్రేక్షకుడి మనస్సును కూడా ఆ కట్టుకులాక్కుపోయే ఈ కాలాతీత జానపద చిత్ర కథా వస్తు విది:

పాటలీపుర మహారాజా చంద్రసేనుల (ముక్కామల) చిన్న భార్య రూపవతి (ఛాయాదేవి)కిముగ్గురు పుత్రులు కలుగుతారు. పట్టమహిషి గుణవతి (ఋష్యేంద్రమణి)కి లేక లేక కలిగిన కుమారునివల్ల తన కుమారులకు రాజ్యార్హత పోతుందని రూపవతి తన సోదరుడు వక్రకేతు (రాజనాల)తో కుట్రపన్నుతుంది. రూపవతీ లావణ్యాలోలుడైన మహారాజు, గుణవతి పుత్ర సందర్శనక్షణంలో అంధత్వ యోగం వుందని జోస్యులు వక్రకేతు కుట్రలో చేరి చెప్పిన పలుకులు విని గుణవతి కుమారుని అడవిలో వదలిరమ్మని పంపటం జరుగుతుంది. శిశు హనసంలో నియుక్తులైన భటులు అనివార్య కారణాల వల్ల శిశువును అడవిలో వదలివేసివచ్చి, చంపివేశామని వక్రకేతువు వద్ద బొంకుతారు.

మహేశ్వర వర ప్రసాదియైన ఆ శిశువును గొల్ల కొండడు (వల్లం రామ్మూర్తి) యాదృచ్ఛికంగా చూచి, ఇంటికి తీసుకుపోతాడు. గొల్లకొండడు అతని భార్య (హేమలత) సంరక్షణలలో శిశువు పెద్దవాడవుతాడు. పాటలీపురంలో రూపవతీ పుత్రత్రయం నిరర్థక రకుక్షులు, (అచ్చ తెనుగులో) వాజమ్మలు, చేతకాని చవటలుగా తయారవుతారు.

ఎలాగైనా అధికారాన్ని చేజిక్కించుకోవాలనే ఆశతో వక్రకేతువు ఉపసేనాని దుష్టబుద్ధి (కె. వి. యస్. శర్మ) తో కుట్రపన్ని, వేటకని వచ్చిన మహారాజును విష ప్రయోగంవల్ల అంధుణ్ణి చేస్తారు. గొల్ల కొండడు పెంచిన గుణవతీ పుత్రుడు ఆ సమయంలో అక్కడ కన్పించటం సాకుగా అతడే రాజాగారి పెద్ద భార్య కుమారుడనీ, ఆతణ్ణి చూచినందువల్లనే మహారాజులు అంధులయ్యారని నమ్మబలికి తమ్ము తాము రక్షించుకుంటారు. ఈ విషయాన్ని చాటు నుండి పొంచివింటున్న గుణవతీ పుత్రుడు ఇంటికి వెళ్ళి తన తల్లిదండ్రులు గొల్లకొండడు అతని భార్య కావట్లు తెలుసుకొని పాటలీపుత్రం చేర్తాడు.

చంద్రసేనులకు తిరిగి చూపురావాలంటే, ఏ లోకంలో ఎలా వుంటుందో ఎవరికీ తెలియని ఆ గులేబకావళి పుష్పాన్ని తీసుకురావాలని వైద్యులు చెప్పగా, రూపవతి కుమారులు అయోమయత్రయం (లంకాసత్యం, పేకేటి, పద్మనాభం) ఆ పుష్పాన్ని సాధించుకు వస్తామని బయల్దేర్తారు. కొండడు పెంచిన యువకుడు పాటలీపురంలో తన తల్లి పట్టపురాణి గుణవతిని కలుసుకొని విజయనామాంకితుడై, తాను కూడా గులేబకావళి పుష్పం తేవాలని బయల్దేర్తాడు.

గులేబకావళి పుష్పాన్ని తెచ్చేందుకు బయల్దేరిన రూపవతీపుత్రులు దారిలో విజయు (యన్. టి. రామారావు) నితో నేస్తం కలుపుతారు. ఈ నలుగురూ అలా బయల్దేరి ఓ రాజ్యం చేరుకుంటారు. జూదంలో తన్నోడించినవారికి జీవితమంతా తానూడిగం చేస్తానని ప్రతిజ్ఞ పట్టిన యుక్తిమతి (జమున) వంచకుతన అన్నలు పరాజితులుకాగా విజయుడు ప్రతి యుక్తితో మతి పోగొట్టి, ఆ చిన్నదాన్ని తన దాన్నిగా చేసుకొని, తను తిరిగొచ్చేదాకా విరహాబ్ధి నీదవలసిందని చెప్పి పుష్పంకోసం బయల్దేరి వెళ్తుండగా ఈశ్వరుడు సాధువుగా కన్పించి మణి ప్రసాదించటం, మణి ప్రభావంవల్ల విజయుడు గంధర్వలోకం చేరి గంధర్వరాజా (మిక్కిలినేని) కుమార్తె బకావళిని గాంధర్వ విధిన వివాహమాడి పిదప వలపించుకొని దొంగిలించుకుపోగా, ఆ పుష్పంవుండే బంగారు కొలను బుగ్గైందని విని, బకావళి (నాగరత్నం) విజయుల రాగ రహస్యం పసిగట్టిన గంధర్వపతి బకావళిని చెరలో ఉంచటం వరసగా, సరసంగా జరిగిపోతాయి.

గులేబకావళి పుష్పంకోసం బయల్దేరి, రూపవతీ పుత్రులు తపస్విని శాపంవల్ల శిలలుగా మారగా విజయుడు రక్షించటం, వారు మోసంచేసి పుష్పం విజయునినుండి ఎత్తుకుని పోతూ విజయుని మిత్రుడు అతితెలివి చేతిలో మోసపోవటం, విజయుడు ఒకానొక దేవకన్య ప్రభావంవల్ల గంధర్వలోకానికి పోయి గంధర్వపతిని మెప్పించి పుష్పం, బకావళితో సహా రాజధానికి వచ్చి వక్రకేతువును సంహరించటం జరుగుతాయి. ఆపైన ఈ రామాద్యయరాయుడు— "నారీనారీనడుమమురారి" "నారీ నారీనడుమమురారి."

నవరసాత్మకమైన కథకు రవికాంత్ నగాయిచ్ ఛాయాగ్రహణం వన్నెతెచ్చింది. అస్థిపంజరాలతో విజయుని పోట్లాట, లాంటి ప్రత్యేక సన్నివేశాలు ఈచిత్రంలో ప్రత్యేకాకర్షణలుగా తయారైయ్యాయి. కథను వ్యర్థగా కాకుండా కమ్మని కావ్యంగా రూపొందించగల స్తోమతు తమకుందని యన్. ఎ. టి. సంస్థ మరొకసారి ఋజావు చేసుకోటానికి కారణమైన శ్రీ రవికాంత్ నగాయిచ్ ప్రత్యేకంగా అభినందనీయులు.

దర్శకుని పేరు ఎక్కడా కన్పించకపోయినా నిర్వహించిన తీరునుబట్టి, నటనలోసాధక బాధకాలు బాగా అర్థం చేసుకొన్న, అనుభవశాలి ఐన నటుడెవరో దర్శకత్వం వహించి ఉండాలన్నభావం చిత్రం ఆద్యంతము కల్గిస్తుంది. విజయుడు గంధర్వపతి పరీక్షకు నిలిచే సందర్భంలో జానపదగేయం కాకుండా ఏదో ఒకటి రెండు శ్లోకాలు పాడించివుంటే



"మోహినీ రుక్మాంగద"లో మిక్కిలినేని.

చిత్రసమీక్ష

# మోహినీ రుక్మాంగద

'కీర్తనం కలౌయుగే' అన్నారు పెద్దలు. గోరూపిణియైన ధర్మదేవతను ఒంటికాలిమీదనే గెంతాలిందిగా శాసిస్తూ, ముక్తికన్నా భుక్తిరక్తులకే ఎక్కువ ప్రాధాన్యంఇచ్చే ఈ కలికాలంలో, లౌకిక విషయాలతో సతమత మౌతున్నవారు పుణ్యపురుషుల జీవితగాథలు కీర్తించి, విని తరించవలసిందని చెప్పే వాక్కుతో 'చూచి తరించం డనే' పదంచేర్చే ఉద్దేశ్యంతో, వీలైనన్ని సినీసరంజామాలను దంజాగాచేర్చి భాస్కర్ ప్రొడక్షన్స్‌వారు నిర్మించిన పౌరాణిక చిత్రం—"మోహినీ రుక్మాంగద".

కథాకథన ప్రమాదం అంత ప్రమోదం కలిగించేదికాదు. కనుక టూకీగా ఈ టాకీకథ ఇది.

నారదమహర్షి (కాంతారావు) ఆదేశంవల్ల అయోధ్యాధీశ్వరుడు రుక్మాంగదుడు (బాలయ్య) భార్యసంధ్యావళి (కృష్ణకుమారి), పుత్రుడు ధర్మాంగదునితో విష్ణుప్రీత్యర్థం ఏకాదశీవ్రతం తానాచరించి జనులచేతఆచరింపజేస్తాడు. మార్గంలో తన సత్కారాన్ని స్వీకరించకుండా, జనమంతా సరాసరి స్వర్గానికి చేరుకోవటంతో చిన్నబోయిన యముడు (మిక్కిలినేని) బ్రహ్మను వేడుకోవటం జరుగుతుంది.

బ్రహ్మ పనుపునవచ్చిన మోహిని రుక్మాంగదుని వలపించి వలచి, యముని కోపంవలన తన వలపుపై పునెట్టి కాఠిన్యం మలచుకొని, "ఏకాదశీవ్రతం మానటమో నీముద్దుల కుమారుడు ధర్మాంగదుని శిరస్సు కానుకగా అర్పించటమో చేయాలని" రుక్మాంగదుని నిర్బంధించటం, ఆడినమాటతప్పనని ప్రతినపట్టిన రుక్మాంగదుడు తన కుమారుని శిరస్సు ఖండించబోయే సందర్భంలో నారదుడు యమధర్మరాజుతో వచ్చి యమునిచే క్షమార్పణలు చెప్పించటం, విష్ణుమూర్తి సాక్షాత్కారం జరుగుతాయి. రుక్మాంగదుని కఠినంగా పరీక్షించినందుకు మోహిని క్షమార్పణ చెప్పుకోటం, రుక్మాంగదుడు సరేనని తలాడించుట ఇత్యాది సన్నివేశాలలో చిత్రం సమాప్తమౌతుంది.

మోహినిగా జమున, సంధ్యావళిగా కృష్ణకుమారి ఒకరికొకరు పోటీగా నటించారు. ఆద్యంతం నాటకీయంగా ఉన్న ఈ చిత్రంలో కృష్ణకుమారి ప్రశంసనీయమైన నటన చూపింది. విదూషక దంపతులుగా రేలంగి, సూర్యకాంతం, ప్రేక్షకులను గిలిగింతలు పెట్టారు. మిక్కిలినేని, బాలసరస్వతి కాంతారావు, ప్రభృతులు యథోచితంగా నటించారు. నటనకు పరిమితావేశమే ప్రధానమని బాలయ్య గ్రహించాల్సిన అవసరం ఎంతో కన్పిస్తోంది.

ఆరుద్ర, శ్రీ శ్రీ, రామకృష్ణశాస్త్రిగార్ల పాటలు సరసంగా సాగిపోయాయి. డి. వి. నరసరాజు సరస రచనారథం ఏకారణంచేతనో సాఫీగా సాగక మధ్యమధ్యలో గ్రాంధికపు ముళ్ళపొదలు, సమాసాల మిట్టలు ఎక్కి ప్రయాణం చేసినా పాత్రపోషణకు ఏమాత్రం ప్రతిబంధకంకాకుండా కొంతవరకు చిత్రవిజయానికి హేతువైంది.

పాత్రకల్పనలో కొంత నూతనత్వం గోచరిస్తోంది. మోహినీ రుక్మాంగద నాటకంలోని మోహినిలో ఉన్న హృదయ కాఠిన్యాన్నిఅరగదీయటంవల్ల ఈ చిత్రంలో మోహినిపాత్రకు కొంత మార్పు, మార్దవం కలిగి పాత్రకు వింతసొగసు కల్గింది.

పౌరాణిక కథ, కథానుగుణమైన సాహిత్యం, పాత్రపోషణం, ఘంటసాల సంగీతం ప్రత్యేకకాకర్షణలతో చిత్రం విజయవంతంకాగల ఈ చిత్రంలో సన్నివేశకల్పనల విషయంలో దర్శకత్వపు దార్ఢ్యం లోపించిందనే అభిప్రాయం అక్కడక్కడా కలిగినా ఇలాంటి చిత్రాల ముఖ్యోద్దేశ్యం, పుణ్యపురుష

# గులేబకావళి కథ

ఆ పాత్రకు కొంత కొంత ప్రౌఢిమ కూడా గాంభీర్యంలోపాటు ఏర్పడేది.

శృంగారరస భరిత సంగీతలహరిలో సి. నా. రె. సాహితీ నౌక సజావుగా, సరదాగా సాగిపోయింది. రచయిత భావాలలో బాంధవ్యంనెరపుతూ సంగీతాన్ని నిర్వహించిన జోసెఫ్, వేలూరికృష్ణమూర్తిల శ్రమ ఆద్యంతం ప్రతిఫలిస్తూనేవుంది.

చిత్రస్థాయికి తగినట్లుగానే సంభాషణల రచన సాగింది. క్షేమానవెళ్ళి, లాభాన రండి! లాంటి వింత ప్రయోగాలలో కొంత సిసలైన పామర వాతావరణాన్ని ప్రతిబింబిస్తూ, సముద్రాల (జూ) రచనాధుని, జల జలా పారేటి సెలయేటి తరగనురగలవలె మృదువుగా సాగి అలలు మరచి కలలపై—"బిగి కౌగిళ్ళ" వెల్లువై తేలి, సభ్యతా సుక్షేత్రాలను ముంచబోయి

మనకెందుకులే అని మానుకుని కథాంతసాగరానికి కదలిపోతుంది.

పితృభక్తి పరాయణుడు విజయుడుగా, కథానాయకుడుగా యన్. టి. రామారావు చిత్రంలో చక్కగా విహరించారు. నాయకి యుక్తిమతిగా జమున కథోచితంగా నటించింది. బకావళి పాత్ర ధరించిన కొత్త నటి నాగరత్నం, కొత్తబెరుకు వదలకపోయినా మున్ముందు పైకి వచ్చి సూచనలున్నాయి. లంకసత్యం పేకేటి, పద్మనాభం వింత హాస్యాన్ని అందించారు. కనులముందు నిలచేది కొద్ది 'రీళ్ళ' పాటే ఐనా, వల్లూరామూర్తి, హేమలతలు ప్రశంసనీయమైన నటన

చూపించారు. ప్రతి నాయకులుగా (విలన్) రాజనాల, కె. వి. యస్. శర్మలూ, ముక్కామల, ఋష్యేంద్రమణి, ఛాయాదేవి, శివరావ్, మిక్కిలినేని, మీనాకుమారి, బాలకృష్ణ, బాలసరస్వతి ప్రభృతులూ యథోచితంగా నటించారు.

కథానుగుణమైన సంగీతసాహిత్య సమ్మేళనం, కావ్యత్వ యోగ్యతను కల్పించే ఛాయా గ్రహణం గల ఈ చిత్రంలోనూ కొన్ని దోషాలూ ఆ భాష దోషాలున్నాయి. విజయుడు బకావళిని ప్రేమించే సన్నివేశంలో....

"ష్! రసపట్టులో చర్చ కూడదు!"

—నాగరాజ్,

కథా శ్రవణ సంకీర్తనల వల్లనేగాక వారి చరిత్రావలోకనం రూపేణా కూడా పాప దానానికి ఇంతముక్తి భుక్తిని ప్రసాదించటమే. కాలక్షేపం కావాలనుకున్నవారంతా బంధుమిత్ర సపరివారంగా చూడదగ్గ చిత్రం. ★

నాగరాజ్

## సినీ విహారం

14-వ పేజీ తరువాయి

తల్లితోబాటు ఆమె కూడా పరిగణించుకోలేదు.

ఆ మూడు ముళ్ళూ మెడలో పడిన తరువాత గాని సరోజకు వంట చేయవలసిన అత్యవసరం తెలియలేదు. పొయ్యిలు, కుంపట్లు, బొగ్గులు, కట్టెలు, మంటలు పొగలు వాటిమీద పాత్రలలో భోజన పదార్థాల పక్వాలు, పాకాలు అబ్బ! ఎన్ని కష్టాలు! అలాగే కష్టపడి సరోజ ఆనాడు తన భర్త రాజాకు వంటచేసి పదార్థాలను విస్తట్లో వడ్డించి ఆతురత భర్త భావాలను పరిశీలిస్తూ కూర్చుంది. రాజా చాలా తెలివైన భర్త, తాను కోరిన ఫలితాలను ఎదుటి వ్యక్తిలో ఆవ్యక్తియే స్వంతంగా తెలుసుకునేటట్లు చేయగల సమర్థుడు—రాజా.

ఆమె ఏవిధంగా వంటచేసినా కిమ్మనకుండా ఆరగించేస్తున్నాడు. ఆరోజు ఆమె ముందుగా ఆ కూరను రుచిచూసి అందులో సముద్రంపాలు ఎంత ఉన్నో ఇట్టే గ్రహించుకుంది సరోజ.

"అబ్బబ్బ! ఒక్కటే ఉప్పు" ఎలా తింటున్నారండి?" అని ఆమె తన భర్తను ప్రశ్నించకుండా ఉండలేకపోయింది.

"ఏం? బాగానేఉందే" అన్నాడు అమాయకంగా రాజా.

"అబద్ధం. నేను బాధపడతానని అలా అంటున్నారు. చేతగానివంట. మీరు కడుపునిండా తినడానికి కూడా లేదు." అని వాపోయింది సరోజ.

"వంట ముఖ్యంకాదు సరోజా! చేసిపెట్టేవాళ్ళ మనసు. ప్రేమతో పెట్టింది చేదైనా అమృతంతో సమానం" అని సమయస్ఫూర్తితో భార్యకు సందేశాన్ని అందించాడు రాజా.

ఈ మధురమైన సన్నివేశం విజయా ప్రొడక్షన్స్ చిత్రం "గుండమ్మకథ"కు చెందినది. రాజా సరోజలుగా నాగేశ్వరరావు, జమున లు నటించారు. ఈ చిత్రానికి నిర్మాతలు: నాగిరెడ్డి, చక్రపాణి. కథ చక్రపాణి, మాటలు: డి. వి. నరస రాజు, కామెరా: మార్కస్‌బార్ట్లే, సౌండ్ శివరామ్, కళ:గోఖలే, కళాధర్, దర్శకుడు: కె. కామేశ్వరరావు.

## రంగుల్లో రామరాజ్య వైభవం

"ఒనర్ఆన్"—ఇది కామెరామన్ ఆజ్ఞ.

విజయ వాహినీ స్టూడియోలో ఫ్లోర్‌నంబర్ సెవెన్‌లోకి అడుగుపెట్టేసరికి నాకు వినిపించిన మాటలివి. సెట్‌మాత్రం హెవెన్‌లా ఆనందానిచ్చే వనమే. కాని, అక్కడ జరిగే సంఘటనలు, చిత్రానికి అందుతున్న సన్నివేశం మాత్రం హెల్......కడుపు తరుక్కుపోయే విషాదకరమైన దృశ్యం.....



"మోహినీ రుక్మాంగద"లో జమున



"స్వర్ణగౌరి" చిత్రంలో కాంతారావు, కృష్ణకుమారి



కాల్గేట్ సంస్థకోసం గ్రాంట్ కంపెనీవారు తీసిన చిత్రంలో ఒక సన్నివేశం.

# సినీవిహారం

మహాసాధ్వి, మహారాజ్ఞి సీతాదేవి నిండు చూలాలు. ఆమెలో సౌందర్యం మాతృమూర్తి కాబోయే మాధుర్యం కనిపిస్తున్నాయి. ఏనాడో ఆమెకు మున్యాశ్రమాలను సందర్శించాలనే కోరిక కలగడం, దానిని ఈనాడు పతి శ్రీరాముడు నెరవేర్చడం జరుగుతోంది.

కాని, అది రాజారాముడు ఇచ్చిన ఆజ్ఞ అనీ, ఈ వన విహారం మరొక వనవాసానికి నాందికాబోతోందనీ ఆమెకు ఇంకా తెలియలేదు. ఆమెను అక్కడకు తీసుకు వచ్చిన లక్ష్మణుడు అన్నగారి ఆజ్ఞకంటె రాజాజ్ఞను శిరసావహించి నెరవేర్చవలసి వచ్చిందని కిన్నుడౌతున్నాడు.

"అన్నా లక్ష్మణా! ఇదేమిటి మనం దారితప్పలేదు కదా!" అని ఆ తల్లి సీత ప్రశ్నించింది మరదిని.

"నట్టడవికి పోయేవారికి దారీ తెన్నూ ఏమిటి తల్లీ!" అని జవాబిచ్చాడు లక్ష్మణుడు.

"అదేమిటి లక్ష్మణా! నీ ముఖము కళావిహీనమై చిన్నబోయింది. మీ అన్నగారికిష్టంలేని ఈ అరణ్య సందర్శనం కోరినందుకు నామీద కోపమా?" అని సీతాదేవి ఇంకా అమాయకంగానే ప్రశ్నించింది.

"ఎంతమాటతల్లీ! మాతృసమానురాలైన నీమీద కోపమా! కుసుమకోమలివైన నీ కష్టాలు తలుచుకుంటే......" అని ఇంక దాచుకోలేకపోయాడు విచారాన్ని లక్ష్మణుడు.

సీత ఆశ్చర్యపోతూ, "అదేమిటి లక్ష్మణా! అకారణంగా దుఃఖిస్తున్నావు?" అని అడగకుండా ఉండలేకపోయింది.

"నా పాపిష్టి జన్మకి దుఃఖంకాక సంతోషం ఎలా వస్తుందమ్మా?"

"అదేమిటి నాయనా! నా మనస్సు భయాందోళితమౌతోంది. ఎవరికే ఆపద వచ్చిందో చెప్పునాయనా!"

"ఎవరికో అయితే ఇంత దుఃఖిస్తానా తల్లీ!" అంటూ లక్ష్మణుడు యదార్థ విషయాన్ని పద్యంలో చెప్పాడు. "ఇంతకు బూనివచ్చి, వచియింపకపోదునే విన్ముతల్లి! దుశ్చింతులు—దైత్యుచేబడిన సీతను గ్రమ్మర నేలుచున్నవాడెంత విమోహిరాముడని యెగ్గులు పల్కిన నాలకించి, భూకాంతుడు నిందకోడి, విను, కానలలోపల డించి రమ్మనెన్."

ఒక్కసారి ప్రకృతి స్తంభించింది. సీతాదేవి మూర్ఛపోయింది.

లలితా శివజ్యోతివారు గేవాకలర్‌లో తయారు చేస్తున్న చిత్రం "లవకుశ"కు చెందిన ఈ ఘట్టంలో సీతగా అంజలీదేవి, లక్ష్మణుడుగా కాంతారావు చాల చక్కగా నటించారు......ఇంక "టెనర్" గురించి రెండు ముక్కలు వ్రాస్తాను.

గేవాకలర్‌లో చిత్రం షూటింగ్ జరగాలంటే స్టూడియోలో ఇద్దరు నిర్మాతలు రెండు సెట్లపై

ఉపయోగించే విద్యుచ్ఛక్తి ఈ ఒక్క చిత్రానికి కావలసి ఉంటుంది. ఎక్కువ విద్యుత్కాంతినిచ్చే లైట్ "బెనర్" అంటారు. ఈ బెనర్ కాంతిని సూటిగా చూడాలంటే చాలా కష్టం. అంతటికాంతి ఉంటేనే గాని గేవాకలర్ ఫిలిమ్‌పై చలన చిత్రానికి ఫోటోగ్రాఫ్ చేయడం సాగదు. బెనర్ బోలెడంత విద్యుత్తునిమింగి మెరపులాంటి కాంతిని వెదజల్లుతుంది.

1956 లో తెలుగులో పూర్తిరంగుల చిత్రం "అలీబాబా & నలభై దొంగలు" తయారైంది. తిరిగి గేవాకలర్‌లో ఈ "లవకుశ" తెలుగు, తమిళ భాషలలో తయారౌతోంది. వర్ణచిత్రం అంటేనే అధిక వ్యయ ప్రయాసలకు మారుపేరు. కాని, తెలుగు నిర్మాత శంకరరెడ్డి సర్వజనాకర్షణీయంగా ఉండే కథను ఎన్నుకుని సర్వ జనాదరణ పొందగల ధైర్యంతో "లవకుశ" చిత్ర నిర్మాణానికి నడుం కట్టాడు. ఇప్పటికి 13 రీళ్లచిత్రం తయారైంది. 1934 లో వెలువడిన "లవకుశ" చిత్ర దర్శకుడు సి. పుల్లయ్య ఈ చిత్రానికీ దర్శకుడు. సదాశివబ్రహ్మం మాటలు వ్రాశాడు. సంగీతం ఘంటసాల. కామెరామన్ పి. ఎల్. రాయ్. ఇంచుమించు తెలుగు చలన చిత్ర పరిశ్రమకు చెందిన ప్రఖ్యాత నటులందరూ ఈ గేవాకలర్ "లవకుశ" లో కనిపిస్తారు.

## పౌరాణిక నాటకంలో ప్రవరాఖ్యుడు

అది హిమాచల ప్రాంతంఅని ఆ సెట్‌మీద నిలబడిన నీలికొండలు, మంచుగడ్డలు చెబుతున్నాయి. కైలాసానికి సమీపమని సూచించడానికికాబోలు ఆ కొండల్లో చెక్కబడిన శివ విగ్రహం తలమీదనుంచి గంగాజలం ప్రవహిస్తోంది.



"సిరిసంపదలు"లో నాగేశ్వరరావు, రేలంగి.

ఈ సినిమా హోయినిగొల్పే సుందర ప్రకృతి ముందు వరూధిని విలాసంగా విహరిస్తూ, ప్రవరాఖ్యుణ్ణి సందర్శించింది. సరసాలు ప్రారంభించింది. అల్లసాని పెద్దనగారి పద్యాలు పలికాడు ప్రవరుడు. "ఎవ్వతె వీవు......"

"ఇంతలు కన్నులుండ" అని హేళన చేసింది వరూధిని. "ఎక్కడ యూరు కాల్నిలువదు" అని మోహం పెంచుకుని కూడా పలికిందామె.

అసలు మదనీడు వెళ్ళిన జాడల్లోంచే నకిలీ ప్రేమికుడు రాగానే వరూధిని మురిసిపోయింది. నకిలీ ప్రవరుడు డ్యూయట్ అందుకుంటూ ఆమె కోరిక ప్రకారం కవ్వించాడు.

"విరి పొదరిళ్ళ—బిగికౌగిళ్ళ
తేలియేలుతావో
వియోగాల ముంచిపోదువో!

"హిమనగరీ! మధురసూరి అను రాగ రాగమంజరీ"
అంటూ ఆమె ఆతని ప్రణయావేశాన్ని పంచుకున్నది.

ఈ ఆట, పాట, పద్యాలు సన్నివేశం శ్రీనివాస పిక్చర్స్ చిత్రం "టైగర్ రాముడు"లోనిది. పోలీసుల సహాయార్థం ఒక నాటక ప్రదర్శన జరిగింది. అందులో ఎన్. టి. రామారావు ప్రవరాఖ్యుడుగానూ, వరూధినిగా రాజసులోచన ఎనిమిది నిమిషాల పాటల పద్యాలతో ఈ నాటకాన్ని నిర్వహించారు. ఈ చిత్రానికి దర్శకుడు సి. ఎస్. రావు. నిర్మాత చిన్నారావు. కామెరా షణ్ముగం. రచన సముద్రాల జూనియర్. సంగీత దర్శకుడు ఘంటసాల, జానకి కలసి మను చరిత్రపద్యాల్ని, పాటల్ని పాడారు. స్టూడియో మెజస్టిక్. ★



ఆంధ్రనాటక కళాపరిషత్ గుడివాడలో ఇటీవల జరిపిన గేయనృత్య ప్రదర్శన పోటీలలో ప్రథమ బహుమతిపొందిన "అంబికా సిస్టర్స్" (బందరు) చి. సుప్రియ, చి. సావిత్రి.

## కథకానికథ పోటీ నిబంధనలు

(1) కవరుమీదగాని, కార్డుమీదగాని, ఇన్‌లాండు కవరుమీదగాని స్పష్టముగా 'కథకాని కథ పోటీకి' అని వ్రాయాలి.

(2) ఈ పోటీ కథలతో ఇతర రచనలను జత చేసిపంపకూడదు. పోటీకి అర్హతలేని రచనలు త్రిప్పి పంపబడవు. వాటిమీద ఉత్తర ప్రత్యుత్తరములు జరుపబడవు. కార్డులు జత చేసి పంపకూడదు.

# మనమూ–మన రాష్ట్రం

11వ పేజీ తరువాయి

కృష్ణానీటిని పెన్నలో కలిపి, అక్కడ రిజర్వాయరు నిర్మించి, ఒక కాల్వ త్రవ్వి మద్రాసు నగరం నీటిఎద్దడి నివారణకోసం నీటిని తీసుకొనిపోవచ్చని మాత్రం సూచించింది. అయితే అది ఆంధ్ర అవసరాలు తీరిపోయి, పూసర క్షేత్రాలుగా ఉన్న భూములు సాగులోకి వచ్చినతరువాతేగాని ఇప్పుడు కాదు. ఇంకా నాగార్జునసాగర్ ప్రథమదశే ముగియలేదు. రెండు మూడు దశలలో సిద్ధేశ్వరం, పులిచింతల ప్రాజెక్టులు నిర్మాణం కావలసి ఉన్నది. అవన్నీ పూర్తి అయిన తరువాత గాని మద్రాసుకు నీటిసరఫరాసంగతి రాదు. ఇంతకూ కృష్ణనీటితో సాగుకావలసిన భూములన్నీ సాగులోకి వస్తే, మద్రాసుకు సప్లయి చేయడానికి ఇంకా నదిలో నీరుంటుందా అని కూడా సందేహం ఉంది. అందుకని గోదావరి నీటిని కృష్ణలో కలిపితే, కృష్ణనీటిని కాల్వ ద్వారా మద్రాసుకు సప్లయి చేయవచ్చని ఒక ప్రతిపాదన వచ్చింది. ఇది రామపాదసాగర్ నిర్మాణ సంకల్పం కలిగినప్పటి నుంచి పరిశీలనలోనే ఉంది. ఇంకా ఒక రూపానికి రాలేదు. ముకునూర్‌వద్ద 425 ఎఫ్. ఆర్. ఎల్. డాం కట్టి 145 మైళ్ల పొడవున కాల్వ త్రవ్వి గోదావరిని కృష్ణలో కలపవచ్చని మహారాష్ట్రప్రభుత్వం ఈమధ్య ఒక సూచన చేసింది. ఇది చాలా వ్యయప్రయాసలతో కూడిన పని. అనేక సొరంగాలుకూడా త్రవ్వాల్సి ఉంటుంది. ఆంధ్రప్రభుత్వం ఆలోచించిన ఇచ్చంపల్లిస్కీము కూడా అంత అనుకూలంగా లేదు. కాలువలు లాగటానికి వీలుగా ఉన్న గోదావరి ఎగువ ప్రాంతంలో తగినంత నీరు లేదు. నీరుండే ఇచ్చంపల్లిప్రదేశంలో నైసర్గికస్థితి కాలువల త్రవ్వకానికి వీలుగా లేదు. కనుక డాం ఎక్కడ నిర్మించాలో తేలితేగాని, ఎంతనీరు మళ్లించవచ్చో, అందులో ఆంధ్రకు ఎంత కావలసి ఉంటుందో, పెన్నకాల్వద్వారా మద్రాసుకు ఎంత సప్లయి చేయవచ్చో తేలదు. ఏమైనా ఇది బృహత్తరమైన పథకం. 200 కోట్లు ఖర్చవుతుందని అంచనా. ఈ ఖర్చులో కొంత మద్రాసు భరిస్తుందా అంటే అది లేదు. 30 కోట్లు ఖర్చుతో కావేరి నీరు మద్రాసు నగరానికి మళ్లించవచ్చని ఇంజనీర్లు అంచనావేస్తే, అబ్బో యింత ఖర్చు భరించలేం, కేంద్రం ఉచితంగా యివ్వాలనేవారు, గోదావరి డైవర్షన్ పథకం ఏం భరిస్తారు. ఖర్చులేకుండా నగరానికి నీరు సప్లయి కావాలన్నదే మద్రాసు ప్రభుత్వం కోరిక.

శ్రీ నీలం సంజీవరెడ్డి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉండగా, ఆయన మద్రాసు వచ్చినప్పుడల్లా ఒక సన్మానం చేసి "మద్రాసుకు నీళ్ల మాటేమిటి" అని అడిగేవారు. ఆంధ్రుల అవసరాలు తీరినతరువాతే మీసంగతి అని ఆయన నిష్కర్షగా చెప్పలేక మెత్తబడటం యిప్పుడు ప్రమాదకరమైంది. ఆయన మెత్తదనంవల్లనే ఈ సమస్య దక్షిణమండలం సమావేశంలో పరిశీలనకు రావడం, దర్యాప్తుకోసం ఒక ఇంజనీర్ల సంఘాన్ని వేయడం తెలిసినదే. ఆ సంఘం నివేదిక సమర్పించిందికాని, అందులో అంశాలేమిటో వెల్లడికాలేదు. ఇంత వ్యవహారం నడవడంచేత, తమకు నిజంగా ఏదో కొంత హక్కు లేనిదే ఇది పరిశీలనలోకి వస్తుందా? హక్కు ఉండితీరాలి అన్న అపోహలో మద్రాసు ప్రభుత్వం పడింది.

కృష్ణా, గోదావరి నదీజలాల వివాదం అంకురించినప్పుడు, మద్రాసుమంత్రి శ్రీ భక్తవత్సలం 1951 ఒప్పందం విషయంలో ఆంధ్రను బలపరచారు. అప్పట్లో మద్రాసుకు ఈ నదీజలాలపై ఉన్న హక్కు ఎటువంటిదో ప్రస్తావించలేదు. తరువాత గుల్హాటీసంఘాన్ని నియమించినప్పుడు గాని, ఆ సంఘం రెండు, మూడు పర్యాయములు ఆంధ్ర, మైసూరులను సందర్శించినప్పుడు గాని మద్రాసు ప్రభుత్వం తమ హక్కుల సంగతి చూచాయగానైనా చెప్పలేదు. ఇప్పుడు తీరా గుల్హాటీసంఘం ఢిల్లీలో సమావేశమై నివేదిక తయారుచేస్తున్న సమయంలో తమకు కూడా ఈ నదీజలాలపై హక్కున్నదని, అది చారిత్రకమైనదని విజ్ఞాపన సమర్పించింది అంటే అందులో ఏదో కుంభకోణం ఉండిఉండాలి. ఆంధ్ర నదీజలాలకు గుల్హాటీ సంఘం, అందరికీ ఉదారంగా పంచిపెడుతోంది. అడిగితే తమకుకూడా లాభించేట్లుందని మద్రాసుప్రభుత్వం మేల్కొనైనా ఉండాలి. లేదా మైసూరు మహారాష్ట్రలతో చేతులు కలిపిన ట్లగుపిస్తే, మద్రాసు కోరే వాటా చాలా తక్కువ కాబట్టి, వెంటనే ఆంధ్ర ఒప్పేసుకుంటుందన్న భ్రమతోనైనా ఉండి ఉండాలి. గుల్హాటీసంఘం నివేదిక సంగతి ఎలా ఉన్నా ముందు మద్రాసుప్రభుత్వాన్ని పెనవేసుకున్న ఈ భ్రమ తొలగించడం అవసరం. ★

---

# హరివంశం

13-వ పేజీ తరువాయి

యొక్కడు తెల్లని తెలుపు. ఒకడు గర్భిణీమేఘమునుపోని వర్ణమువాడు. ఒక్కడు సూర్యుని కాంతి యంతయు తన శరీరమున గలవాడు. ఇద్దరును మదించిన గజముల నడకలు కలవారు. ఇద్దరును సింహము నడుములనుపోని నడుములు గలవారు. ఇద్దరును మందహాసవదనారవిందులు. ఇద్దరును పులులయొక్క చూపులను పోని కనుచూపులు కలవారు. ఇద్దరియందును అందము అనిర్వాచ్యముగ నున్నది. ఇద్దరును మనుష్యులును, మనుష్యులకు అతీతులున్నువలె నున్నారు. తన మనస్సులోని భావము, హృదయములోని ఆనందము, బుద్ధియందలి నిశ్చయత, అంతఃకరణమునందలి అనుభవము, మూర్తి కట్టినట్లు, ఆ భావమునకు, ఆనందమునకు, ఆ నిశ్చయతకు, ఆ అనుభవమునకు అందని రూపములు కలవారైనట్లు వారు ఆమెకు కన్పించినారు. వారి అందమును ఆమె కన్నులతో త్రావుచున్నదో! చెవులతో ఆలకించుచున్నదో! చేతులతో స్పర్శించుచున్నదో! త్వక్కుచేత ఆకర్షించుచున్నదో! మనస్సుచేత అనుభవించుచున్నదో! ఆమెకు ఆమెతప్ప ఇతరప్రపంచమే కనుపించుటలేదు. వారుతప్ప ఆమెకు ప్రపంచమే లేనట్లులున్నది. ఆమెమనస్సు ఆలోచించుటలేదు. సంకల్పించుటలేదు. కన్నులు చూచుటలేదు. చెవులు వినుటలేదు. వారిని తాకిన గాలి తనమీదకు రాగా, తన కురులను, ముంగురులను ముఖమును, కన్నులను, పెదవులను, చుబుకమును స్తనవల్కలావరూఢములైన కుచకుట్మలములను, తన తన సర్వశరీరమును స్పృశించగా, ఆమె పొందిన ఆనందము, పొందుచున్న ఆనందము, ఆమెకే అర్థమగుటలేదు. ఆమె ఏదో జగత్తులో నున్నది. అక్కడ ఆకృతులు లేవు. నామధేయములులేవు. లింగవిభేదములు లేవు. సర్వము ఒక్కటియై, ద్వితీయమనునది లేని, అద్వితీయమైన, అద్వయమైన, విచిత్రమైన జగత్తులో, రసజగత్తులో నామె అనుభవము పొందుచున్నది. ఇట్లు తాను పొందుచున్న అనుభవస్వరూప మామెకు తెలిసినదా! ఆమె అనిమిషయైనది. శమించిన ఇంద్రియములు కలదైనది. వాక్కు వివర్తింపబడినదైనది. స్పర్శ తెలియనిది, మనస్సుచేత పొందరానిదియైన స్థితిలో నున్నది.

ఆమెకు ఒడలు తెలియుటలేదు. మాట విన్పించుటలేదు. వచ్చినవా రిద్దరును ఏక కంఠముతో "భిక్షాం భవతి" అని పల్కిరి. ఆ మాట గూడ ఆమెకు విన్పించలేదు. ఆమెకు విన్పించినది ఆమె హృదయములో అమృతమధువులొల్కిన ధ్వని. ఆ ధ్వని మేఘగర్జనను పోనిది, చంద్రుని కన్న చల్లనైనది, సుఖమునిచ్చునదిగా నున్నది. మందిరములలో మహారాజు ఆ ధ్వనిని విన్నాడు, వాకిటిలోనికి వచ్చినాడు. వచ్చిన ఇద్దరను చూచినాడు.

"తండ్రీ! ఎన్నినాళ్లకు! ఎన్ని నాళ్లకు! మను దేవునియందు చూపని దయను నాయందు చూపినారు. కృతార్థుడను" అనినాడు.

అప్పుడుగాని ఆయనయు సుదక్షిణను చూడలేదు. చూచినదే తడవుగ నాశ్చర్యపోయినాడు. ఆమెదృష్టి శ్రీకృష్ణునియందు లగ్నమైనదా! బలరామమూర్తియందు లగ్నమైనదా! ఎవ్వరూ చెప్పలేని స్థితి యది. శ్రీకృష్ణుడు మందహాసము చేసినాడు. సుదక్షిణ మందహాసము చేసినది. బలరామదేవుడు మందహాసము చేసినాడు. సుదక్షిణ మందహాసము చేసినది. శ్రీకృష్ణబలరాములు యౌగపద్యముగ మందహాసము చేసినారు. సుదక్షిణ మందహాసము చేసినది. ఆమె కన్నులు, ముఖము, సర్వశరీరము వికసించిన పుష్పమువలె మందహాసముచేసినట్లు లున్నవి.

శ్రీకృష్ణదేవుడు "సుదక్షిణే!" అనినాడు.

సుదక్షిణ "స్వామి!" అన్నది.

మేలుకొన్నది.

ఆనందనామకములైన లోకములు ఒక్కసారిగా ఆమెకన్నులముందు సురిగిపోయి, తాను మరల ఈ ప్రపంచము పడినట్లు అనిపించినది. సుదక్షిణ కన్నులలో నీరు చిందినది. భగవంతుడు విచారసూచిమందహాసముఖారవిందుడైనాడు.

"భిక్షాం భవతి దేహి" అనినాడు. ★

తాతగారు 'ఈ సైకిలును యింత జాగ్రత్తగా ఎందుకు వాడుతున్నానో తెలుసుటే సుందూ! ఇది నా మనుమడి హయాంవరకూ చెక్కు చెదర గూడదే!' అనేవారు. అందుకే మీ నాన్నను గూడా ముట్టుకోనిచ్చేవారు కాదురా! నామాట విని ఆసైకిలు (మా బామ్మభాషలో బైస్కోలు) తీసి వాడుకోరా!' అన్నది బామ్మ. అంత ప్రేమగా చెబుతున్న మా బామ్మమాటను కాదనలేక పోయాను. పైగా ఏ మూలనుండో మా తాత గారు నా కోర్కె తీర్చవుట్రా రామీ అని అడిగిన ట్లుంది. అందుకని వేరే ఆలోచన లేకుండా ఆసైకిలును అతి ప్రయాసమీద అటకుమీదనుంచీ క్రిందకు దింపి వో షాపులోకి తీసుకెళ్లి బాగు చేయించాను. ఆ షాపువాడు 'రంగువేయించండి పంతులుగారూ!'' అన్నాడు. ఆ సమయంలో చేతిలో తగినంత తైలం లేనందువల్ల మామూలు గానే బాగుచేయించాను. ఆనాటినుండీ యీనాటి వరకూ అలాగే వాడుతున్నాను. మధ్య మధ్యే ఏవైనా చిన్న—చిన్న రిపేరులు వచ్చినప్పటికీ—దాని దారే వేరు .... సైకిళ్ల చరిత్రలోనే నా కళ్యాణి వొక ప్రధానపాత్రరా! కాదంటారా?'' అంటూ సుదీర్ఘోపన్యాసంతో మిత్రవర్గం నోరు మూయించే వాడు రామన్నపంతులు.

ఆయన వాక్చాతుర్యానికి ఇల్లాంటి ఉపన్యా సాలుకూడా ప్రముఖ తార్కాణాలు ...

ఆ ద్విచక్ర శకటపు అకారాది విషయసూచికను సంక్షిప్తంగా పృచ్ఛిస్తాం.

దాని రంగు ఏ కోవకు చెందినదో పోల్చి చెప్పడం ప్రముఖ చిత్రకారులవల్లకూడా కాదు. మావల్ల అయినంతమట్టుకు చెప్పక తప్పదు కదా!

దశాబ్దాలతరబడి — స్వశక్తిమీదే పనిచేస్తూ, శాతుతో పనులు చేయించే తన అనుభవాన్ని ప్రద ర్శించడానికా అన్నట్లు నిలువెల్లా తుప్పు వస్త్రం ధరించింది .....

చిరకాల మన్నికకు తార్కాణంగా అక్క డక్కడా రంధ్రాలతో ప్రకాశిస్తున్న మృద్రక్షికలు.

నామమాత్రావశేషంగా మిగిలియున్న ఇనుప చక్రాలు—చక్రాలకు చుట్టూ రబ్బరుటైర్లూ —చిరిగిన దిండులాంటి సీటు .... యింకా దాదాపు అంతా శిధిలసామగ్రి ....

వీటన్నిటి కదలికవల్ల ఏర్పడే శబ్దం జానపద చిత్రాలలో సస్పెన్సుఘట్టాల్లో వినిపించే మ్యూజిక్కు .... ఆ శబ్దం అక్షరరూపంలో "బుర్ బుర్—డుబు డుబ్బు—టప్ టాప్—కిర్ కిర్ .... ''అన్నట్లూ—

ఉచ్చస్థాయిలో ధ్వనిస్తున్న వాయులీన వాద్యం లోని శ్రుతి తప్పినప్పటి ధ్వనులు.

జోరున కురిసే వర్షపు హోరు—ఇంకా రక రకాల వింతధ్వనులు వినిపిస్తాయి.

ఏరోజునైనా రామన్నపంతులు తన వాహనం మీదెక్కి రోడ్డుమీన వెడుతుంటే—

ఎంత బిజీగా ఉన్నవాళ్ల నోటినుండైనా, ఆ వెళ్లేది రామన్నపంతులు కదూ!'' అనే మాట తప్పనిసరిగా వస్తుంది.

ఇంతేకాకుండా ఆయన ఉద్యోగంకూడా

# ముక్కు పొడి...

9-వ పేజీ తరువాయి

ఆయన కొక ప్రత్యేకత ఆపాదించింది. ఆయన పెళ్లిళ్లరామన్న కూడా.

బద్ధవిరోధుల పట్టుదలలు సడలించడంతో రామన్నపంతులు చూపించే చాతుర్యం ఆయన తాతగారి గుణాలనుండి సంక్రమించినదే!

అలా జరిగిన పెళ్లిళ్ళు ఆ చుట్టు ప్రక్కల చాలా ఉన్నయ్.

అతని మిత్రులు అనుకుంటూ వుంటారు. "ఆ చాతుర్యం రామన్న పంతులుకి గాడ్స్ గిఫ్టురా!' అని.

ముసలీ ముతకా జనం "అతనికేం! చాలా మంచివాడు .... మాటకారి .... పరోపకారి'' అను కుంటూ ఉంటారు.

"ఏదైనా యీ యుక్తులు అతనికి ఆ సన్యమూ —పంచకళ్యాణి ప్రసాదించినవే నేమో!'' అనే వారు కొందరు హాస్యప్రియులు—

ఏదైనా రామన్నపంతులు మొత్తానికి కీర్తి సంపాదించుకున్నాడు.

ఒకసారి అతడ్ని చూసినవారు అంత తేలికగా మరచిపోలేరు. కారణం యింకోటుంది.

సరిగ్గా చెప్పాలంటే ఆయన ఎత్తు అయి దడు గుల నాలు గంగుళాలు .... అంటే దాదాపు పొట్టివా డన్నమాట.

విశాలమైన ఫాలభాగం .... తాబేలు వీపుచిప్ప వంటి ఆకారంగల శిరస్సున అక్కడక్కడా ప్రాకృతిక ధర్మా న్ననుసరించి కలగాపులగమై వింతగోలు పుతూ తెలుపూ—నలుపూ శిరోజాలు దృగ్గోచర మవుతాయి.

వాటి మధ్యన—అసంఖ్యాక తారకా చకోరాల మధ్యన ప్రకాశించే పున్నమిచంద్రునివంటి— పొడవైన శిరోజ బంధనం. దానికే మరో నామాం తరం వాడుకభాషలో పిలక.

చల్లని మందమారుతం తాకిడికి అల్ల నల్లనూ తలూగించే వృక్షశాఖలా ఆ పిలక కదుల్తూంటే అదొక వింతదనం ....

ఆయనమాట బహు విచిత్రంగా ఉంటుంది. అసలే నస్యం పడుతూంటాడేమో .... అందుకే కాబోలు ఆమాట నూతిలోంచి ఫీపెడుతున్న ట్లుండేది.

ఆయన నడకలో వంపులూ, కదలికలూ నపుంస కులను పోలియుండేవి. అదొక్క ప్రత్యేకత. ఏది ఏమైనప్పటికీ రామన్నపంతులికి ఎవరు తెలిసినా తెలియక పోయినా ఆయనమాత్రం అందరికీ తెలుసు.

అందుకే ఏ పిల్లవాడి నడిగినా ఆయన్ను గురించిన పూర్తివివరాలు సవిస్తరంగా చెప్తుతూ ఉంటారు.

అదీ ఒక వరమే నేమో!

* * *

సామాన్యంగా అంటే రామన్న పంతులు దైనిక చర్యలతో పార్కుకి పోయి చీకటిపడేవరకూ





# ముక్కు పొడి...

కూర్చుని ఇంటికి చేరుకోవడం ఒక ప్రధాన ఘట్టంగా భావించబడుతూ ఉంటుంది.

అసలు రామన్నపంతులు సృజనాశక్తి ఇనుమడించ డానికి ముఖ్యకారణం సంధ్యాసమయాలలో పార్కులో ఒక గంటపాటు పర్యవేక్షించడమే.

అతి విశాలమైన ఆ పట్నంలో మధ్యగా అత్యంత సుందరంగా ఉండే ఆ పార్కులోకి అనేక రకాల వెన్నెల విసనక్రరలూ, జంటలూ, ఒంట రులూ, తెల్లముఖాలవారూ, ఎర్రముఖాల వారూ, నవ్వేముఖాలు, నవ్వబోయి ఏడ్చేవారూ, ఏడుస్తూ నవ్వేవారూ .... రకరకాలు—

ప్రేమించుకున్నవారూ, పెళ్లి చేసుకుని ప్రేమించా లనుకున్నవారూ, పెళ్లికాకుండానే ప్రేమించు కుంటూ ఉండేవారూ, ప్రేమింపబడాలని తాప త్రయపడేవారూ—

ఏమీ తోచనివారూ, తోచీ తోచకుండా ఉండే వాళ్ళ—

వాళ్ళందరినీ ఏకరువుపెట్టడం ప్రారంభిస్తే, వో అంతూ, పొంతూ లేనిదీ, అదోలా ఉండేదీ, ఏదోలా ఉండేదీ అయిన మహాగ్రంథ మవుతుంది వేయి పడగల్లా! ......

రామన్నపంతులు ముఖ్యంగా అక్కడి కెందుకు వస్తున్నాడూ అంటే .... క్రొత్త క్రొత్త కథా వస్తువుల అన్వేషణ కోసం ....

తొంభై తొమ్మిదిపాళ్ళు ఆ అన్వేషణ ఫలిం చడం కద్దు ......

ఆరోజున సాయంకాలం యథావిధిగా పార్కులోకి అడుగుపెట్టిన రామన్నపంతులు గేటులోనే నిల బడి—ముక్కునిండా నస్యం గట్టిగా పట్టించి వోసారి తన్మయత్వంతో నలువైపులా కలయ జూచి ఒక్క పెట్టున ఉలిక్కిపడ్డాడు ....

ఏమిటీ .... వింతల్లో కల్లా వింత ?

ఉత్తర దక్షిణ ధృవాలు పరస్పరం ఆకర్షించు కోవడం జరుగుతుందా ?

రామన్నపంతులు 'ఆ' దిశగా అడుగులు వేశాడు.

హాయిగా పచ్చికమేస్తున్న లేళ్లజంట పులిని చూచి బెదరినట్లుగా—ఆనందంగా హృదయాలు విప్పి మాట్లాడుకుంటున్న ఆ ప్రేమికుల జంట రామన్నపంతుల్ని చూడగానే భయంతో కంపించి పోయారు.

వారి భయాన్ని చూచి లోలోన నవ్వు కుంటూ—వా రిద్దరికీ వో అడుగున్నర దూరంలో ఉస్సురంటూ కూలబడి "కాలం మారిందిరా! నాయనా! అయినా కాలంతోపాటు—పాత పగలూ చల్లారాలి గదురా ?" అన్నాడు—సుబ్బారావు వైపు చూస్తూ ....

సుబ్బారావు గుటకలు మింగాడు.

"నమస్కారం బాబాయి!" అన్నాడు నూతి లోంచి మాట్లాడుతున్నట్లు.

"స్వీకరించక తప్పదురా సుబ్బులూ! అయినా యీ రోజుల్లో భక్తితో వస్తున్న నమస్కార ముల్ని కాలదన్నుకునే సన్యాసి ఎవ్వడా పృథివిలో ..." అన్నాడు రామన్నపంతులు.

సుబ్బారావు తబ్బిబ్బయ్యాడు.

రామన్నపంతులు—సరోజవైపు చూస్తూ "ఏమ్మా! మీ నాయన కులాసాగా ఉన్నాడా? ఈమధ్యేదో జ్వరం తగిలిం దనుకున్న ట్లున్నారు!" అంటూ పలుకరించాడు.

"కులాసాగానే ఉన్నారు మామయ్యా!" అంది సరోజ.

కొన్ని క్షణాలు వారి మధ్య నిశ్శబ్దం తాండవించింది.

"అన్నట్లు మీ రిద్దరూ ఒకే కాలేజీలో చదువు కుంటున్నారుకదూ! బాగా చదువుతున్నట్లే ఉంది పరిస్థితి చూడగనే!" అన్నాడు పంతులు వ్యంగ్యంగా—నిశ్శబ్దాన్ని చీలుస్తూ.

తలూపాడు సుబ్బారావు.

"చూడరా సుబ్బులూ! మీ నాయన దేవాంతకుడు .... ఆయనదృష్టిలో పగలకున్న విలువ ఎంతో నీకేం తెలీ దనుకుంటాను." రామన్న పంతులు మెల్లగా అన్నాడు.

"తెలుసు బాబాయి!" అన్నాడు సుబ్బారావు.

"తెలిసే యింత సాహసానికి దిగావంటే నేను నమ్మలేకుండా ఉన్నాను సుమా!"

"సరోజను ప్రేమించాను బాబాయ్!"

రామన్నపంతులు కిసుక్కున నవ్వాడు. ఆయన నవ్వే తీరు సరోజనుకూడా నవ్వించింది. నోటికి పైటచెరగు అడ్డుపెట్టుకుంది.

"అప్పుడే ప్రేమించడం ఇంకాస్సే పొగితే పెళ్లి చేసుకుంటాననడం కూడా జరుగుతుంది నాకు తెలుసు. అయినా ఇది సాధ్యమే నంటావా? మీ పెద్దలమధ్య మీరు పుట్టకముందునుండీ ఉన్న పగలు ఏమవుతాయిరా?" సుబ్బారావూ — సరోజ ముఖ —ముఖాలు చూచుకున్నారు.

"దాన్ని గురించి మీరు ఆలోచించుకోలేదా. ఏమ్రా!" ప్రశ్నించాడు రామన్నపంతులు.

ప్రేమికు లిద్దరూ సమాధానమియ్యలేదు.

"అబ్బాయ్! అదీ విషయం! అన్నట్లు మరచాను. నాకు బజార్లో అర్జంటు పనొకటుంది .... వస్తాను" అంటూ లేవబోయాడు రామన్న పంతులు.

"వెడతావా బాబాయ్!" అన్నాడు సుబ్బారావు నీరసంగా!

వెళ్లక చేసే దేమున్నదోయ్!" పంతులు సమాధానం.

"మాకు మార్గం చూపించడం నీ బాధ్యత కాదా! బాబాయ్!" సుబ్బారావు జాలిగా అన్నాడు.

రామన్నపంతులు నవ్వాడు.

"నాయనా! మిమ్మల్ని చూసీ—చూడనట్లుగా తప్పుకుపోయినట్లయితే ఇలాంటి బాధ్యతలు నెత్తినపడకుండా ఉండేవి .... క్షేమసమాచారాలు కనుక్కుపోదామని వచ్చినందుకు బాగా శాస్తి చేశావురా!" అన్నాడు.

'అదేంమాట బాబాయ్! ఏదో పిన్నవాళ్లం—ప్రేమించుకున్నాం .... మా పెళ్లి నిర్విఘ్నంగా కొనసాగేందుకు మీబోటి పెద్దల సహకారం కూడా కావాలికదా! అందుకే నిన్నింతగా ప్రతిమాలుకుంటున్నాను" అన్నాడు ప్రాధేయపూర్వకంగా సుబ్బారావు.

"సరే! నీ పద్ధతి బాగానే ఉంది .... అయితే ప్రేమించేముందు నీకీ ఆలోచన లేదా? సమయం మించాక మీ వాళ్లు ఒప్పుకో కుంటే .... ఏంచేస్తావు?" అడిగాడు రామన్నపంతులు.

"మా వాళ్లు నా కోరికను కాదనరు బాబాయ్!" అన్నాడు దృఢవిశ్వాసంతో సుబ్బారావు.

"ఒకవేళ ఒప్పుకోకున్నా అనుకో!"

"నాకు చదువుంది బాబాయ్. నన్నూ—సరోజను పోషించుకునే తెలివితేట లున్నాయి. ఎక్కడో అక్కడ ఉద్యోగం దొరక్కపోదు."

"ఈ రోజుల్లో ఉద్యోగం దొరకడం నువ్వను కున్నంత తేలికేమీ కాదు. ఎక్కడ చూసినా లంచాలూ, రికమండేషన్లూ .... యీ రెండూ లేనిదే నువ్వేమీ సాధించ లేవు. తెలిసిందా?" అన్నాడు రామన్నపంతులు వ్యంగ్యంగా.

సుబ్బారావు తెల్లముఖంవేశాడు.

రామన్నపంతులు గంభీరంగా నవ్వుతూ సరోజ మొహంలోకి చూశాడు.

సరోజ నిస్పృహయంగా చూస్తూ ఉండిపోయింది.

"బాబాయ్! మే మిద్దరం పరస్పరం విడిచి ఉండటం దుర్లభం. ప్రతికూలమైన పరిస్థితులు రాకుండా మమ్మల్ని కాపాడే భారం నీది! ఇంతకంటే వివరంగా ఏమీ చెప్పలేను ...." అన్నాడు సుబ్బారావు.

రామన్నపంతులు కొన్ని క్షణాలపాటు తీవ్రంగా ఆలోచించి "ఏమమ్మా! సరోజా! నీ మాటేమిటి" అనడిగాడు.

"బావమాటే నా మాట మామయ్యా!" అంది సరోజ.

"ప్రయత్నిస్తాను .... వస్తాను ...." అంటూ రామన్నపంతులు లేచి నిలబడ్డాడు. అక్కడినుండి కదలబోయినవాడల్లా ఆగిపోయి "అన్నట్లు అడగడం మరచాను .... మీ రిద్దరికీ యీవేళప్పుడు యీ పార్కులో కలుసుకునే అవకాశం ఎలా దొరికిందీ అంట ...." అనడిగాడు.

"కాలేజీలో వార్షికోత్సవాలు జరుగుతున్నాయి. అక్కడికని పేరుపెట్టి .... ఇక్కడికి వచ్చాం బాబాయ్!" అన్నాడు సుబ్బారావు సిగ్గుపడుతూ.

"అయిందీ! ఇంకేం .... వ్యవహారం చాలా దాకా వచ్చేసిందన్నమాట ...." అంటూ పార్కులోంచి బైటికి నడిచాడు రామన్నపంతులు.

సుబ్బారావూ, సరోజా ఆయన వెళ్లినవైపు సాలోచనగా చూస్తూ ఉండిపోయారు.

* * *

ఆ వార్త ఊరంతా వ్యాపించడాని కెంతేని సైము పట్టలేదు.

అంటే దాదాపు రాకెట్ వేగంతో సర్దిశలా వ్యాపించిం దన్నమాట ....

"అయ్యో! ఎంతపని జరిగింది?" అని ముక్కుమీద వేలేసుకున్నారు కొందరు.

"అస లెలా జరిగిందబ్బా! ఏనాడూ లేదు!" అని తర్కవాదం మొదలెట్టారు కొందరు.

"అంత ఆశపడ్డవాడెవడంట!" అన్నారు మరికొందరు.

# పుక్కా పొడి...

"నిజంగా ఇలా జరగటం ఆయన దురదృష్టం" అని విచారం వ్యక్తం చేశారు కొంతమంది.

"ఈ దెబ్బతో ఆయన కుడిభుజం పడిపోయినట్లే ...." అన్నారు మరికొందరు.

"అన లాయన జాతకచక్రమే మారిపోయింది!" అనుకున్నారు ఇంకా కొందరు.

"కాలం ఎప్పుడూ ఒకేమాదిరిగా ఉండదు కదండీ !" అన్నారు కొందరు వేదాంతులు.

ఆ వార్త వినగానే ఒక్క క్షణంపాటు ప్రకృతి స్థంభించిపోతున్నదా అనిపించేటంత సంచలనం చెలరేగింది ......

అసలు విషయం ఏమిటంటే.

రామన్నపంతులు పంచకళ్యాణి పోయింది.

పోష్టాఫీసుగోడకి అనించి లోపలికి వెళ్ళి ఓ కార్డు వ్రాసి డబ్బాలో వేసి బైటికి వచ్చి చూసేసరికి సైకిలు లేదు.

రామన్నపంతులుకి మూర్ఛ రాబోయి ఆగిపోయింది.

"ఏమండీ ! నా సైకిలును చూశారా మీరు !" అని అక్కడ కనిపిరేచిన ఓ అపరిచితవ్యక్తిని ప్రశ్నించాడు రామన్నపంతులు.

"నేను చూడలేదండీ !" అన్నా డతను.

రామన్నపంతులుకి కంగారెక్కువైంది. ఒళ్ళంతా వొణుకుతోంది.

అప్పుడే ఏదో పనిమీద బైటికి వచ్చిన పోస్టుమాస్టర్ ఆయన కంగారును చూసి, "ఏమిటండీ పంతులుగారూ ! కంగారుపడుతున్నారు .... ఏం జరిగింది ?" అనడిగాడు.

"ఏం చెప్పమంటారు ? నా సైకిలు పోయిందండీ !" అన్నాడు రామన్నపంతులు.

"అయ్యో ! అలాగా !" అన్నాడు వస్తున్న నవ్వును ఆపుకుంటూ.

పోస్టుమాష్టరు నవ్వును ఆపుకోబోతున్నట్లు కనిపెట్టి "ఎందుకండీ ! నవ్వుకుంటారు ?" అన్నాడు రామన్నపంతులు కోపంగా.

"ఎవడో అవసరంవచ్చి వేసుకుపోయుంటాడు. కంగా రెందుకండీ ! ఆ సైకిలుకి ఆశపడేవా డెవడండీ !" అన్నాడు పోస్టుమాష్టర్.

అవును తన సైకిలుకి ఆశపడేవా డెవడు ? పోస్టుమాష్టర్ అన్నట్లు ఎవడో అవసరంవచ్చి వేసుకెళ్లింటాడు.

కాని .... కాని చెప్పకుండానా ? అలాంటి పెద్దమనుషులుంటారా ?

కాదు .... ఇది తప్పకుండా దొంగవనే అనుకుంటూ రామన్నపంతులు ఆ వీధిలో యీ చివరనుంచి ఆ చివరవరకూ ఒకటికి నాలుగు సార్లు తిరిగి సైకిల్‌ను గురించి ఎంక్వయిరీ చేశాడు. కానీ ఆచూకి దొరకలేదు.

ఇంతలో మిత్రులు కనిపించారు.

కళ్లనీళ్ళు తుడుచుకుంటూ, "ఒరే ! నా కళ్యాణి పోయిందిరా !" అన్నాడు రామన్నపంతులు విచారంగా.

"ఏమిటీ ! విపరీతంగా ఉందే !" అంటూ ముక్కున వేళ్ళు వేసుకున్నారు మిత్రులు.

ఏం చెయ్యమంటారురా !"

"చేసేదేముందిరా ! వెంటనే వెళ్ళి పోలీసు స్టేషన్‌లో రిపోర్టు చెయ్యి ...." అన్నాడొక మిత్రుడు.

"అయితే నే నక్కడికి వెళ్తోన్నాను .... యీ లోపుగా మీరు అక్కడా యిక్కడా వాకబు చెయ్యండి ...." అన్నాడు పంతులు స్టేషనుకు పరుగులుతీస్తూ.

స్టేషనులో అడుగు పెట్టగానే ఇన్‌స్పెక్టర్, "రండి పంతులుగారూ ! ఎందు కలా కంగారు పడుతున్నారు ? ముం దిలా కూర్చోండి" అన్నాడు.

ఉస్సురమని కుర్చీలో కూలబడి "ఇంకేముం దండీ ! నా కుడిచెయ్యి విరిగి ముక్క లయ్యింది" అన్నాడు.

"విషయ మేమిటండీ !" అనడిగాడు ఇన్‌స్పెక్టర్.

"నా సైకిల్ .... పోయిందండీ ...." అన్నాడు పంతులు.

"ఆఁ .... ఏమిటీ విపరీతం ! మీ సైకిలేమిటి ? పోవడమేమిటి ?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ ఆవలిస్తూ.

విలువైన నగలూ—కరెన్సీ, బిందెలూ, కంచాలూ బట్టలూ కాజేసే దొంగలనైతే చాలామందిని చూశాడు కానీ, అలాంటి డొక్కు సైకిలును కాజేసే దొంగను చూడలేదు ఇన్‌స్పెక్టర్. అందుకే అంత ఆశ్చర్యపడ్డాడు.

"పోగూడదండీ నా సైకిలు ! కాని పోయింది ... ఎలాగైనా మీరు నా సైకిలును నాకు దక్కించాలి." అని ప్రాధేయపడ్డాడు. రామన్నపంతులు.

"అలాగేనండీ ! మీ సైకిలు నెంబరెంత ?"

"నెంబరు ఏనాడైనా చూశానా చెప్పండి !"

"పోనీ సైకిలు పేరైనా చెప్పండి !"

"అదీ చెప్పలేను ! అది ఇప్పటిదా ? రెండు తరాలనాటిది ! అప్పటినుండీ ఇప్పటివరకూ ఎన్ని జాతుల సైకిళ్ల సామానులు ధరించిందో ఏం చెప్పను ?"

"సరే .... మీ సైకిలు నాకు బాగా తెలుసు. ఎలాగైనా వెతికి పట్టుకొస్తాను .... మీరు నిశ్చింతగా ఉండండి .... అన్నట్లు .... వెళ్లి ఓసారి పూరంతా తిరిగి ఇనుపకొలుముల్లోనూ — ఇనుప సామానులు అమ్మే షాపుల్లోనూ వాకబుచెయ్యండి .... తరువాత మేముకూడా దర్యాప్తు చేస్తాము" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అలాగేనండీ ! ఎలాగైనా మీరు నా వస్తువును నాకు దక్కించాలి .... వెళ్తోన్నానండీ !" అని శెలవుతీసుకుని బైటపడ్డాడు.

ఇక అక్కడనుండీ బైలుదేరి ఊళ్లో ఉన్న కొలుములకు—ఇనుప కొట్లకూ అన్వేషణకు బయలుదేరాడు.

చీకటి పడింది .... తిరిగి—తిరిగి కాళ్లు బలపాలు కట్టినై .... నిరాశతో — నిస్పృహతో ఇంటి మొహం పట్టాడు రామన్నపంతులు.

గుండెల్లో ఏదో దిగులుగా ఉంది. ఉండదూ మరి .... దశాబ్దాలతరబడి వదలకుండా ఉన్న అమూల్యవస్తువు హఠాత్తుగా మాయమైపోయినందుకు బాధకలగటం ఎవరికైనా సహజమే !

ఇంట్లో అడుగుపెట్టాడు.

"ఏమండీ ! సైకి లేదండీ !" అనడిగింది సీతమ్మ.

"ఇంకెక్కడి సైకిలే ! ఎవడో తన్నుకుపోయాడు." అన్నాడు గద్గదికంగా రామన్నపంతులు.

సీతమ్మ మ్రాన్పడిపోయింది. కొన్ని క్షణాలకు తేరుకుని "అన్నట్లు చెప్పటం మరచాను .... ఎవరో కుర్రాడు ఓ క్రొత్తసైకిలు తెచ్చి గదిలో పెట్టాడు .... ఓ ఉత్తరం కూడా ఇచ్చి రాగానే మీ కివ్వమన్నాడు ...." అందావిడ.

"ఏదీ ఉత్తరం !" అన్నాడు గదిలోకి నడుస్తూ.

గదిలో లైటు వెలిగేసరికి నల్లగా మెరుస్తున్న కొత్తసైకిల్ రామన్నపంతులు కళ్లబడింది.

ఇంతలో వెనకే వచ్చిన సీతమ్మ ఉత్తరం అందించింది.

రామన్నపంతులు ఉత్తరం విప్పాడు.

"పూజ్యులైన బాబాయికి !

మీరుచేసిన మేలు, నేనూ — సరోజా జీవిత కాలం మరువలేం. మీ అమోఘ వాక్చాతుర్యంతో నాన్నా — మామయ్యల మధ్య సంవత్సరాలతరబడి పెరుగుతూ వస్తున్న పగలను — ఆర్పివేసి మా కుటుంబాలను తిరిగి ఏకంచేసి, నాకు — సరోజకు మహోపకారం చేశారు. మిమ్ముల నెలా సత్కరించాలో నా కర్థం కావడంలేదు. అయినా సరోజ సలహా ననుసరించి మీ కీ సైకిలును సమర్పించుకుంటున్నాను, చంద్రుడికి నూలుపోగులా.

ఒక చిన్న తప్పుచేశాను. మీవంటి కార్యశూరులకూ, పరోపకారపారీణులకూ, ప్రఖ్యాత రచయితలకూ —ఆ కళ్యాణి పనికిరాదనే భావంతో పోస్ట్ఫీసు గోడకు ఆనించివున్న సైకిలును, మిత్రవర్గంద్వారా తెప్పించాను. దానివి మా యింట్లో అటకమీద వేయించాను. మిమ్మల్ని అనుక్షణం గుర్తుకు తెచ్చుకునేందుకు అది మా యింట్లో ఉండాలి. ఈ దొంగతనం చేసినందుకు మన్నించండి .... ఈ కానుకను స్వీకరించి మమ్మల్ని కృతార్థులను చెయ్యండి. శెలవు.

భవదీయుడు,

సుబ్బారావు.

ఉత్తరం చదివి రామన్నపంతులు ఒక్కసారిగా ఆశ్చర్యపడిపోయి "ఆరి ! సుబ్బీ ! ఎంతపని చేశావురా !" అన్నాడు.

"ఏమిటండీ !" అన్నది సీతమ్మ.

విషయమంతా వివరించాడు రామన్నపంతులు. సీతమ్మకూడా ఆశ్చర్యంతో భర్తవైపుచూసి "పోనీలెండి ! వెధవది పోతేపోయింది. దాని మోతతో చెవులు చిల్లులుపడిపోతున్నాయి. ఓసారి ఈ సైకిలును తొక్కి చూడండి" అన్నది.

రామన్నపంతులు కొన్నిక్షణాలు ఆలోచించి సైకిలుని బైటకి తీశాడు.

విఘ్నేశ్వరుడ్ని తలుచుకుని సైకి లెక్కాడు. రెండురౌండ్లు అటూ — ఇటూ తిరిగివచ్చి, వాహనాన్ని లోపల పెట్టేశాడు.

"ఎలా పోతున్నదండీ !"

"పోకడకేం ! బ్రహ్మాండంగా పోతోంది. కాని ఒక సందేహం ! నా కళ్యాణినెక్కి వీధిలో వెడుతుంటే దాని మోత విని అందరూ నే నొస్తున్నానని గుర్తించేవారు .... కాని యీ సైకిలు మోతే లేదే ! ఇంత నిశ్శబ్దంగా ఉంటే ఎలాగా ? అని ..." అన్నాడు పంతులు.

హఠాత్తుగా పీడుము గుర్తుకొచ్చింది. సైకిలు గొడవలోపడి మర్చిపోయినందుకు శిక్షగా మరింత ముక్కులో దట్టించి "చూశావటే సుబ్బిగాడి పొగరూ ! నా డెంతసేపూ నా కళ్యాణి సంగతే ఆలోచించాడుగాని నా సంగతాలోచించాడా ! .... అయినా యీ రోజుల్లో వస్తువులకావాలి గాని మనుషులూ, వాళ్ల అలవాట్ల గొడవ ఎవరిక్కావాలే !" అన్నాడు రామన్నపంతులు— విచారసూచకంగా.

"క్షమించు బాబాయ్ ! ఇందాక ఆ విషయం గుర్తు లేకపోయింది. అందుకే ఇప్పుడు పరుగెత్తుకొచ్చాను .... ఇదిగో !" అంటూ. అప్పుడే లోపలికి వచ్చిన సుబ్బారావు ఒక అరడజను నస్యపు డబ్బీలు తీసి రామన్నపంతులుకి అందించాడు.

ఆయన మొహం చంద్రుడ్ని చూసిన కలువలా వికసించింది ....

సుబ్బారావు ఆ మొహంలోకి కృతజ్ఞతాభావంతో చూస్తూ నిలబడిపోయాడు. ★



ఆహా ప్రేయసీ! నీముఖం అచ్చంగా ఆ చంద్రుడిని పోలివుంది!









# మనమూ–మనదేహస్థితి

15–వ పేజీ తరువాయి

వున్నది. విల్లస్‌ను క్రమ్మివుండే జీవకణములవరొపే ఈ గ్రంధినీ కమ్మి వుంటుంది. అయినా సూక్ష్మ నిర్మితిలో, ఆ జీవకణములకూ, ఈ జీవకణములకూ స్వల్ప భేదమున్నది. అవి ఆహారమును గ్రహించేవి. ఇవి ఆంత్రరసమును స్యందించేవి. ఈ గ్రంధిని (Luber kuhn) ల్యూబర్ కుహున్ అనే శాస్త్రజ్ఞుడు కనిపెట్టినందున ఈ గ్రంథులకు ల్యూబర్‌కుహున్ గ్రంథులు అని పేరు.

మ్యూకస్‌పొర అంతా ముడతలుపడినందునా, ఈ అసంఖ్యాకములయిన విల్లస్సులవల్లా ఆహారంతో అంటివుండే మ్యూకస్‌పొర వైశాల్యం దరిదాపు 20 రెట్లు అధికం అవుతుంది.

విల్లస్‌లోవున్న రక్తనాళములవల ప్రేగుకు పోయే ఆర్టెరీనుండి వచ్చిన ఆర్టెరీశాఖ శాఖోప శాఖలుగామారి, కేపిలరీ అవుతుంది. ఆ కేపిలరీల అంతంనుండి వెయినుశాఖలు బయలుదేరి ఒకదానితో ఒకటి కలుసుకుని, పోర్టల్ వెయినుగా ఏర్పడతవి. ఈ పోర్టల్ వెయిను లివరులో ప్రవేశించి అందులో ప్రతిలాబ్యూలునూచుట్టివుంటుందని యిదివరకే తెలుసుకున్నాము.

విల్లస్‌లోవున్న ఫేటీ ఏసిడ్లు తైలద్రవ్యములలో మాత్రమే కరగివుండగల వస్తువులూ, (విటమిన్ ఎ. డి. ఇ. కె. వంటివి) లేక్టీల్‌ద్వారా లింఫ్‌నాళములలోకి పోతవి. మిగిలివున్న ఎమ్మైనో ఏసిడ్లు, గ్లూకోజు లవణములు, యితర వస్తువులు రక్తనాళములద్వారా పోర్టర్ వెయినులోకి పోతవి. ఇన్నింటినీ పీల్చి ఆ యా వస్తువులను విల్లస్‌లోవుండే వివిధ భాగములకువంపే పనిని విల్లస్‌ను చుట్టివుండే చతురస్రాకారంగల జీవకణములు చేస్తవి. ఈ సృష్టివిశేషము చాలా అద్భుతమయినది.

జీర్ణపదార్థములోవున్న అన్ని వస్తువులూ లింఫ్‌నాళములలోకీ, రక్తనాళములలోకీ పోవాలనిలేదు. కొన్ని లవణములూ, గ్లూకోజువంటి పదార్థములూ, సరాసరి యితర వెయినులద్వారా రక్తప్రవాహంలోకి వెళ్ళిపోతవి.

ఇలియంలో జీర్ణపదార్థం ద్రవరూపంలో ఉన్నంతసేపు, అక్కడవున్న జీర్ణగ్రంథులు తమ రసమును స్యందిస్తూనేవుంటవి. ఆ స్యందితరసములు, విల్లస్సులద్వారా తిరిగి రక్తంలోకి గ్రహింపబడుతూనే వుంటవి.

అంటే, తైలద్రవ్యములనుండి ఏర్పడిన అంత్యపదార్థములు తప్ప, మిగతావన్నీ పోర్టల్‌వెయినుద్వారా లివరులోకి పోతవన్నమాట. అల్లా వచ్చినవాటిని లివరు ఏం చేస్తుంది? ఆ విషయం వచ్చేవారం చర్చిస్తాను.



# గళ్లనుడికట్టు - 90



## అడ్డం

1. నగరశరిగమనములో శైర్మల్యము.
4. నవ్వును అనుకరించు శబ్దములు ! వికవికలు వంటివా ?
7. వ్రాతకు ఇది అవసరం.
9. అతను పుట్టి శరీరం కావాలంటాడు.
10. కాంతి.
11. పడగలోనే దివాళి !
12. తెప్పలో తడవ కావాలి.
14. తలవరి.
15. చూసి కత చెప్తే ఇనుకనేం !
17. వ్రాత.
18. ఈ తడవ చివర కొద్దిగా మారిస్తే పట్టుగా ఉండే నార.
19. రెండవ తిథి తిరగబడింది.
21. లోతు ప్రదేశము.
22. గుచ్చుకోగలదు !
23. ఆజ్ఞాపత్రిక.
24. కాలు మార్చి చెయ్యి చెయ్యండి !
25. ఒక దినుసు ఆకు. ఒక పానానికి పనికివచ్చేది!
27. నేను మీసము కత్తిరించినచో కనరు తప్పదు !
31. ఒక్కొక్కరికి అర్ధభాగము.
32. కమలపాదము, అప్పుడప్పుడు ఒకటి తీసివేసి పాద రక్ష ఉంచుకోండి !

## నిలువు

2. రక్షణ తగ్గించినా ఉంటుంది!
3. వారి రక్షలోనే రక్షించు నిప్పు ఉన్నది.
5. ఫిడేలుమీద కదిలేది.
6. అబద్ధం !
8. వేగిరం గరివిడిలో రంగు పూసేవాడిని పట్టుకోండి !
9. తపస్విని కొంచెం కోసినా మారిపోదు.
10. దేని కారణములో వధ సంభవిస్తుంది ?
13. వరుసలు.
14. కూతురు.
16. కొలతవేతము, అని నగం తగ్గిస్తే వ్యాపించినది, విరివి యైనది దొరుకుతుంది.
20. చెవి తాకు పారవశ్యము కలది.
21. వాడి గుణము !
26. సున్నం తయారింపులో ఉపయోగించేది. ఒక చెట్టు.
28. అన్ని అని అర్థం వచ్చేమాట కలగాపులగమయితే చిన్న గోనె, రెండున్నర తూము.'
29. ఇంటికి త్రాడు, స్త్రీ.
30. నావ.



## 89-వ గళ్లనుడికట్టుకు జవాబు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 వే | న | 2 శి | ■ | 3 చి | ■ | 4 ఓ | ■ | 5 తే | టి | 6 క |
| ది | ■ | 7 ఉ | దు | రు | మి | డు | కు | లు | ■ | ల్లు |
| ■ | ■ | ■ | ■ | త | ■ | దొ | ■ | ■ | ■ | ■ |
| 8 క | ■ | 9 వై | ర్ర | పు | ■ | 10 డి | ము | 11 న | ■ | 12 వే |
| 13 ని | క | ల | ■ | లి | ■ | 14 కు | ■ | 15 సు | రు | గు |
| క | ■ | వ | ■ | ■ | ■ | ■ | ■ | పు | ■ | ల |
| 16 ర | గ | డ | ■ | 17 పి | ■ | 18 ధూ | ■ | 19 కొ | రి | వా |
| ము | ■ | 20 మొ | రా | రి | ■ | 21 మే | గ | డు | ■ | డు |
| ■ | ■ | ■ | ■ | క్రి | ■ | పొ | ■ | ■ | ■ | ■ |
| 22 ఆ | ■ | 23 చి | లు | వా | య | న | ము | 24 లు | ■ | 25 ఈ |
| 26 రా | మ | న్న | ■ | డు | ■ | ము | ■ | 27 పాం | దు | క |

"ఇంతకూ నీవు నేరం చేశానంటావా? చేయలేదంటావా?" మేజస్ట్రేటు గర్జించాడు.

"ఆ ప్రశ్నకు అంత తేలికగా సమాధానం చెప్పలేనండి! అదేదో తేల్చుకునేందుకేగా ఇంతవరకూ తమరు ప్రయత్నించారు." ముద్దాయి అమాయకంగా అన్నాడు.

పి. స్నేహలత (బరంపురం)

* * *

## శ్రీశైలనిధి

ముఖ్యమంత్రి కోరికపై 'ఆంధ్రపత్రిక' శ్రీశైలజీర్ణోద్ధరణ నిధి సేకరణ కాలాన్ని మహాశివరాత్రి వరకు పొడిగించింది. ఈ సదవకాశాన్ని వినియోగించుకుని విరివిగా విరాళాలు పంపవలసిందని భక్తాగ్రేసరులను కోరుతున్నాము.

# న్యూఢిల్లీ లేఖ

7-వ పేజీ తరువాయి

ఎట్లాగైతేనేమి ఢిల్లీ నగరపాలకసంఘం రిటైరైన సైనికోద్యోగి నొకరిని ఆరోగ్య శాఖాధికారిగా నియమించింది. నగర పరిశుభ్రత మరీ అధ్వాన్నంగా ఉండటం గ్రహించి, తోటిపనివారిచేత ఈయన గట్టిగా పని చేయించాడు. ఇహనేమి! ఈ తోటి పనివారల ప్రతినిధి వర్గం మంత్రులవద్ద పలుకుబడిగల ఒక రాజకీయ నాయకుణ్ణి కలుసుకుని మొరపెట్టుకున్నారు. ఆ నాయకుడు వీరిని తీసుకువెళ్లి మంత్రితో మాట్లాడాడు. "తోటి పనివారిని బాధించవద్దు" అంటూ మంత్రిగారు నగరపాలక సంఘానికి తాకీదు జారీ చేశారు. ఎక్కడ ఉన్నావే గొంగళీ అంటే వేసిన చోటనే అన్నట్లు నగర పరిశుభ్రత యధాప్రకార స్థితికి వచ్చింది.

* * *

ఇండియా మార్కు ప్రజాస్వామ్యంలో చట్టానికి కట్టుబడి బ్రతకటమే నేరమైపోయింది. ఢిల్లీ నగరానికి నెలనెలా సుమారు వెయ్యిమంది జనం తరలివస్తూంటారు. వీరు బంజరు భూముల్లో యదేచ్ఛగా గుడిసెలు నిర్మించుకుంటారు. ఈ దురాక్రమణలను నిరోధించవలసిన ఆవశ్యకత ఎవరికీలేదు. ఇలా వీరు అక్రమంగా బంజర్లను ఆక్రమించుకున్న తరువాత, ఆ మురికివాడను తొలగించాలని అధికారులు సంకల్పించారా, ప్రజాసేవతత్పరులైన రాజకీయ నాయకులు రంగంలోకి దిగి, ముందు ప్రత్యామ్నాయంగా స్థలం చూపమంటారు. కొన్ని సందర్భాలలో రోడ్లమీదఉన్న గుడిసెలు తొలగించడానికి దురాక్రమణదారులకు ప్రత్యామ్నాయ స్థలాలు చూపటంతోపాటు, నష్టపరిహారం కూడా చెల్లించవలసి వచ్చింది.

మురికివాడలలో వోటర్లను మంచి చేసుకునేందుకు కాంగ్రెసువారు, కమ్యూనిస్టులు, తదితర రాజకీయ పక్షాలవారు పోటీలుపడుతున్నారు. దురాక్రమణలు తొలగించేందుకు కాంగ్రెసుపార్టీ ప్రయత్నిస్తే, వారిపలుకుబడిమీద దెబ్బ తియ్యడానికి కమ్యూనిస్టులు, జనసంఘంవారు గూండాలతో చేతులు కలుపుతున్నారు. పొరుగువారి హక్కును గౌరవించి, చట్టబద్ధంగా మెలగే పౌరులు జరిమానాలు చెల్లించవలసివస్తోంది!

కలకత్తాకు ఇప్పుడు తయారవుతున్న బృహత్పథకంలాంటిదే ఢిల్లీకికూడా ఒక పథకం రూపొందించారు. ఏతావాతా ఆ పథకాన్ని అమలు చేసేవారెవరు అన్నదే సమస్య. కాందిశీకులను దండకారణ్యానికి తరలించలేకపోయిన పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి డా॥ బి. సి. రాయ్ మహాశయులు మురికివాడలలో నివసిస్తున్నవారికి నచ్చచెప్పి, అక్కడనుంచి పంపివేయగలరా ? అనుమానమే. ఢిల్లీపరిస్థితి అంతకంటే మెరుగ్గా ఏమీ లేదు. జామ్‌బజార్లోని మురికివాడను తొలగించేందుకు అధికారులు మరొకచోట ఇళ్ళు కట్టారు. వాడలో నివసించేవారు తమకోసం నిర్మించబడిన ఇళ్ళు అద్దెకిచ్చేసి, తాము ఉన్నచోటనే ఉండిపోయారు.

వార్తాపత్రికల ఆందోళన ఫలితంగా, ఇళ్ళు లేనివారు రాత్రిపూట తలదాచుకునేందుకు అధికారు లిప్పుడు సదుపాయాలు కలిగించారు.

ఢిల్లీలో ఈనాటిపరిస్థితి ఎంతైనా ఆకర్షణీయంగా ఉన్నది. ఎవరైనాసరే కుటుంబంతో సహా వచ్చి ఇక్కడ బంజరుభూముల్లో తిష్ట వెయ్యవచ్చు. కొంతకాలంతరువాత ఆ కుటుంబానికి తగిన వసతిసదుపాయాలు ఏర్పరచవలసి వస్తుంది. నిరాశ్రయులకు రాత్రిపూట తలదాచుకునే సదుపాయాలు లభిస్తాయి. "మీకు కలిగే నష్టం ఏమీ ఉండదు సరికదా అంతా లాభమే. కనుక ఢిల్లీకి తరలి రండి" అని స్వాగతం చెబుతూ 1962 లో కమ్యూనిస్టులు ఒక ప్రణాళిక ప్రకటించుకోవచ్చు.

* * *

చట్టాలను ధిక్కరించేవారు న్యాయస్థానాల రిట్‌లను దివ్యాస్త్రాలలాగ ఉపయోగించుకుంటున్నారు. కొన్ని న్యాయస్థానాలు 15 సంవత్సరాల క్రితం జారీచేసిన రిట్‌లతాలూకు దరఖాస్తులు ఈనాటికికూడా అపరిష్కృతంగానే ఉన్నాయి. ఇందుకు ఉదాహరణగా దిగువ విషయాన్నే పరిశీలించండి.

రెండు సంవత్సరాల తర్జనభర్జనల అనంతరం న్యూఢిల్లీ నగరపాలకసంఘం కన్నాట్‌ప్లేస్‌లోని నడవా రహదారిగా ప్రకటించింది. అంతకు మునుపు అక్కడ ఉన్న దుకాణాలను తొలగించారు. ఆ మర్నాడే కొందరు దుకాణదారులు కోర్టుకు వెళ్లి రిట్ తెచ్చుకున్నారు. రిట్‌దరఖాస్తు విచారణ పూర్తి అయ్యేవరకు దుకాణాలను అక్కడ నుంచి కదల్చరాదని న్యాయస్థానం ఆదేశించింది. ఈ తాఖీదు వచ్చి అప్పుడే ఎనిమిది నెలలు అయింది. ఇంతవరకు దరఖాస్తు విచారణమాత్రం సభూవ్తం కాలేదు. పరిపాలకులధర్మమా అని, జనంతో కిటకిట లాడుతూ ఉండే పేటలలో పాడు కేంద్రాలు వృద్ధిచెందుతున్నాయి. మురికివాడల నిర్మూలనం అసాధ్యమైపోయింది.

ఇక్కడ కొంత వివరణ అవసరం. కేసు విచారణకు వచ్చినప్పుడల్లా ప్రభుత్వ న్యాయవాదులకు ఫీజు ముడుతుంది. రిట్ దరఖాస్తులు ఎంత ఎక్కువకాలం అపరిష్కృతంగా ఉంటే వారికంత లాభం. అందువల్ల అవి పరిష్కారం కాకుండా కాలయాపన చెయ్యాలని న్యాయవాదుల మధ్య పెద్దమనుష్యుల ఒప్పందం లాంటిది ఉన్నదనుకోవాలి.



# యువ ప్రపంచం

## విద్యార్థుల సమ్మె: విమర్శలకు జవాబు



హైదరాబాద్ ఆర్ట్‌సొసైటీవారి బహుమతిపొందిన శ్రీ ఎస్. వి. రామారావుగారి చిత్రం "ప్రశాంతజీవనం."

శ్రీ పాంచజన్యం తిరుపతి విశ్వవిద్యాలయ విద్యార్థులసమ్మెను నిరసిస్తూ వ్రాసినలేఖ విద్యార్థిలోకాన్నే ఆశ్చర్యపరుస్తుంది. పాటివిద్యార్థుల సాధకబాధకాలను గుర్తించలేని ఆయన, తానూ ఐదుసంవత్సరాల క్రితం విద్యార్థినని చెప్పుకోవటం విచిత్రం. ఆయన వ్రాసినలేఖ చదివిన ప్రతివిద్యార్థి సిగ్గుపడాలని ఆయన ఆశించారు!

యూనివర్శిటీ అధికారులు నిరంకుశత్వంగా పాలించినంతకాలం గాపాలించారు. దేశంలో ఏ మూలాలేని విద్యాపద్ధతుల్ని ఇక్కడ విద్యార్థులమీద రుద్దుతున్నారు. మోయలేని భారాన్ని తగ్గించమని వేడుకొంటే, ఉదాసీనం వహించారు. బరువులను మొయ్యలేని విద్యార్థులు గొంతెత్తి ఘోషిస్తుంటే, నోరు నొక్కుతున్నారు. ఈ పరిస్థితులను సానుభూతిపరులైన చిన్నా పెద్దా గుర్తించారు.

బి. ఏ. విద్యార్థులు రోజుకు 6 గంటల చొప్పున 5 రోజుల్లో పది పరీక్షలు వ్రాయాలి. అందులో ఏ ఒక్క పరీక్షలో తగినన్ని మార్కులు రాకపోయినా మొత్తము పరీక్ష అంతా పోయినట్లే. ఈపద్ధతి శ్రీ వెంకటేశ్వరా యూనివర్శిటీలో తప్ప దేశంలో మరి యే యూనివర్శిటీలోనూ లేదు.

శ్రీ యూనివర్శిటీ విద్యార్థులకు హ్యూమన్ ఎఛీవ్‌మెంట్స్ అనే పాఠ్యగ్రంథం ఉంది. గ్రూపులో ప్యాస్‌మార్కులు వచ్చినప్పటికి హ్యూమన్ ఎఛీవ్‌మెంట్స్‌లో ప్యాస్ కాకపోయినచో గ్రూపుకు మళ్లీ పరీక్ష వ్రాయవలసినదే.

బి. ఏ. లాంగ్వేజస్‌లో జనరల్ ఎడ్యుకేషన్ అనేది పెట్టారు. యూనివర్శిటీ కాలేజీలో మాత్రము ఈ జనరల్ ఎడ్యుకేషన్ పరీక్షాంశము కాదు.

ఇహ గ్రేడులపద్ధతి. దీని పుట్టుకస్థానం పాశ్చాత్య దేశాలోనట. పాశ్చాత్యదేశాలు తిరిగివచ్చిన యూనివర్శిటీ అధికారి అక్కడి వాతావరణానికి ముగ్ధులై తన యూనివర్శిటీ విద్యార్థులకు ప్రేమతో ఇచ్చిన ముద్దుకానుక. దీనిప్రత్యేకత ఏమంటే, ఈ యూనివర్శిటీలో బి. ఏ. ప్యాసయిన విద్యార్థి పై చదువులకోసం మిగత యూనివర్శిటీలకు పోతే, ఈ పాశ్చాత్యగ్రేడులను వారు గుర్తించటంలేదు. ఈ విషయాన్ని యూనివర్శిటీ అధికారుల దృష్టికి ఎన్నోసార్లు తెచ్చినా చీమకుట్టినట్లయినా లేక ఉరుకొన్నారు.

గురివిందగింజ తన నలుపు చూచుకోలేదు. అలాగే యూనివర్శిటీ అధికారులు తమ అవకతవక పనులను తెలిసికోనిరాకరిస్తున్నారు. ఈ పరిస్థితులను అర్థముచేసికోకుండా పేపర్లో పేరుకోసం వ్యాసాలు వ్రాసేవారికి గురివిందగింజపూసకిచ్చినస్థానాన్నైనా యివ్వటం పొరబాటే అవుతుంది.

శ్రీ పాంచజన్యం తండ్రులను దుయ్యబడుతూ వ్రాసారు. అంటే వారి ఉద్దేశం తల్లిదండ్రులు కన్నపిల్లలసాధకబాధకాలను గుర్తించకుండాకసాయిగుండెతో వారినణచివెయ్యాలని గాబోలు. హృదయమున్న ఏతండ్రీ శ్రీ పాంచజన్యం మాటని సమర్థించలేదు.

సానుభూతిపరులకు మా దొకటే విజ్ఞప్తి. యూనివర్శిటీ అధికారులు తమ ప్రతిష్ఠకోసం వేలాది విద్యార్థుల హృదయాలలో ఆందోళన చెలరేపుతున్నారు. నిర్మలంగా ప్రతివ్యక్తి నిష్కల్మష హృదయంతో మా పరిస్థితులను పరిశీలిస్తే మా కష్టనష్టాలను అర్థంచేసికోగలుగుతారు.

"పాశుపతాస్త్రం" (నెల్లూరు)

### గమనిక

'యువప్రపంచం' శీర్షికకు వచ్చే వ్యాసాలూ, ఉత్తరాలూ కూడా చాలామట్టుకు 'కాంపోజిషన్' వ్యాసాలను పోలి ఉంటున్నాయి. యువప్రపంచానికి సంభవించే సమస్యలు చర్చించే బదులు చాలవరకూ అప్రస్తుతమయిన విషయాలు ఉద్బోధించే పద్ధతి కనిపిస్తున్నది! రాజకీయ నాయకుల ఉపన్యాసాలే పునశ్చరణ చేసి లాభంలేదు! యువ రచయితలు ఇది గమనించి నేటి యువప్రపంచం ఎదుర్కొనే సమస్యలను నిర్మొహమాటంగా చర్చించినట్లయితే ఈ శీర్షిక లక్ష్యం కొంతమట్టుకు నెరవేరుతుంది!

## ఆంధ్రపత్రిక

### సంవత్సరాది సంచిక

ప్రతి తెలుగు సంవత్సరాదికి ప్రకటించుచున్నట్లే శుభకృతునామ సంవత్సరాదికి కూడా 'ఆంధ్రపత్రిక' సంవత్సరాది సంచిక ప్రకటింపబడును. ఎప్పటివలెనే రచయితలు తమ రచనలను పంపి సంచిక జయప్రదమవుటకు తోడ్పడ వేడుచున్నాము. వ్రాత ప్రతులు మార్చి 5 వ తేదీ లోపల మాకు చేరునట్లు చూడ ప్రార్థన.

సంపాదకుడు.



Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Stree
Madras-1. Chief Editor ; S. Sambhu Prasad.

